ఉ. వాచకశబ్దము ల్వరనిపాతముచే విలసిల్లు వాచ్యత౯
రోచిలు మాకుఁ దాదృశత రుచ్యముగా కితరార్థరీతిగా
నౌచితి గా దటంచు మది నారసిరో పరపాతనక్రియ
ల్లోచి వసించు నప్పురి నమోఘబలాన్వితము ల్కరీంద్రముల్.

శా. పీటం బాటిలు ఘోటకావళుల యుద్భిన్నాంఘ్రివేగంబుతో
సాటిం జెందఁగ వచ్చి వాయుమనము ల్సత్త్వంబులే కయ్యెడ
న్నీటు ల్వోవఁగఁ దత్పదాహతరజోనీకంబుచే నుల్లఁ జే
డ్పాటుం జెందె నవేసుమీ భ్రమరజఃప్రాబల్యము ల్వానికి౯.

క. ఏకకచక్రపుఁజక్రిన, నేకత గాంచియు వహింప నేరక పుడమి౯
జోకటి పడు నని నగు నగు, లోకాప్తనివారుల ఫేనరుచుల హయంబుల్.

చ. సురుచిరరాజకన్యకల సోఁకుట నిత్యము రూపభావముం
బొరయుట జన్మసంశ్రయతఁ బూనుట నిక్కముగాఁ బిశాచమై
పరఁగెడుగాడ్పు వేగమునఁ బొల్పదునే సరిగాఁగ మాకు నం
చుపగతివేగసంపదల నొప్పు నదుష్టము లై పురీహరుల్.

క. అరయఁగ నెప్పుడుసత్త్వము, భరియింపమనసు లక్ష్యపదమాయను వే
సరి యెట్టు లౌ నటంచు, న్నరు లప్పురి మెలఁగుచుండు నతిసత్త్వమున౯.

సీ. క్లిష్టకల్పన లేక కష్టతాదూర మై యసమర్థత నెఱుఁగ కప్రతీత
తను మాని యప్రయుక్తతను రోసి పతత్ప్రకర్ష నైరర్థక్యఘటన గనక
దృఢపదబంధసంధిస్థిత మై సుప్రసాదకాంత్యౌజ్జ్వల్యసమత లలర
వస్త్వలంకృత్యభివ్యక్తులు పొసఁగంగఁ జిత్రవిన్యాసంబు చెలువు గనఁగ
నతులకవిరాజరచితకావ్యములనంగఁ, జెన్నుమైవాటిచూడ్కికచ్చెరువు మీఱఁ
బుష్యరథము లసంఖ్యము ల్వొలుపు మిగులఁ
బురవతంసము ద్వారకాపురములోన.

క. అచలత నవరత్నరుచి, ప్రచురత చిత్రప్రకారబహుసురపురస
ద్రచనతఁ బురిలో నరదము, లచలాధీశ్వరులమాడ్కి నలరుం జాల౯.

సీ. వెలఁది నీకై దండవెల యెంత తెల్పవే యలరునాకై దండవెల సులభమె
చను బంతు లీ రెండుఁ గొనవేడ్క చెలువరో చనుబంతు లీ రెండు గొనఁగ లేవు
ఆకాశసుమ మిదెం తభ్రమే కననీయ వాకాశసుమదృష్టి యభ్రమేకద
పలునొక్కు లకుఁ బొలుపడఁగ దే చిగురోడ్డి పలునొక్కు లిడఁగ నీపాటివారె

వింతతావులు గనఁగ నువ్విళ్లు మాకు, వింతతావులు గనఁగ నీ వెంతవాఁడ
వనుచు విటులకుఁ దమకు సయ్యాటమమర, విక్రయింతురు పువ్వులావికలు విరులు
సీ. వలపు లీనఁగ సోఁగుఁ జెలువ నీకై దండ వెల చెప్పరాదటే వలయు మాకు
వనిత పుంస్కోకిలాస్వాదితం బీనన రుచ్చి చూడ నీఁగదే రుచిరగాత్రి
పొలఁతి మాటఁగ నేలు పొన్నపువ్వీది మాకుఁ జెన్నారు వన్నె చేమిన్న ముట్టె
వలువలో డాఁచెదు వలుద పూబంతులు పుట్టినయవి గానఁ బుట్టె మనసు
అనుచు నాగరవిటులు నర్మానుబంధ, బంధురంబుగఁ బల్కెడు పల్కులాని
గోము మీఱిన నవ్వుల మోము లలర, నమ్ముదురు పువ్వులవ్వీటనలరుఁబోండ్లు.
ఉ. పోయినవారిఁ దేవసమె పుత్త్రుడి బొజ్జకునైన మాదు చూ
చాయల చాయనే చనిన చక్కెరవిల్తుని చాయ నెన్నికం
బోయఁగఁ జేయు లక్షణకుఁ బొల్పడు మాయబలాక్షిపదం బనా
జాయ విటాళి లోఁగొనుచుఁ జక్కని వేశ్యలు పొల్తు రప్పురిన్.
చ. సతతగిరీశభావమున సమ్మతశుద్ధకళావదాఖ్యసం
గతశివమూర్తియైన నధికస్ఫురదక్షికటాక్షవీక్షణా
చితగతిమాత్రనే రతివిశిష్టపరంపర లీను నిక్కువా
బతిశివమూర్తు లంచు విరులందఁగ వేశ్యలు పొల్తురప్పురిన్.
సీ. చందనాలయమహాచలరాజరాజత్సుగంధచందనగంధకలన మీఱి
నానామహీరుహానూనవవ్యామోదసుమగుచ్ఛపరిమళస్ఫూర్తిఁ దనరి
రసరమ్యపద్మినీ*రాగసంగమపరిప్రాప్తంబు మధుసేవఁ బరిఢవిల్లి
సకలవధూటికాసముదయాశ్రయకామసంతతాధారతాసరణి నలరి
మెలఁగుచుండెడు మేనును మేను నెపము, నతులభీతిని బలెమందగతులు సాగియు
నప్పురంబునఁ జరియించు నహరహంబుఁ, బట్టణగకోనిమ్మదుమరుద్బ్రహ్మచారి
సీ. శక్తిత్రయజ్ఞానసంపత్తి నలరారి పంచాంగనిర్ణయప్రౌఢి మెఱసి
‡యావాప్యతంత్రకార్యక్షమత్వము గాంచి వృద్ధిక్షయంబులవిధము తెలిసి
చతురుపాయవిచారచాతుర్య మిరవొంది షడ్గుణాపజ్ఞాప్రశస్తి నెరసి
రాజ్యాంగసప్తకరక్షకస్థిత్వము లూని ద్వాదశరూపవిభేద మెఱిసి
మతిబలస్ఫూర్తి నలబృహస్పతి కిమించి, యఖిలవిద్యల నెచట †సామ్యంబు లేక
యప్పురంబున నలఘుమహానుపమాన, మానగుణరత్నఖనులు ప్రధానవరులు

§ పదంబాన — మూ. * రాముసంగ — మూ. ‡ ఆవాప్య — మూ. † సామ్యంబు — మూ.

క. ప్రథమానిర్దిష్టతఁ బ్రా, గ్పృథగణ ముపసర్జనత్వబోధకు నమగుం
ప్రథమానిర్దిష్టత నగు, ప్రథ నుతధన్యత్వ మొనరఁ బరఁగి రమాత్మ్యల్.

వ. ఇట్లు సకలపురలక్షణలక్షితం బై నిఖిలలోకవీక్షాపేక్షాసేచనకం బగునప్పు
రంబను ధరానుకూలవల్లరీనాయకరత్నం బెవ్వ రనిన.

చ. కలఁగనివాఁ డదెన్నఁటికిఁ గాననివాఁడు జగద్ధితార్థియై
కలఁగనిమానవప్రకృతిఁ గాంచినవాఁడు నిజాశ్రితాభిదా (?)
గలకనియైనఁ గావనను కట్టడిమాటకుఁ గానివాఁడు మే
ల్కలఁగనిచాయ నవ్వఁగనుగల్గిన నిద్దపుమోమువాఁ డొగిన్.

ఉ. తప్పనివాలువాఁ *డనిని దప్పనిమాటలవాఁ డొకప్పుడుం
దప్పనివాఁడు నమ్మికలు దప్పనిబంతి మెలంగువాని వె
న్దప్పనివాఁడు తప్పులకుఁ దప్పనివారలఁ బ్రోవనన్నవా
తప్పనివాఁడు ద్వారవతిఁ దప్పనినీతిగ నేలు నెప్పుడున్.

సీ. సచ్చిదానందలక్షణలక్షితుం డౌచు వేదాంతలక్ష్యత వెలుఁగు నెవఁడు
జగదుద్భవస్థితిసంక్షయహేతుత సర్వజ్ఞతాతిప్రశస్తిఁ బెవఁడు
మాయానుబింబితమహనీయతేజుఁడై క్షేత్రజ్ఞవృత్తిచేఁ జెలఁగు నెవఁడు
సేవకాభీష్టార్థసిద్ధ్యర్థమై బహురూపనామముల నిరూఢుఁ డెవ్వఁ
డతఁడుపరముండుసకలలోకానుశాస, నార్థమయథార్థమనుజవేషార్థియగుచు
గృష్ణుఁ డనునామ మఘవనకేలి గాఁగ, నతిముదంబున ద్వారకనధివసించు.

సీ. ప్రాఖినుక్కఁగమితమ్మిపట్టుప ట్టగునంచ యంచతేజీతేనిఁ గాంచువేల్పు
వేల్పురాతాచాయవెలయు చక్కనితండ్రి తండ్రి నెఱుంగక తనరుప్రోడ
ప్రోడచేరునకాండ్రఁ బ్రోచుమీఁదటిగిడ్డి గిడ్డిమందలనుండు దొడ్డజంత
జంతరక్కసికానదొంతు లేర్చెడుచిచ్చు చిచ్చుకన్గలవాని నచ్చుజోడు
జోడుకన్నుల నెకఁ జల్వఁ జూపుమేటి, మేటిసుడివాలుఁ దాల్చినమేలుబంతి
బంతివతెవ్రేల బలుకొండఁ బట్టుదిట్ట, దిట్టముగ నేలు నవ్వీడు తెలివిమీఱ.

సీ. తనసుదర్శనలీల తనసుదర్శనలీలకరణిచేఁ బరదానగరిమ మెఱయఁ
దనవిక్రమస్ఫూర్తి తనవిక్రమస్ఫూర్తియనువున జగముల నాక్రమింపఁ
దనవేత్రమహిమంబు తననేత్రమహిమంబువగిదిఁ జిత్రాలోకపటిమ నెఱపఁ
దనకరాంభోజంబు తనకరాంభోజంబుపోల్కి నసాధ్వసామోదము లిడ

*డనిన.

ద్వారకాపురి నేలును దారమహిమ, మహిమలయు భారము దుపఁగా మనుజలీల
నతిపరాయత్త సంరక్షణక్రియాప, రాయణుం డగునట్టి నారాయణుండు.

సీ. నిగమశిఖాపద్మినీచారుహంసంబు నిరవద్యసద్గుణనీరరాశి
నిజదాసఖేదాగ్ని నిరసఁ‡నాంభోదంబు నిర్మలకీర్తిధునీమహాద్రి
నిఖిలార్థదాననిర్నిద్రభూమిజంబు నిరుపమవైభవనిత్యవసతి
నిరవధికానందనియతినివాసంబు నిటలదృక్ప్రముఖసురనికరనేత
యలరు ద్వారక సర్వలోకాతిశాయి, చాతురీలేశ(హృత)బహుళాతతాయి
(సాధు)చేతనమానసోత్సవవిధాయి, మాయిజనమాయి విబుధసన్మానదాయి

సీ. సైంధవజలమధ్యసంచార మందుట గిరిధారణోదీర్ణకీర్తిఁ గనుట
భూదారభావంబుఁ బొందుగాఁ బడయుట నరసింహవేషంబు నలువుకొనుట
బలిదైత్యగర్వసంపత్తి హరించుట రక్తైకతర్పణరతి నెనయుట
ఖరదూషణోద్వృత్తి కలిమి వారించుట నిజకామపాలత నెఱి మెలఁగుట
యతిపరశ్రుతిగతుల సన్నుతి గలుగుట, సతులితంపుఁ బ్రసాదిత్వ మానిమనుటఁ
బూర్వపరలీలలప్పుడ పూనికొనుచుఁ, గృష్ణుఁడలరారు నధికరోచిష్ణుఁ డగుచు

సీ. నెనరుఁజూపులవాఁడు గొనువానిఁ గనువానిఁ గనువానిఁ గనినరూపొనరువాఁడు
పొనరునవ్వులవాఁడు మొనమించు మొనమించు మొనమించు జిగివల్వ నెన [యునాఁడు
భంగ మందనివాఁడు రంగారు బంగారు బంగారుఁబోఁడి చేపడినవాఁడు
కడలినుండెడివాఁడు కడపల్లు కడపల్లు కడపల్లు మహిమంబుగాంచువాఁడు
కలఁడు లేఁడను రెండుమాటలకు మించి, వింత యగుకల్మిచే విజృంభించువాఁడు
కృష్ణుఁ డనుపేర నఘు మణఁగించువాఁడు, పురుషుఁ డాద్యుండు ద్వారకాపు [రికి ఱేఁడు.

వ. వెండియు జగజ్జన్మాదికారణం బైన యప్పురుషోత్తముండు నిఖిల*విశ్వం భరాభరోపసంహారార్థంబుగా దేవకీవసుదేవులకుఁ బుత్త్రభావంబున మాయామానవశరీరం బవలంబించి యత్తఱి డునుప నందయశోదానందకం దంబై నందునిపల్లియయందు యశోదాత్తస్తన్యఫలాయమాన నిజశిశుశరీర పోషణండై వసియించుచుఁ దత్కాలంబునఁ బూతన విగతచేతనం గా వించి శకటాసురు హరించి తృణావర్తు నడంచి నిజైశ్వర్యజ్ఞాపక విశ్వరూ

‡నాంభోజంబు—మూ. *విశ్వంభరాభరా భరోపసం—మూ.

పస్త్రదర్శనాద్యద్భుతంబుల యశోద స్సవిస్మయానందంబుల నందించి యమళార్జునంబుల భంజించి బృందావనంబున గోపాలబాలకబలరామసహితుండై గోవత్సపరిపాలనం బభ్యుపగమించి వత్సాసురు విదారించి బకదైత్యు మర్దించి యఘాసురు ఖండించి చతుర్ముఖమాయావినిర్మిత గోగోపవత్సాపహరణనిమిత్తంబునం దాన గోగోపవత్సరూపంబులు ధరించి విహరించి ధేనుకు మథించి యమునాహ్రదంబున నుండు కాళీయోరగంబు వెడలించి దవానలంబుఁ గబళించి ప్రలంబునకు బలునిచే లయంబు ఘటింపించి గోపకన్యాసహస్రక్రీడనం బంగీకరించి విప్రభామలఁ గరుణించి గోవర్ధనాచలం బుద్ధరించి సుదర్శను శాపవిముక్తుంగా నియమించి శంఖచూడు జముం జూఱం బంచి వృషభాసురు మాయించి కేశిదైత్యు* మాయించి వ్యోమాసురు నిర్జించి మథురాపురంబునఁ గువలయాపీడమహాగజంబుఁ ద్రుంచి కుబ్జావక్రతానివారణాద్యద్భుతకృత్యంబులు నిర్వర్తించి బలరామసహితుండై ముష్టికచాణూరుల నిగ్రహించి కంసన్యగ్రోధాది నృశంసుల హింసించి యుగ్రసేనుఁ బట్టాభిషిక్తుంగా ననుగ్రహించి ‡ బ్రహ్మచారితోరీకరణపూర్వకంబుగా సాందీపుని సమీపవర్తిత్వం బనుసరించి పంచజనుం గీటడంచి తద్దేహగతశంఖంబు ధరియించి జముని వలనం దెచ్చి గురునకుం బుత్త్రు సర్పించి యక్రూరముఖంబున గోపికల ననునయించి జరాసంధుఁ గాందిశీకుంగా ఘటియించి కాలయవనపరిత్రస్తమథురాపురజనావసార్థంబు వార్ధిమధ్యంబున ద్వారకానగరంబు విశ్వకర్మనిర్మాతచే నిర్మింపించి యందుఁ దన యోగమాయా బలంబున మథురానివాసుల నాదటఁ బ్రవేశింపించి ముచికుందుచేఁ గాలయవనుసమయు సంకల్పించి ముచికుందుం గృతార్థసార్థనాహుంగా సభిమతించి జరాసంధుఁ బునర్దండయాత్రానిమిత్తక ప్రవర్షణపర్వతారోహణానంతరంబ తద్గిరిదాహంబు గావించి బలరామ సహచరుండై ద్వారవతియందు నివేశించి తదనుసమయంబున రుక్మిణీనామంబున మానుషీవేషంబున దీపించు మహాలక్ష్మి లక్షణవతిం బరిగ్రహించి యాభాగ్యవతియందుఁ బ్రద్యుమ్నకుమారు నుత్పాదించి జాంబవతివరియించి సత్యభామం బరిణయించి శతధన్వుని సమయించి దీపించుచు మఱియు ననేకధాపన్నంబై యుపమాలంకారంబు ననుకరించుచు ద్వితీయప్రతిభటరహితంబై యనన్వయంబు ననుసరించుచు, నేకధర్మాశ్రయంబై యుపమేయో

---

* ఇఁకూడ మాయించి యనియే యుండెఁ. నా.

‡ బ్రహ్మచారితోరీకృతాఙ్గపూర్వం. మూ.

పసూలంకారంబు హసించుచు భేదాభేదవాదనిదానం బై స్మరణాలంకారం
బు నిరసించుచుఁ బ్రకృతోపరంజకం బై రూపకాలంకారంబు ననుగ్రహిం
చుచుఁ బ్రకృతోపయోగిక్రియార్థాప్రాకృతస్వరూపం బై పరిణామంబు నా
దరించుచు రసికజనప్రతిభావిలాసగృహీతానుభవం బై భ్రాంత్యలంకారంబు
లోఁగొనుచు నిషేధవచనప్రతియోగి యై యపహ్నవాలంకారంబుఁ గా
దనుచు బహుజనపరికల్పితబహూల్లేఖం బై యుల్లేఖంబుఁ జేకొనుచుఁ
ద్విప్రకారమనోహరం బై యుత్ప్రేక్షాలంకారంబు మాఱ్కొనుచు ననిశ్చ
యాంతం బై సందేహాలంకారంబుఁ దోడుకొనుచు మహావాక్యప్రతిపాది
తైకత్వం బై నిదర్శనాలంకారంబు విడంబించుచుఁ గవిప్రౌఢోక్తివిషయం
బై యతిశయోక్త్యలంకారంబుఁ దిరస్కరించుచు నవర్ణ్యా‡తవర్ణ్యం బై
ప్రతీపాలంకారంబు నిందించుచు బింబప్రతిబింబభావోపేతం బై దృష్టాంతా
లంకారంబుఁ బరీక్షించుచు హితాహితతుల్యవృత్తికం బై తుల్యయోగితా
లంకారంబు నాజ్ఞసేయుచుఁ బ్రసిద్ధాధిక్యవిలసితం బై వ్యతిరేకాలంకారంబు
వంక లెన్నుచు సమాహితసార్థముక్తినిలయం బై సహోక్త్యలంకారం
బు నాక్షేపించుచుఁ దత్ప్రతిభటశబ్దార్థసంసేవితం బై వినోక్త్యలంకారంబు
ననుగమించుచు నర్థాంతర†సమాక్షేపాధిష్ఠానం బై సమాసోక్త్యలంకా
రంబు నుల్లసం బాడుచు సద్భావరమ్యం బై పరికరంబుఁ గినియుచు నా
నార్థనిధానం బై శ్లేషాలంకారంబుఁ జౌకసేయుచుఁ బ్రస్తుతకార్యప్ర
త్యాయనసమర్థం బై యప్రస్తుతప్రశంసాలంకారంబుఁ జౌకళించుచుం
గార్యానుమేయకారణభావం బై ప్రస్తుతాంకురాలంకారంబు నవఘళించు
చు వ్యాప్తిసముల్లసితం బై యనుమానాలంకారంబు బెదరించుచు విశేష
భావగమ్యం బై పర్యాయోక్త్యలంకారంబు విదళించుచు *విధినిషేధవచ
నమూలం బై నిషేధాలంకారంబుఁ బ్రతిషేధించుచుఁ బరిహృతవిరోధం
బై విరోధాభాసాలంకారంబు విరోధించుచు నకార్యసంబంధం బై విశేషో
క్త్యలంకారంబు నవమానించుచు నకారణకార్యవశంగతం బై విభావనా
లంకారంబు నిరోధించుచు విలక్షణకార్యోత్పత్తిమంతం బై విషమాలంకా
రంబు బహూకరించుచు విచిత్రప్రయత్నసంబంధి యై విచిత్రాలంకారం
బుఁ బోనాడుచు సూక్ష్మోదారం బై సూక్ష్మాలంకారంబు మన్నించుచుం

‡తాపర్ణ్ణంబై-మూ. †సమాధోపాధిష్ఠాన-మూ.

*విధ్యలంకారవిషయ మిందులోపించినదేమో.

‡గారణమాలాలంబంబై గుంభాలంకారంబు ఘర్షించుచు గృహీతముక్తం
బై యేకావళ్యలంకారంబుం గసరుచు దీపకైకావళీయోగం బై మాలా
దీపకంబుఁ గికురించుచు నుత్తరోత్తరగుణోత్కర్షం బై సారంబు వెలయిం
చుచు మఱియు నుపాదానలక్షణలక్షితం బై జహదజహల్లక్షణావ్యాపార
ద్వయంబు జయించుచు వృద్ధ*నిష్ఠాపదసర్వనామస్థానం బై సంస్కృతశ
బ్దానుశాసనంబు ననుశాసించుచుఁ జతుస్సాధనాభిగమ్యం బై ప్రమాణ
దర్శనంబుఁ జుంబించుచు, నిశ్చితవేదార్థం బై వాక్యశాస్త్రంబుఁ గేలిసే
యుచు నద్విత్వం బై ప్రాకృతవ్యాకరణంబుఁ గారించుచుఁ బ్రత్యయసుల
భం బై ఛందంబు నపలపించుచు స్థిరప్రాణ్యుపకృతిపదం బై వికృతివ్యాక
రణంబు నపహ్నవించుచుఁ బ్రకృతివికృతిసంశ్రయం బై మహానాటకంబు
నదరించుచు నమితం బై గద్యకావ్యంబుఁ గాకుపఱుచుచు సువృత్తావృతం
బై చంపూప్రబంధంబు ననుబంధించుచుఁ గళాస్వరసహితం, బై గాంధర్వ
విద్యం గంపించుచు నస్తోకహస్తలక్షణమధురం బై భరతంబు గనికరించు
చుఁ దనరూపంబు మిగుల వెలుంగ నసముండేని సముం డై యుదరుం డ
య్యు సదరుం డై యరిభరణప్రవీణుం డయ్యు నరిహరణప్రవీణుం డై స
విశేషుం డయ్యు నవిశేషుం డై యమానుం డయ్యు సమానుం డై యుగ
దుం డయ్యు సగదుం డై వనవిహారశీలుం డయ్యు నవనవిహారశీలుం డై
సోదయుం డయ్యు ననుదయుం డై శేషి యయ్యు నశేషి యై యహీన
నిద్రాముద్రుం డయ్యు నిద్రావేశరహితుం డై యసర్వజ్ఞుం డయ్యును సర్వజ్ఞ
నాధారత మెఱయుచు లోకబాంధవుండు గావునఁ గమలాలయామోద
ఘటకత్వంబునం దమోహరణపాటవంబునఁ బాటిల్లుచు స్పర్శవిధుండు గా
వున జగదాహ్లాదకరత నమలినతారావళీమనోహరతం బ్రవర్తిల్లుచు సమవ
ర్తి గావునం బ్రియాప్రియతుల్యయోగదండధరత ధర్మనిర్వాహణధురంధరత
నాలంబించుచుఁ గాలుష్యంబు వర్షాసరిత్సరజ్జలకుపితాంగనాహృదయంబు
లయంద పదనియమాభావవర్ణవైపరీత్యంబులు ప్రాకృతవ్యాకరణంబునంద
యస్పష్టాలంకారత సురతమృదితముదితాధ్వనికావ్యంబులయంద విరాగత
చుంబితకాంతాధరంబులయంద యసుందరత్వంబు మధ్యమకావ్యంబులంద
నీరసత్వంబు వజ్రాదిమణిచిత్రకావ్యంబులంద నిరర్థకత్వం బపుష్టపదంబులం
ద యకళావత్త్వంబు ద్రుతప్రకృతులయంద వక్రత కాంతాఘాలాలక శరవిశే

‡ ఇందుఁ గారణమాలాగుంభశబ్దములు తాఱుమాఱయినవి. *శిష్టా-మూ.

పార్థచంద్రులయంద ప్రత్యాహారవర్ణాకర్ణాకృష్టధనుఃప్రయోగయంద కఠినత లలనాకుచకటితటంబులయంద నీరసకావ్యతర్కోక్తికదంబంబులయంద ప్రదోషత రజనీముఖాసంస్కృతంబులంద యర్థభేదంబు శ్లేషయంద వృత్తిభిద యలంకారశబ్దమనంబులంద నిర్దయత మదనకదనకదనంబులంద స్వపక్షాభావంబు కేవలవ్యతిరేకహేతువునంద దారిద్ర్యంబు మృగతృష్ణామృగేక్షణామధ్యంబులంద కళంకంబు కళానిధియంద చాంచల్యంబు చంచలాక్షీకటాక్షసైంధవఖురాంచలంబులంద యనమ్రత యసజ్యచాపంబులంద యప్రసాదంబు మేఘావృతదినంబులంద యగుణాశ్రయంబు సురతభిన్నహారంబులంద యహిభయంబు పాతాళంబునంద యస్ఫుటత్వంబు వీణాకలకలవాద్యభేదంబులంద మానభంగహేతుత నాయకకృతనాయికాచరణపాతంబునంద పతత్ప్రకర్షత సముద్రతరంగంబులంద యనభిజ్ఞనిబంధనంబులంద యపాత్రత యుపరత నాట్యరంగస్థలంబులయంద మిథ్యావాదిత యద్వైతవాదులంద యప్రకాశత గుప్తవైతానాగ్నులయంద వికృతభావంబు ప్రాకృతాంధ్రభాషలయంద సమాధి పదబంధయోగీంద్రమానసంబులయంద మెలంగ నఖిలజనులు నగ్నిమాడ్కి శుచిమంతు లయ్యుఁ దాపకారిత్వ మెఱుంగక చంద్రుమాడ్కి నాహ్లాదకరు లయ్యుఁ గళంకులు గాక రవిభాతి సాభ్యుదయు లయ్యు నస్తంగతిఁ గొనక మేరువుకైవడి నున్నతు లయ్యుఁ గాఠిన్యంబు గనక పయోధిచెలువున గాంభీర్యరత్నాకరంబులు గొంచియు భంగంబులు దెలియక కుబేరువడువున నర్థసంపన్ను లయ్యుఁ బరాశ్రయంబు సేయక యింద్రువైఖరి నిరుపమభోగశాలు లయ్యు దృష్టిభేదంబు లధిగమింపక యనుపపన్నక్షేము లై యనుగతమోము లై యప్రాప్తపవాము లై యాశ్రితసాధువాదు లై యనురసప్రసాదు లై యతిప్రియవాము లై యతిశయితవినోదు లై చెలంగం బరిపాలనంబు సంఘటించు సమయంబున.

[—: కథాప్రారంభము :—]

క. రిక్కలదొరకళ కిది యమ్మక్కనదే యెంత చెలువ మమ్మక్క యనం
జక్కఁదనంబుల కుప్పగు, నొక్కసరోజాక్షి రవితనూభవ యలరున్.

క. అందముగల తలిదండ్రుల, మందానందమునఁ బెనువ మందిరమునఁ గా
ళిందీనామతఁ బెరిఁగె న, నిందితయమునాతరంగిణీసోదరి యై.

4

వ. ఇట్లు పెరుఁగుచు నబ్జాలి తన శైశవంబున.

సీ. చెలులతోఁ బరివేషములు మెలుతనబొమ్మరిండ్లుగాబొమ్మపెండ్లిండ్లు సేయుఁ
దారకాగ్రహవిధితయణులతోఁ గూడి యొప్పుగా వెన్నెలకుప్ప లాడుఁ
దనవారు నయ్యింద్రధనువుల్గాని నెక్కి యింతులతోడ నుయ్యాల లూఁగుఁ
గూన్పుకన్నియలతోఁ గూడి కుంభంబునఁ గొమ్మొప్ప గుజ్జనగూళ్లువండు
మొగులుచాటున*దాఁగిలిమూఁతలాడు,సప్తఋషిబాలికలతోడసరసమాడు
సంచబోదల కెల్ల నాట్యములు గఱపు,బాల నవశైశవారంభవేళలందు.

చ. జలదముమాటునం బొలిచి చాన మెఱుంగయి మిన్నువాఁకయం
‡చలమునవిల్చి యంచయయి, చంద్రపిఱుందఁ దదీయరేఖయై
మలయును బుష్పఁదీఁగెయలమాఁటునఁ గల్పకవల్లి లీలయై
లలిఁ గికురించుఁ దోడిచెలుల న్సతి†దాఁగిలిమూఁతలాడుచున్.

క. నీలాభగవత్యంశజ, బాలిక బాలారవిందపంక్తులు దిశలం
జాలం జాల రచించును, లీలన్ శ్రమపడుచుఁ ? దనము లేఁజూపుగమిన్.

క. దిన మొక్కచాయఁ బెరుఁగుచు, వనజాయతనయన చూడ వన్నెఁదనర్చున్
మనసిజుఁ డాడింపఁగ గవి,నసదీసిన పసిఁడిబొమ్మచందము మెఱయన్.

చ. మదపతి వాక్యపద్ధతి సముచితరీతి ఘటిల్లి వర్ణముల్
పదులు గణింప నైదు నొకపట్టున నొక్కొకచోట నాలుగే
పదులు వసించు నొక్క యెడఁ బాయును న్సొగ లిపుల్మరొక్కెడం
గదిసి మెలంగెడుం దెలియఁగాఁ బదియు న్మఱి నాల్గువర్ణముల్.

క. వైదర్భిమీఱు నెచ్చెలి, వైదర్భీరీత్యుదీర్ణవైభవగసధా
రోదారకవిత యొప్పు స్ర,మోదావహ గాదు రసికపురుషుల కెల్లన్.

క. పదచిత్రతార్థచిత్రత, లొదవినకవితయు విచిత్రమొుఁ గనుపట్టెం
బదగతుల సొంపుం శై,యది నియమము మను మెఱపె నబ్రముచూడన్.

సీ. సుప్తిజ్వ్యశేషసంశోభితత్రివిధశబ్దంబులు దోషసర్వస్వమొదల
శయ్యా సముచ్చయ సత్పాకపద్ధగఁ ద్రివిధగుణంబుల రీతు లమర
వృత్తులు చెలువార వివిధరసానుగపదవర్ణసమానసప్రాప్తు లొనర
వ్యంగ్యంబు ముప్పాన్నె లమర శబ్దార్థవైచిత్రివిశేషము లెన్నమిగుల
వాగ్బలంబైనకవిత చెప్పంగ నేర్చెఁ, బ్రాంతిచమువులప్రోపుగారాపుఁబట్టి
విమలతన్త్రితిమాధురివిన్నయపుష్కవిగుమలుకవితగుమతియుఁగాంచఁగలరె.

* దొంగుడుమూఁతలాడు-మూ. ‡ యాంచలనమునిల్చి-మూ. † దాగిలిమూచులాడుచున్.

సీ. సంతతసన్న్యాససంచారిణిగఁ జేసె సారసాహారిహంసవ్రజంబు
వీణాక్వణత్పాణి వాణి యంతర్వాణి వాణివిశేషసర్వజ్ఞఁ జేసె
బంధురగాంధర్వపాండిత్యనిధిఁ జేసె విమలాశ్వవదనసాధ్వీజనంబు
సర్వభారతశాస్త్రసంవృతగాఁ జేసె రమితగీర్వాణపర్వాస్యముఖులు
కల్పితానల్పసంకల్ప(కావ్య)కథలు, లలితోక్తులు మీఱఁ గల్పనలు చేసి
యుద్దినద్దివ్యమునిసతీతిలకకులము, వెలయఁ గాళింది సద్బాల్యవేళయందు.

సీ. ఉదయవేళల వాణి యురువృత్తి బహువృత్తిబోధకగ్రంథము లొప్పఁగ నేర్పెఁ
దరువాతి యెడ ధరాధరరాజనందన మహితాగమోక్తిమర్మములు దెలిపె
దాపిసిమ్మట రమాతరళాక్షి రత్యలంకారశాస్త్రములు పొంకముగ నేర్పె
నెడనెడ రశ్మీతి నెసఁగు పన్నగరాజు శిబిరహాస్యంబు చక్కఁగఁ బలికె
గౌతమవ్యాసకణచరకపిలజైమినులు స్వనిర్మితదర్శనంబులు నొడివిరి
మూఁడుమూర్తులముద్ద యాప్తోక్త తంత్రి
యంకమునఁ బ్రోదిగాంచు నయ్యబ్జముఖికి.

క. చదువులగని కన్యాయన, చదువులు ప్రోహాయించు నేర్పు సవిత్రుతనుజ దాఁ
జదువులు సాకల్యంబుగఁ, జదివె ననుచు ప్రస్తావంబు చలుపఁగవలెనా.

వ. అంత.

మ. గణుతింపన్ స్మరజీవనౌషధి యనంగ బ్రహ్మాతంత్రాంకురా
ర్పణసర్వంసహ కామదైవతసపర్యావాహనాకాంక్షణా
క్షణ మజ్జాస్త్రజగత్త్రయీవివశకృత్సంమోహనాస్త్రంబు భూ
షణసాకల్యసమానవేష మయి యోషాయౌవనం బొప్పెడిన్.

క. ముంగురులరంగు లలవడె, నంగనపాలిండ్లు మిట్టలై కనుపట్టెన్
అంగముల మెఱుఁగు లెక్కెను, శృంగారముతోడఁ జెలికి సిగ్గును గదిరెన్.

సీ. నానాఁట నవయౌవనంపుఁబూదోఁటలో రహించుచు మదనాంకురంబనంగ
ననుపమనవయౌవనారంభజలరాశి లలిఁ దేలు పవడంపులతిక యనఁగ
సరసలావణ్యవర్షాకాలమున వాటి రంగుమీఱిన క్రొమ్మెఱుఁగనంగ
సలలితప్రాయంపుసానఁ దేఱి లసించు నసమాయుధుని మోహనాస్త్రమనఁగ
బాలశశిరేఖ దినదినంబాలి నెగడి, మెఱయుఁ గళలంతకంతకు మిక్కుటముగ
వరుసఁ సంపూర్ణభావత వఱలు కరణి, నమరెఁ గాళింది నవయౌవనాగమమున.

మ. తెఱఁగై బాల్యము వోవ బాల యతిదీప్తిం జూడఁగా నొప్పె వా
తెల్లసొంపుం గటి పెంపు మేనుజిగి యుద్దీప్తస్తనౌన్నత్యము
న్నరిపంపున్నడతీరు పాదములయొప్పం గాను లేమిం గనన్
ఓఁవాయన్ జళిపింప నమ్మదనిచే నొప్పారుఖడ్గం బనన్.

సీ. కుటిలప్రచారము ల్కుంతలంబులఁ జొదేఁ జపలభావము నేత్రసరణిఁ జేరెఁ
బింకసాంగత్య మేర్పడ ఫాలమున నుండె నతిరాగవిలసనం బధర మంటెఁ
గఠినత్వమెల్ల నొక్కటఁ గుచంబులఁ జెందెఁ బట్టువీడమి నితంబమున నిలిచె
కలుము లెఱుఁగముల్ గానుడిఁగె వసించె జాడ్యంబు నడపులజాడ నమరె
ముఱిప మెల్లను సిగ్గులో ముడిఁగికొనియె
*గుత్తెఱుంగమి యలనాభిఁ గ్రాచికొనియె
నెలఁత తన బాల్యచేష్ట లన్నియును దన్ను
బాయకుండఁగ నొప్పె యౌవనమునందు.

చ. అలరువసంత మబ్బినపు డొ నొకకొన్ని దినంబు లింతె మా
కలుములు నప్పుడు న్నమత్కై †కొఁలగా మని పల్లవంబు లా
జలజదళాక్షిపాదజలజంబులు గైకొని పూజనల్పు న
య్యలరు లనాఁగఁ బాదనఖరాంకురము ల్గనుపట్టు నింతికిన్.

క. జిగి దప్పి చుక్కగమి యా, మగువపదనఖాలిఁ గోడ మార్కొనలేమిం
బగ లుడిగి యుండుటం గద, గగనములో డాఁగి రేయి గనఁగు బెల్లన్.

గీ. నిలుక డెఱుఁగని చిగురాకునీటు దెంత, తాపడిన పద్మరాగమ్ము రాణ యెంత
పొగసుఁగెందామరలసొంపుచూఱకొన్న, వనితపదములతో సాటివచ్చు టెల్లు.

చ. ఎడసినకాండసంపదల కెంతయు స్రుక్కుచు వాడు టంది తా
లుడుగని వేతకోఁతలకు నోర్చుదొన ల్కలమంపుగర్భముల్
జడిమ వహించెఁ గాన సతిజంఘలతో సరిగాఁగ నేర్చునే
జడమతు లైనవారలకుఁ జిక్కఁగఁ జిక్కునె సద్విచారముల్.

క. సరసిజలోచనజంఘల, సరివత్తు మటంచువచ్చి శరములపా లై
యిరుగడలఁ గట్ల పాలై, శరధులు కడు నొగిలెఁ దగనిసాహస మగునే.

క. మృదుపదమై మాధుర్యా, స్పద మై చెలిజంఘ రసము చాలఁగఁజిలుకన్
మృదుపదమై మాధుర్యా, స్పదమై యలరారు రచనపదువు దలిర్పన్.

---

*గుఱెఱుంగమి — మూ. †సముకగైకొం గామని — మూ ౨. సముక్త గైకొనఁగా ?

క. పొరలేక సరస తెడలక, వరపల్లవవితతితోడ*వర్తింపక యు
ద్ధరపైఁ బడి తలక్రిందై, పరఁగిన సరిరాదు రంభ పదఁతతితోడలతోన్.

చ. తలవిరియంగఁ బోసికొని తద్దయు నాకులపాటు దోఁపఁగా
జలముల నెప్పుడు న్నిలిచి సర్వశరీరము భూతిలిప్తమై
వెలయఁగఁ బాడ్లుఁ బూలుఁగొని వేసరకెప్పుడు మోచ దాఁ దపం
బలవడఁ జేయుచున్నయది యర్కసుతోరుతులా‡ఫలాప్తితన్.

క. అతిమృదు వగు సతియూరుల, నతికఠినపుఁగరికరంబు లారసి చూడ
న్మతి రాదయ్యెఁ బ్రతీపమె,హిత మన్నా సుపమ నుడువ నిలఁ బ్రాజ్ఞులకున్.

గీ. పూర్వపరరూపమంజిమస్ఫూర్తిఁ గాంచి
చెలువకటి పాణినీయంబు చెన్నుగాంచుఁ
బృథ్వివిపులాతిహృద్యసద్వృత్త మగుచు
వేదపాద్మబనా మది వేడ్కఁ జేయు.

క. నీల తానొట నయ్యాలి, నీలాలక పిఱుఁదు రుచిని నిర్జించె నిలన్
వేలాతిగసర్వాంగ,శ్రీలన్ శ్రీగెలిచె సవతిచిట్లక నుమరన్.

సీ. దిరదిరం దిరిగెఁ† గుమ్మరసారె రవిజాతపిఱుఁదుతో మురిపంబుఁ జెపఁగవచ్చి
వట్రేటఁ బడియె మానక సైకతంబులు చెలిజఘనంబుతోఁ జెనకవచ్చి
బలుగిరిదుర్గంబు పాలయ్యె ధారుణి పైదలికటి సరిపడఁగ వచ్చి
రారాపిడులఁ జెందెఁ దోరంపుటద్దముల్ పొలఁతిశ్రోణిచ్ఛాయఁ బూనవచ్చి
గండ్లఁబడిపోయె నరదంబు గండ్లు ముగుద
కాంచికాస్థానగరిమంబు గనఁగవచ్చి
పరుషవిషమత్వములు మ్రానుపాటు తెమకు(?)
దలఁపనివి(లేవు) బాలానితంబమునకు.

క. అరుదైన చక్రవర్తిత,నరసుల సహావసతి గలదు చాలుదు మనిమో
కరము భ్రమింపడి తిరిగెడు, దరుణీమణినాభిసదృశతకు సుళ్లెపుడున్.

క. లలనామణిపక్షంబునఁ, గలిమియు లేమియును నెఱుఁగఁగా నినదుము దాఁ
గలదని తెలియఁగఁ జేసెన్,బలునాభీగహ్వరంబు పరిదృష్టంబై.

క. గూఢాగూఢవ్యంగ్యము,రూఢిం గనికనము లమరురుచులు దనర్పం
బ్రౌఢపయోధరమధ్యము,ప్రౌఢులమతి సమ్మదం బపార మొనర్పున్.

*వర్తింపక—మూ. ‡ఫలాధితేన్—మూ. †కుమ్మరసాన—మూ.

ఉ. ఆరమణీశిరోమణికుచాద్రియుగాంతరసీమఁ బుట్టుశృం
గారరసంపుజాలనఁగఁ గానఁగనయ్యెను ముద్దుఁగుల్కు నూ
గారది నిల్వఁగా నయినయున్నతనిమ్న మనంగ నొప్పుచె
ల్వారెడు నాభిగహ్వర మయారె మృగీదృశరూపవైఖరిన్.

క. అరయఁగ మనముల్ దివియుం, బరమాణువుఁ గలదటంచుఁ బరికించిన వే
హరిమధ్యనడుము సంశయ,పదమాస్పద మౌటనెన్న పాటిలు నుపమల్.

గీ. చారుతరమైననాభిశృంగారసరసి
రసము వెల్లుబ్బి కుచమహీధ్రములనంటి
పాఱునూఁగారుజాలుపైఁ బయలుపడెడు
కరము లలరించె ముద్దుగుల్కు ముద్దుముఖికి.

మ. లలితశృంగారరసప్రవాహ మొనరన్ లావణ్యవద్గాగమా
కలనోద్భూతవళీతరంగములు వీఁకం దాఁకఁ జెల్లుబ్బును
జ్జ్వలతేజోమయ బుద్బుదద్వయము నాఁ జన్మించె నయ్యింతి మే
ల్వలిచందోయి మెఱుఁగు లుల్లసిల్లు భాస్వద్బాహుమూలాంతమై.

చ. అరయఁ ద్రివేణికాజల మనంగుఁడు గ్రుంకఁగ జవ్వనంపు మే
ల్సిరి కడు నించి డింప నొగిఁ జెల్వు(గు)పైఁడి పసంట్లు గుబ్బలా
నురవడి డించు దోఁ దొడఁక నొప్పెడు జాలనఁ గాన నయ్యెడు
న్వరహారినీలమౌక్తికసువర్ణనిబద్ధవిభూషణప్రభల్.

క. అప్రకృతభూధరాదుల, కప్రకృతం బయ్యెఁ జెలువయప్రపుగుబ్బల్
అప్రకృతతయును బ్రకృతత,యీప్రకృతపుజన్నుదోయి నెనయుం గ్రమమున్.

చ. కలయఁ బ్రసాద మొప్ప నధికస్ఫుటమై మధురత్వ మొందఁ గే
వలపరుషస్వభావపటుబంధము మీఱఁ సమస్తభూషణా
వలులు దలిర్ప సర్వరసవాసితఁ గావ్యమునాఁ జెలంగు నె
చ్చెలిచనుదోయి క్లిష్టతనుఁ జేకొని మానదువో విసంధితన్.

క. ఉరుకుచభూధరపతికిం, గరిఘటములు మిత్రమయ్యెఁ గనకకలశముల్
పరికింప సమతఁ గైకొనె, నరులును సఖభావ మందె నరుదు తలంపన్.

క. అరిగజకటదారణమున, నురుసుమనఃపంక్తిపోషణోదారతచేఁ
బురణించు మొనలు సూపుచుఁ, దరుణీవక్షోజభూమిధరరాజు కడున్.

ఉ. శంక యొకింత లేక చెలిచక్కనిబాహుల సాటి కేగఁగాఁ
బంకముఁ జొచ్చి కంటకులపాలయి లోఁ బలులేమిఁ జొరెఁ గాఁ

బకజనాళు లెల్లఁగుటు వాని హరించు శుచిత్వవృత్తిచేఁ
గొంకక సత్పథంబు గొను కూరిమిగల్గినహంసరాజియున్.

చ. వననిధిఁ బుట్టి సన్మణినివాసము నై హరికేలు పట్టి యా
ధనపతియిల్లు సొచ్చియు ముదంబున మంగళసూత్రవైభవం
బునఁ దనరారనైతి నని పూనిక శంఖము చామకంఠమై
ఘనత వహించి కాంచు మణికాంచనమంగళసూత్రసంపదల్.

క. నిటలాక్షుఁడు మూలంబున, నట హాళిపత్త్రంబుమీఁద నమరుటకతన
న్వటఫలము ఫలము గాంచెను, బటుగతిసీయింతిచుబుకభావము గొనుచున్.

చ. సరసిరుహాక్షిదంతములసాటికి వత్తు మటన్నఁ గుందము
ల్వీరియునుగా నిరంతరము వేసరి చీఁకటిబందిగంబులం
జొరఁబడి వాడుఁగా మిగులసూత్రముల న్వరిగట్ట స్రుక్కఁగా
పొరిఁబొరిఁ గందుగా నెఱయ భూరికుచాంతరదుర్గసీమలన్.

గీ. *అక్షయంపుగుణస్ఫూర్తియమరెనేని, ఛిద్రములులేనిగుంభంబుఁ జెందెనేని
తరణినందనముద్దులదంతపంక్తి, యాభిరూప్యంబు గాంచు ముత్యాలబంతి.

ఉ. పంచము లంట మే నిది యపాత్ర మటంచు వనాగమాంతశా
ఖాంచలవృత్తి నై చివుఁరుపాశ్రితమాధవసంగతైకర
క్త్యంచితమై వధూటిమధురాధరతం జని చెందుటం గదా
కాంచెను సద్విజన్మపరికల్పితసంతతసంగసౌఖ్యముల్.

సీ. జలవాసతపమై(న) జలజంబులకుఁ గళాధరునిరాకకుఁ బ్రమోదంబు లేదు
లలి నట్టితప ముత్పలంబున కగునేని మిత్రవైముఖ్యంబు మిగులుచుండుఁ
గలదు భిక్షావృత్తి గండుఁదుమ్మెదలకుఁ బాయిత్వ మెన్నఁడుఁ బాయకుండు
గగనస్థితవ్రతం బగుచకోరంబున కెన్న దోషాకరునింపు గదురుఁ
గాన చక్కని కాళిందికన్నుఁగవకు, నెన్న నివి సామ్య మేగతి నెనయఁగలవు
ఎట్టికష్టంపుఁదపమైన నిల్వవిగుణత. గన్న ఫలమిచ్చు ననుమాటగలుగు టెల్లు.

గీ. నిచులబంధవరాలోకనిస్పృహమీళ(?), లమలమాధుర్యరసవైభవాస్పదంబు
లగుచుఁ జెలువారు కాళిందిసొగసుఁగన్ను, లన్నలోతమ్ములోయవిరుబ్జములకు.

సీ. ఝానకన్నులతోడిసాటిఁబూనఁదలంచి బ్రమసి జేడిసలు గాలములఁబడియె
జెలువయ్యక్షులతోడిచెలిమి సేయఁగవచ్చి పొందమ్మిమొత్తములుబ్బరఁదబడియె

యక్షయ్యగుణస్ఫూర్తి—మూ.

ముదితచక్షులతోడ మురువు సూపఁగవచ్చి కల్వలు నీళ్ల(లో) మున్గఁబడియె
మానిని నయనయుగ్మంబు జోడని లేటికొదమకన్నులు భీతి బెదరుపడియె
శమనిరమణీయతరవీక్షణముల తేట,బూనఁబోవుచుమదిరంబులూఁతఁబడియెఁ
బొలఁతి చూపులచెలువమ్ము పేర్కొన లోలదూఁ
గోర్రి తేఁటులు బికిరంపుఁగూను గొనియె.

గీ. చెన్నకమునువ్వుఁబువ్వునుసరవిఁగూడి,యింతిఘ్రాణంబునకుసాటిసేనయలేక
వంతనంతంతకునుదలవంపుగాఁగ, బండుటలుచూడమే ధరామండలమున.

చ. ఎదుట మెలంగువస్తు వొకయించుక కన్పడనీని మైలతో
నదనునఁ బెట్టు తెల్పులకు నబ్బదు నిల్కడ లేదు మార్దవం
బిది కొఱగాదు జన్మ మని యెంచి ధతిస్మరదర్పణంబు ల
మ్మదవతిచెక్కులై యెపుడు మానని తేట మృదుత్వముం గొనున్.

క. నవనవరోచిర్నిచయ, ప్రవణము లగుకుందరదన శ్రవణంబులకు
న్నవ తెనుచుఁ బల్కుఁ దగునా, స్రవతను సరిగాక మెలఁగునవసంఖ్యనిలన్.

చ. చెలి చెలువంపుఁగన్గములశ్రీ హరియింపఁగ నేల వచ్చె శ
ష్కులు లకటా వివేక మొనగూడక యయ్యపరాధ ముత్కటం
బిల నొనగూడె వాని కది హేతువుగా జను లెల్ల నిప్పడున్
సలసలఁ గ్రాఁగునూనియలఁ జాలఁగఁ జాలఁగ ముంచి యెత్తుటల్.

క. కలకంఠిమృదుకటాక్షాం, చలరమ్యద్యుతులు నిండు శ్రవణద్వయి రొ
ప్పలు నించు*చీరసంబున, విలసిల్లెడుకూపయుగళివిధముం గొనుచున్(?)

చ. జలమరుప ద్మనీలజలసంభవకైరవఖంజరీటప
త్క్యలిహరిణాక్షిమీనహరిణాంకపతత్రుల దృష్టిమాత్రనే
తొలఁగఁగఁజేయుఁ గన్ను లని తోయజసూతి సవాఖ్యసంఖ్యల
న్నిలిపెను బొర్నృయుగ్మమున నేర్పున నా సతివీను లింపగున్.

ఉ. తియ్యన కాని యొండు మతితీ రొకయింతయుఁ గానరాదు నే
నయ్యలివేణికన్బొమలయందముఁ జెందనటంచుఁ జప్పనై
యొయ్యన బెండు గైకొనుచు నుండు మనోజునిచేతిసింగిణీ
యొయ్యెడఁ బిల్లపిల్లతర మించుకయేనియుఁ జేగఁ జెందెనే.

క. కనఁ గన మిగిలెడుమధురిమ, గనఁ జెలికన్బొమలతీరు గానక మరుచే
ననచెఱకువిల్లు ప్రాణము, గనఁజాలక కాదె నిలువుఁగన్నులుపడియెన్.

---

*చిరసంబున—మూ.

క. పున్నమనాఁటినిశాపతి, కన్నియనెమ్మోముసాటి గనలేక క[illegible]
సన్నమగుఁ దజ్జయంబును, మిన్నా ఫాలంబు గాంచు మెఱుఁగులబలిమిన్

ఉ. తమ్ములమేలు పూనమిని దక్కులవెన్నెల మేముసోఁకిన
న్నెమ్మివహింపమిం గలుగునింద తొలంగఁగ నిందుఁజందురుం
డెమ్మెలతమ్మియుం జెలువయింపులనెమ్మొగ మాచుఁ బూనెఁ గా
తమ్ములమేలు మేల్సొగసుఁ దాలుచు లేనగుతేటవెన్నెలన్.

గీ. సవతు గనఁడమె య్యఁబూర్ణదోషాకరుండు
బహుఋణగ్రస్తజలములు ప్రీతియు కావు
పరిహృతాశేషదోషమై భవ్యకాంతి
వైభవము గాంచు నెచ్చెలివదనమునకు.

క. ఎన్నఁ బ్రతిబింబభావా, పన్నం బగు ముకురమునకుఁ బాటిలు నేలా
*గన్నన్న సమత బింబత, గొన్న వికర్తనతనూజగోనబు మొగముతోన్.

గీ. కాంతివారాశి యగుభానుకన్యమోము
జిగి యొకించుక యప్పుగాఁ జెంది యొక్క
రేయి చెలువొంది యది దీర్పలేమిఁ బొడము
పాపము కళంకమై విధుఁ బాయకుండు.

గీ బహుళపక్షపాతభావితుఁ డైనట్టి, చందమామ జడుఁడు సాటి యగునె
సమతఁబూని శాస్త్రసర్వస్వవిదురత, వఱలుచుండుచెల్వ వక్త్రమునకు.

చ. పగ లిది రేయి నాఁగ మఱి పక్షవిభేదము గాంచ కెప్పుడుం
దగులు మహోదయస్ఫురణఁ దార్కొను నక్కనిగూర్మిపట్టి మే
ల్సొగసులనెమ్మొగంబునకుఁ జొప్పడునే సరి యంచుఁ బల్కఁగాఁ
దొగచెలికాని దోషములు దూఁకొనువానిఁ గళంకభావితున్.

క. కనఁజనియె ముకుర మిందుఁడు, కొనవవ్వంజనియె మాఱుకొన్నంజనియెన్
వనజంబు గాని నెచ్చెలి, గొనబులనెమ్మోము సాటి గొన విజ్జగతిన్.

గీ, అమరు బింబానుబింబైక్య మరసిచూడ, నరుదుబింబానుబింబులకైక్యస్ఫూర్తి
కంబుకంధరముఖదర్పణంబుతోడ, నైక్యమొనగూడెఁ జంద్రున కబ్బురంబు.

ఉ. సాటికి రానినీలములు సానల రాపడెఁ బాఱుఁబోతులై
తేఁటులు పోయె మేఘములు దీనత మొత్తిలు (వెట్టెఁ) జామరల్
గాటపుఁదెల్లఁబా టొదవెఁ గప్పడెఁ బల్వగఁ గేకిపింఛముల్
పాటలగంధికొప్పుసిరిప్రాభవ మెన్నఁ దరంబె చూడఁగన్.

*గంగన్న సమతబింబత—మూ.

గీ. అఖిలసుమనశ్శరదంబకాళ్యద్భ్రిహితంబు. నీరజాప్తతనూభవనీలకబరి
దాసి నవతించు నీగతిఁబ్రూనపచ్చు, జగము శైనీరములు, మాయుచలవఫాంబు.

క. అమరెడుకీల్జడ సద్ధర, కొమరుమిగులు పిఱుఁదు దలఁప గొనబగుదివ్వులే
కమనీయతనువు చపలే, రమణీమణి యాకార వృత్తరత్నాకరమే.

క. చెలమా సుధ కధరము చం, చలమా కనుదోయి కుచము చాలిరకనకా
చలమా నైపుల్యజితా, చలమా జఘనంబు ఘనము చానకు నెన్నన్.

క. రాకాచంద్రుని నగు నా, రా*కాంత మొగమ్ము కెంపు రావికి మేలౌ
రా కామినియధరము చిగు, రాకా పాదంబు సుకుచిరాకారమునన్.

క. †నాకము నగుఁ గౌనమ్మో. నాకము(జిగి)గుబ్బ యలపినాకము బొమ యా
లోకములు సుదతి హారిణా, లోకమ్ము నిందించు నౌర లోకము మెచ్చన్.

క. ధరమా కుచ మాబలుష్ఠణ, ధరమా నూఁగారు ‡నీరదాయకధారా
ధరమా కచంబు స్వర్ణవి, ధరయాధరమా మెఱుంగు ధరణిజఘనకున్.

సీ. ఇంపారుకీల్జడ యిందనీలముఁ జేయ మధురంపు మోము పద్మంబుఁ జేయు
ముత్యాలసరిఁ జేయు ముద్దురదశ్రేణి రుచిరంపుమోవి విద్రుమముఁ జేయు
శంఖంబుఁ జేయును జక్కనికంధర గుబ్బలు బంగారుకొండఁ జేయు
భూమిచక్రముఁ జేయుఁ బొంకైన జఘనంబు తలరుమధ్యమ్మునంతంబుఁ జేయుఁ
గలికిపాదంబు పద్మరాగంబుఁ జేయుఁ జాననిలు వెల్లఁ దప్తకాంచనముఁ జేయు
నెలఁడిఁ గొనియాడుమాటలు పేయునేల, రమణిలావణ్యమొగినముద్రింబుఁ జేయు

సీ. జలధరమాలిక జగజంపుకీల్జడ చంపకమాలిక సరసనాస
భ్రమరవిలసితంబు కొమరారుకనుదోయి మత్తకోకిల యగుమంజుగళము
శిఖరిణి యైమించుఁ జెలువౌ రదశ్రేణి స్రగ్ధరయగు గుబ్బచన్నుదోయి
యనుపవిద్యున్మాల యగును దనూయష్టి మత్తేభగమనయగు మంజుపదము
అలభుజంగప్రయాతమై యాను దనను, బంధురంబయ్యె సర్వాంగభవ్యలక్ష్మి
యరసిచూడఁగఁ బంకేరుహాక్షపహాతి. విశదలావణ్యమహిమనువ్వృత్తమయ్యె

సీ. రమణిలావణ్యాంబురాశిలోఁ గనుపట్టుఁ దేఁటులగుంపులు దెలివిరాలు
మున్వన్నె చందురుల్ ముద్దులతానము లుస్మిరము ల్పంమెంగ సొంపునింపు
ముక్తాఫలశ్రేణి ముకువంపుఁబవడంబు శంఖంబు గుబ్బలఁ ల్పరసనాళ
లుదంపుఁజిగురులు పొంకైనజలనీలి బలువైనహారిగము విబ్బనపుతీవు

---

†కాద్య మొగము—మూ. †నాకమనగా కా—మూ.
‡నీలధారాధరము—మూ.

లబ్బురపువరవల్లి నెడునిట్టిరంభ, యరిదిగావించు కూర్మంబు లధికమృదుల
పంకజాతంబు లసమానభాసమాన, కాంచనచ్ఛాయ నెప్పుడొదవించుతీవె.

వ. ఇట్లు నిండుజవ్వనంబున దేవాసురమనుష్యలోక కాంతాదురాపకామనీయ
కలక్ష్మీలీలాయతనంబున్న సర్వలక్షణైకలక్ష్యంబు నగునమ్మోహనాంగిసిఖ
లవిద్యావిజ్ఞానవిమలాంతఃకరణ యని విశేషించి సకలజనపరమాహ్లాదైక
కారణం బగుసంగీతశాస్త్రంబున మిగులఁ బ్రవీణ యగుట యారసి యారసి
కనీలవేణిముఖ సఖీజనంబులు తద్విద్యాపాటవంబుఁ దలిదండ్రులగు ఛా
యాసూర్యులకు డెందంబుల కమందానందంబుగాఁ దెలుపం దలంచి యొ
క్కనాఁడు.

సీ. మేటిమిన్నేటిపొన్నీట మజ్జనమార్చి చిన్ని వెన్నెలవన్నె చీరఁ గట్టి
పొంగుసిబ్బెపుఁజన్ను బొంగరంబులవిరాఁదసాగనుగొంబట్టుకంచుకము దొడిగి
నెఱికప్పుసిరి యొప్పు నెఱికొప్పు చెలువంద నందంపుఁబూదండ లమరఁజుట్టి
రిక్కరా మొక్కపెన్నిక్కు చక్కఁగఁజేసి చొక్కసెన్నుదుటఁ జేర్పుక్కఁబెట్టి
కలువగమి కెగ్గుగలిగించుకన్నుఁగవకుఁ, గలికి కటి†నిగ్గుమిన్కులకాటుకయిడి
యలరు నాణెము త్రైపుసకులఖుతి నిలిపి, తీర్చి రీతి వెలఁదికిఁ గూర్చు చెలులు.

క. కాయమ్మున్నన నాభరణని, ‡కాయమ్మ సఖీజనంబు ఘటియించుచనున్
మాయమ్మ సాటియగు. న్మాయమ్మకు మిగులు సవతు మాయమ్మనుచున్

వ. తదనంతరంబ.

క. విచ్చేయుము నీవిద్యకు, డ్మెచ్చెనువడి నేఁడు సత్సభాన్వితుఁ డగుచు
న్వచ్చని నేలుపు విలిచెను, ముచ్చటగా నీదుపాట మురిపముచూడన్.

వ. అని విన్నవించిన.

ఉ. వచ్చె సఖీపరియుక్తముగ వారిజలోచన వెన్క ముందటన్
హెచ్చు కళాదిభారమున నెమ్మొలుకొ నొగిఁగుల్కఁ గొప్పుడా
లొచ్చెము లేనిచీకటుల నువ్వతిల న్వడి బెళ్కు మోమునం
దచ్చపుమొల్కనవ్వు జిగి నందపు వెన్నెలచాయ లొల్కఁగన్.

ఉ. కాంచెను గాంచనాంగి దమఁగాంచినదక్షు సమస్త విష్టపో
దంచితచక్షు శాశ్రితజనావనదక్షు నవిస్ఫురత్కృపా

*డొదవించితీవె—మూ. †జరెసిగ్గు—మూ.
‡కాయంమ్మునసఖీజనంబు సంఘటియించెన్—మూ.

సంచితవీక్షణా భాగ్యచనసారతనూరుచిదుర్నిరీక్షు నా
కుంచితసద్వ్రతస్త్రీతయగోపనపక్షు హతాసపక్షునిన్.

చ. కని కరమొప్ప మ్రొక్కినను గన్నియ నాదరణాను *వృత్తితోఁ
గనుఁగొని తన్మనోజ్ఞముఖకంజము రంజిల సత్కటంబుల
స్సినుఁడు కవుంగిలించుకొని యింపుగ మూర్కొని తచ్ఛిరోజము
ల్వనుపడదుస్స్వ చిట్లను నపారకృపారసవార్ధిఁ దేలుచున్.

సీ. పవడంపుఁదీవె రా బంగారుబొమ్మరా పొదలెడురాయంచబోద రావె
గుణరత్నరాశి రా గొనబుఁబూబంతి రా కొమరొప్పుముద్దులగుమ్మ రావె
యతివమేల్బంతిరా యందాలకుప్ప రా యొఱపైనకొక్కారుమెఱుప రావె
యప్పచ్చికొండ రా యతనువాలమ్మ రా సొగసైన చందురుసోగ రావె
భాగ్యతి యైనట్టి నాతపఃఫలమ రావె, లలిత మైనట్టినవకల్పలతిక రావె
రాణగాంచిననాయింటిలక్ష్మిరావె, తలఁపులోనగూర్చు ననుఁగన్నతల్లి రావె.

ఉ. బంగరు లీనుచూపు గలబంగరుబోటికి సాటియైన మా
బంగరుకొండ వచ్చెఁ గులపావనసద్గుణవార్ధి వచ్చె నా
కొంగుపసిండి వచ్చె మదిఁ గోరినభాగ్యము వచ్చె వచ్చె మా
ముంగిటికామధేను వని ముచ్చట దీరఁగఁ బల్కె వెండియున్.

క. తల్లివి గద కన్యామ, త్తల్లివిగద సొగసుఁగులుకుఁదనముల సిరి మే
ల్తల్లివి గద సుంభూరుహ, వల్లివి గద మమ్ముఁబ్రోవ నల్లినిభాంగీ.

క. ఒప్పులకుప్పా నినుఁగ, న్నప్పటినుండియుఁ బ్రిమోద మనుజలరాశిం
దప్పక మునుంగు నాకుం, జొప్పడె నభ్యుదయమెన్నఁ జోద్యము జగతిన్.

గీ. అమ్మ నినువంటిపట్టి మాకబ్బెఁ గాన, చాయచాయకు మర్యాద

— (ఇక్కడఁ గొంత గ్రంథములేదు) —

దములొప్పలఁ దనర
గేయవాక్కర్త్రి యను పేరు గెలుకొనఁగ, వీణ వాయించె నవ్వేళ నేణనయన.

గీ, †తత్పదముభాతి మంగళార్థంబు గీతి, కది పరాత్మవదించుట నంచునెన్ను
శాస్త్ర మాగీత మగ్గీతశాస్త్రవేత్త్రి, కబ్రిమేభావిసన్మం (గళార్థ) మగుట.

క, రూపవతిగీతిభూషణ, దీపితమై మెచ్చుగాంచుఁ దివ్రిం బువమూ,
శ్లేవములు వడయునని సభ, నాపాదించుమను మోదమందిరి విబుధుల్.

*దృష్టితో—మూ. †తత్వంబాతి—మూ.

ఉ. చాయలు వేయు గల్గు నెఱిసామికిఁ జాయలు వేయి రిక్క రా
చాయలచాయ జెం   సాతపతన్ ఘటిల్లె మే
ల్చాయలకెన్న మిక్కుటపుఁ జాయఁ బ్రివర్తిలె ముద్దులాఁడి యా
చాయకుమారిగీతి (గన్న) సంగతశీతలమానురీశ్రితిన్.

వ. అయ్యవసరంబున విశ్వంభరానిర్భరభారాయమాణ దుర్మానకంపాదివ్యశం సదు (ష్టసర్పగాఁడ) మణి యగు (శ్రీ)కృష్ణదేవకపటయాదవశిరోమణి ముఖ చంద్రబింబముక్రంది) కాడంబరంబున నిజన్మయునజీవంజీవంబులకు సంజీవనం బపేక్షించి విరించిపథావధి యగుద్వారవతీపథంబు నాత్మశరణపూతచరణ (సరోరుహ) విన్యాసంబున ధన్యమార్గ వ్యంబు గాఁ గటాక్షించి తత్కటా క్షసమాక్షిప్తగౌరవ పరభాగసందానిత మహాభాగవతద్విగుణితహరినామా నుసంధానబంధురరోమహర్షాశ్రికంచుక సముదంచితసర్వాంగ నయను నందామృతధారాప్రవాహంబున నపగతమోహాదిదోషపంకాంతరిత తాలఘూకృతంబు ఁణుపరిమాణంబు నతికరణంబు దేలియాడ మగిడి సత్యలోకంబు స్వాలోకవిషయంబు చేయం దలంచిన (జగ) డంపుకూటిజడ దారి గ్రిహరాజగృహరాజంబు సమీపంబున సమీచీనతాసద్ధి) చీనతదనూ నవీనాగానామృతంబు కర్ణకూపంబులనిండారనబ్బురపడి చేపడిన వీణియువదలి కదలక మైమఱచి పరచితిహ (?)ంబునందె(వ)నిమందపడి (?) డెందంబు ననంబు గాక మసల మెల్లమెల్లనందేఱ్చి కూర్చుండి శిరంబుఁ గంపంబులోఁ గూర్చి తర్జని నాసికం జేర్చి తనలో నిట్లని వితర్కించె.

ఉ. ఎక్కడిలోక మేఁ గనని దెక్కడిగానము (నాకుఁ గోత్రగాఁ
దక్కన) దిట్టిగాన మొక తావుక నైన వినంగ మృగ్య మ
మ్మక్క యిఁకెంతిచోద్య మహహా ననుఁ జొక్కఁగ జేసె నద్దిరా
యక్కమలాక్షుకీర్తనమునందును డెందము డింద కుండెడిన్.

క. ఔరా మును వింటిఁ బయఃశ, పారావారజకు పాటి (పద్మాక్షి కుమా)
రీరత్న మయ్యో సూర్యన, శారూఢిగుణాఢ్య * నీలయుతులాంశం బై.

క. అక్కన్య సకలవిద్యల, దిక్కులఁ జనపాటిలేక దీపించును బెం
పెక్కు మిగుల గీతములన్, లెక్కింపఁగరాదు మాధురీగుణ మనుచున్.

క. జాతరుణి యెప్పుడు తండ్రికిఁ, జేతం (బిగురొత్త సేవసే) యుఁగఁ బోలం
(బ్రీతిగ నెచ్చెలిఁ గయుఁగొన, కీరతిఁ జవ నాకు డెంద మెనయు దటంచున్

---

* నీనయుతులాం—మూ.

యొప్పులకుప్పం దనకూఁతుం బిలిచి యప్పా యిప్పావనహితునకు మ్రొక్కం
జక్కంబడని తొక్కటియుఁ జిక్కదు మ్రొక్కవలయు నని మ్రొక్కించిన
సత్కారుణికప్రవరుండౌ పురుషశిరోమణి వ్యాసగృహీతివి గమ్ము పౌత్త్రా
యని దీవించి యనుపం బిదపఁ దదనుమతి నమ్మహామతి నిజానుగతసభా
జనంబుల యథాపూర్వోచితస్థానంబుల వసియింప నియమించి తాను
దత్సభామధ్యస్థలంబున దివ్యాభవ్యనవ్య హేమముక్తాఫలాముక్త నిర్మిదరీభద్రాస
నంబునఁ గూర్చుండి యుండెఁ దత్కాలంబున.

చ. *తొలుపటిపల్కుబల్గనులు దుష్టతమోహరణప్రవీణమాం
సలమహిమాన్వితు ల్మహితసత్పథవృత్తినిగూఢభావు లా
కలితదిగంకరాళరుచిగాఢతనూదుచిరుల్ సభాస్థలిం
జెలువలరారి రిద్దఱును జేతనజాతము లబ్బురంపడన్.

క. అన్యోన్యకాంతివైభవ, మన్యోన్యముఁ గప్పఁ జిహ్న లవిషయములుగా
నన్యనియం దన్యభ్రమ, మన్యాయత్తంబుగాక యలవడె సభకున్.

క. నిండుసెలఁబోలు మునిమా, ర్తాండుని మార్తాండుఁ జూచి హారికైరవపు పే
రుండెడుపులుఁగులు భ్రమచే, నొండొండ ముదంబు ఖేద మొందును మిగులన్

గీ. అట్టియెడఁ దమ్మువిడిమట్టుపట్టుదిట్ట, పట్టి యగుపూని కనియె నవ్వోట్టజేజె
గీటుకొను హాసమున మోము నీటుగుల్క, మాటమాటకు నమృతంబు తేటలొలుక.

క. నీరాక రాక సన్మద, నీరాకరమునకు సుగుణనీరాకర యీ
నీరాక గాక యాప్ర, న్నీరాకరమునకుఁ దేవ నే నెఱుఁగుదు నే.

వ. ఓసుదర్శనకరశుభకరపదభక్తి మత్సుదర్శన నిదర్శనసమధిగత నిఖిలదర్శన
కాలత్రితయపవిత్రకావ్యంగ్యవ్యంజకంబగుభవదీయదర్శనసమంజససంజీవ
నౌషధంబున మదీయకాపత్రియంబపత్రపానిలయంబయ్యెడు మజ్జనంబు
పరార్థభావంబు నొందెడు మత్తేజంబు వేలోల్లంఘనంబుననలరారెడు మద
భ్యుదయం బనస్తమయంబై చెలువారెడు మదీయనివాసంబు విష్ణుపదంబు
నం జెన్నుగాంచెడు మదధికారంబు గ్రహాతీతం బైయొప్పారెడు మత్కళత్రం
బు కాంతివశ్యాలయంబై వెలుంగొందెడు మత్సంతానంబు నమందతఁ గాంచి
యు నమందత దైవాఱెడు నీరేజుఁజగంబులఁ దేజోవంతులకు దృష్టాంతంబునై
మెలంగెడు భాగ్యంబు నాకుఁ బొసంగెడు నమాధిమత్కళానిధినిమాధి

*తొలుతటిబల్కుబల్కు -నుచు-మూ.

కకృపాపయోధి వగునీదుసన్నిధికి గమనంబు గమకం బగు మత్పురాతనా
గణ్యపుణ్యపరిపాకంబ యని యని యరసి నిర్ణయించుకొనియెద నధిగతపరమా
ర్థతకు నవాప్తసర్వకామతకును గేవలపదం బైన భవాదృశులకు మాదృశ
రాజసజనంబు ననుసరించి యత్కించిదర్థప్రదానంబునకు సంప్రదానత గా
నుట గగనకుసుమంబు గనుటయె సిద్ధం బని సిద్ధాంతీకరించెదంగా దేని
దేవరచిత్తంబు కుతుకలీలాయత్తం బై యదర్థంబు విషయీకరించి సర్వా
ర్థమూర్ధాభిషిక్తంబు సేయు నవధరించె దదర్థంబు భవత్సన్నిధాన వైభవ
సమాసాదితసంపత్సాకల్యతం దగు భవజ్జనుసవిధంబున నప్రతీత్యాఖ్యా
తంబు సంయోగంబు గొని కారకత్వం బంగీకరించు నని నిస్సంశయంబుగా
సంకల్పించెద భవాదృశస్వదృక్పారతంత్ర్యంబునం బ్రవర్తిల్లు నదోవందారు
నకు నెందేని స్వాతంత్ర్యం బతంత్రం బవుట చిత్తగించి వాచావిషయత త
త్ప్రకాశకక్రియం బ్రసరింపఁ జేయ దయసేయవలయు నని పునఃపునారచిత
ప్రణామంబులం బ్రార్థించిన.

గీ. ఇట్లు *వేపాదములసామియింపునింపు, మధుర భాషలభాషింపపతానివినుచు
హరికథాసుధయానినయపుడుగాంచు, మోద మందుచు నత్తమోభేదికసియె.

ఉ. ఓయిసమస్తలోకనిచయోదయహేతునిజప్రకాశ భ
వ్యాయతకీర్తి నీకు నిటు లాడఁగఁ జెల్లునె యన్యుపట్లు నీ
వాయతనంబ నైతివి చరాచరసంజననావనక్రియా
పాయనిదానమూర్తులకు భద్రకరాగమరూపవైభవా.

క. మిన్నే దేవత యనుచు న్నిన్ను నుతింపం బనేమి నిగమావళులం
గన్నట్టి త్రిపదయే నిను, సన్నుతి గావించుకొనుచు సార్థక మయ్యెన్.

క. వెన్నునిఁ గన్నులఁ జూచుట, నిన్నుఁగనుంగొనుట మాకునిజ మొక్కటియౌ
యున్నలినాక్షుఁ గనుంగొని, నిన్నుం గనవచ్చినాఁడ నీరజమిత్రా.

క. ఇంకొక్కటిఁ జెప్పెద నే, నంక స్వైన నరిది గాన వైఖరిచే నీ
పొంకపుఁగూఁతుకు వను నీ, వంకకు రప్పించెఁ జుమ్ము వనజాతసఖా.

క. నీలాలక యిది నీలా, లీలావతియంశ నవతరించిన దగుటన్
నీలాపతికా ప్రోక్తుఁడు, †లీలాయదుమౌళి ముద్దుకేమం బ్రేమన్.

క. ఈరీతిఁ బల్కఁ పినా, కరీణాఘుతీందుప్రవచనబంధమధురిమా
సారములు చెవులు సోఁకిన, బారాకారములసామి పలికెం బ్రీతిన్.

*వేయుపాయసములసామి-మూ. †లీలాయదునౌళి-మూ.

చ. హరిపదపంకజాతయుగళాంచితభక్తిపరప్రవేక యా
హరి మనుజాకృతిం బుడమి నందుటకుం గత మెద్ది యమ్మహా
పురుషునిఁ జెందఁజేయఁ దగుపుణ్యపుసాధన మెద్ది రూప మ
ప్పరమున కెట్టి దింతయు నపారకృపాజలరాశి తెల్పవే.

క. అన విని వీణాముని య,య్యనుజుఁ గన్గొనుచు నగుచు నిట్లను నౌరా
వనజాప్త నీదువినయము, విని కని యెఱుఁగము సమస్తవిబుధులలోనన్.

గీ. వేదమూర్తివి నీవె కా వేదవేద్య, నెఱుఁగజాలవె యెట్టిన నెన్ని చూడఁ
బరహితజ్ఞానమార్గప్రవర్తకులకుఁ, బ్రష్టృభావంబు భూషణప్రవర మనఘ.

క. వనజాక్షభక్తిభరవా, వనుఁడవు నీవెంతభాగ్యవంతుఁడవు బళీ
నినునుండి తత్కథాస్మృతి, నెనసితి *నిటనాదుపుణ్య మే మనవచ్చున్.

క. దిన మొక్కనిముస మయిన, న్వనజాక్షస్మరణ మెలఁగ వానివృజిన మ
ద్దినకృతము సుకృతమగు స్ప, ర్శనవేధిస్పర్శ నినుము సౌవర్ణమె కా.

చ. తలఁచిన విన్న మానసము దెద్ద మునుంగు ముదంబురాశి మైఁ
బులక †లెసంగుఁ గన్నులఁ బ్రమోదజలంబులు పొంగుఁ బూర్ణతా
ఫలితమనస్కులౌ నరిమపాసనమానులకైన నద్దిరా
బళిబళి వాసుదేవుకథఁ గాటిలుమాధురిసార మెట్టిదో.

సీ. సౌశబ్దసంగతి సడలుకావ్యమురీతి విజ్ఞానహీనమహావిద్యమాడ్కి
సాధుదానము ‡లేనిసంపదకైవడి వరశాంతి నెడయు తపంబుభాతి
కంఠరక్తతమానుగానంబువడువునఁ బాలనసేయని ప్రభుతచాయ
శ్రద్ధానురుద్ధత జాఱుకర్మము క్రియ రాగంబు గాంచని రతిపరుసున
సిద్ధపాండిత్యవర్జితసేవ§ రేవ, భూరిపరిమళ మందనిపువ్వుపోల్కి
వాసుదేవుపదభక్తి నశలువాని, జన్మము నిరర్థకంబగు జలజమిత్ర.

చ. అలపరతత్త్వ మెంతటిమహాత్మునికైనఁ దరంబుగాదు దాఁ
దెలియఁగ నెట్టిదిట్టలను దెల్పఁగరాఁ దెలుపంగ శక్యమే
జలరుహమిత్ర యట్లయిన సంగ్రహసూక్తుల నాదుబుద్ధికిం
దెలిసినయంత దెల్పెద సుధీశ్వర తప్పక యాలకింపుమీ

*నిడనాడుపుణ్యా—మూ. †లొసంగు—మూ. ‡చేయుసంపద—మూ. §క్రేవ—మూ.

గీ. ఈప్రపంచంబునకుఁ బోల్తు నెసఁగు మందు
సచ్చిదానందమయ మాత్మ (సంగ)రహిత
మనసుగతరూప మన్యవహార్య మఖిల
మానసంచారశూన్యంబు భానుమంత.

గీ. అప్పరంబు సిసృక్షచే నమరిత్రిగుణ, మాయఁగైకొని సగుణత మరగి సర్వ
కారణవిచిత్రకార్యసంఘాతరూప, మగుచు నారాయణాఖ్యత నలరుచుండు

సీ. తత్స్వరూపావాప్తి దనరు జ్ఞానంబున జ్ఞానంబుభక్తిచే సంభవించు
వేదాంతవిద్యచే వెలయురు సద్భక్తి యవ్విద్య గురుసేవ నందనలయు
సద్గురుసేవ నిష్కామత్వమున నబ్బునది చిత్తశుద్ధిచే నమరు నద్ది
కాలుష్య మణఁగినఁ గలుగుఁ దదాప్తిహేత్వ మలనదుఁ బాపక్షయంబు గాఁగ
నట్టిపాపక్షయంబునే లానవచ్చు, దాన యాగాదిసత్క్రియ లూనఁ గలుగు
నవియుఁ దన్నాశకరశక్తి దప్పులుటది, కర్తనిష్కామమానసుఁ గాంచకున్న

క. భక్తియె స్వతంత్రకరణము. ముక్తికి నది కొంద అందుర భూరివివేకుల్
*భక్తిసుసాధ్యజ్ఞానమె, ముక్తిద మని కొంద అందుర భూరివివేకుల్.

గీ అఖిల మాత్మేష్టదేవత యనెడుబుద్ధి, నిరతిశయభక్తి బ్రహ్మమై పరఁగు నంత
యనుమనీషయు జ్ఞానంబునగునుగాన, జ్ఞానభక్తుల కైక్యనిశ్చయము మాకు.

గీ. కమలబాంధవజ్ఞానయోగమ్ముభక్తి, యోగమన రెండుబలునావలొప్పుచుండు
ఘోరసంసారవారిధిపారమంద, ననుచుమునికృత్యులోకకొన్ని యమరఁబలుకు.

గీ అరయ శ్రవణాదిక్రమమాయత్తమువును, జ్ఞానయోగమ్ము తదితరజ్ఞానవిభవ
ఘటకమవుచుండు భక్తియోగం బనంగ, భావమీగతిఁ బలుకు నిబంధనలకు

వ. విను మప్పరమేశ్వరుం డగునారాయణుండు లోకరక్షణపరాయణత్వంబు
నం దత్తత్కాలంబుల నానారూపంబులు దాల్చుచుండు నందువిశేషించి.

సీ. ప్రాఁబల్కుగమిఁ దమ్మిపట్టికిఁ గూర్పంగ జగమంత పృష్ఠదేశమునఁ బూఁ
ధరణిఁ గొమ్మునఁ దాల్ప దనుజులొమ్ము నగుల్పఁ బలి నధోభువనంపుఁబట్టి సేర్పఁ
గృతవీర్యజాదిభూపతుల విదారింప వనధిమధ్యం బరావణము సేయ
ముష్టికాదులఁ ద్రుంపఁ బురసత్త్వముహరింపయవనసంహార వైభవము గొనఁగ
జలచరాకృతిఁ గమఠతఁ జటులకిటిత, నరమృగేంద్రతఁ గుబ్జతఁ బరశుధరత
రాఘవతహాలికబుద్ధతలలితహయత, నఖిలజనములు గొనియాడనతఁడుగొనిె

*భక్తిసాధ్యజ్ఞానమె — మూ.

గీ. తపన యిత్తతి నప్పరతత్త్వ మనని, భారకారులఁ గంసాదిఘోరదనుజ
నికరములఁ ద్రుంపవసుదేవునికిజనించి, వఱలుచునుగృష్ణుఁడనద్వారవతిఁ బొలుఁగు.

వ. అతసిమాయాబలపరిగృహీతదివ్యమంగళవిగ్రహంబునకు నుపమానంబు దు
ర్గ్రహం బవ నసంశయం బేమియు ననం గీర్తనధ్యానాదిసాధనంబులం బా
పక్షయార్థ్యు లగుమాదృశు లగుదాసులకుం దదుపమానకల్పనసాహసంబు
న నల్పదోషంబుఁ గాదని విచారించి నాయథాశక్తి నమ్మహాపురుషు నంగ
సౌందర్యం బీషత్కాలంబు గీర్తించి కృతార్థత గాంచెద సావధానుండవై
యవధరింపుము.

సీ. ఇంద్రనీలచ్ఛాయ నినయు దేహమువాఁడు ముద్దుగుల్కెడునవ్వుమోమువాఁడు
ఘనశంఖనిభ మైనకంఠంబు గలవాఁడు చక్కని వెడఁదవక్షంబువాఁడు
జయలక్ష్మి లీలనాజానుబాహులవాఁడు దనరారు సింహమధ్యంబువాఁడు
జనసంపదల మించుజంఘలు గలవాఁడు తమ్ముల మించుపాదములవాఁడు
కటిని జెలఁగొందు బంగారుపటమువాఁడు, ధాతఁ గన్నట్టినాభిపద్మమ్మువాఁడు
వరిబలు శ్రీవత్సకౌస్తుభవరిభలవాఁడు, చక్కఁదనముల *కిల్లడైజరుగువాఁడు

ఉ. కిరింనయి రేణమోచి పరిక్షిన్నతఁ గృష్ణునిపాదయుగ్మ మిం
పొంద భజించి యంబుజము లొక్కెడఁ దత్సమమాంశలేశ కా
ప్తిం †దనరారఁ బద్మములపై రది నోసిడి తత్సమంబుగాఁ
గొందురు పాదపద్మ మని కొఁతి తిబుద్ధులు గారె లోకముల్.

ఉ. అంగుళులే దళంబులు నఖాళులు కేసరము ల్పదప్రిపీ
తాంగణనమ్రిదేవమౌ టాంచితనీలమణీను మ ల్బల
ద్భృంగము లై చెలంగఁ గడుఁ దేజిలు శౌరిపదాబ్జముల్ శుభా
ళిం గరుణించి భక్తులకు లేములు వాప్పఁ దమోనివారకా.

ఉ అంగజునేస్నిషంగయుగ మాకృతి కేను సమానవైభవం
బుం గయికొంటి మింక సరిపోలను కాంతి నటంచు నగ్గలం
‡బ్రుంగి తపించి తత్తనువు వీడిన నాదొన లీడుగా వన
స్సంగతి నయ్యదూద్వహునిజంఘలఁ బోల్పఁ దలంప శక్యమే.

చ. తన కుపమానవస్తు విఁక ధారుణి లేదని కాదె గెల్పుపెం
పున ధరియించు మేల్పిరుదు §పో యిదినాఁగ మణీవినూత్న కాం
చనమయనూపురార్భటి నెసంగెడుఁ దద్ఘనజంఘ లెంచ న
వ్వనజభవుండుఁ జాలఁడు దివాకరతత్ప్రభ నెన్న శక్యమే.

*ఇల్లుడై.మూ. †దనరారిపద్మములు-మూ. ‡బ్రుంగి—అనియుండుట న్యాయ
మైనను 'గొన్నిప్రాచీన ప్రయోగములిట్లు గనఁబడుచున్నవి. బ్రుంగి...బోవిడ- అనుట సర
పద్ధతి § మేల్పిరదపో యెద-మూ. విట్లవి

చ. ఉనుఁగనిడాలు మీఱు హరియూరులతీరిక మేటిసాటికిం
గడఁగి సమంబుగా కనఁటికంబములుం బొరవిచ్చి పోయెఁ బ
ల్విడిసెడి దానఁ జేసి "కదలీ న కదాచన" యన్నిషేధ మె
క్కుడు వడినిల్చెఁ గాదె తమకున్ జగతీస్థలియందు భాస్కరా.

గీ. విద్యుదావృత మాధురవృత్తిశోభి, దీర్ఘఘుంటానురణనసందీప్తిరత్న
పదలసద్గుణలలితశోభామిళితము; పద్మదళనేత్రు నుత్కటిబంధ మమరు.

క. ఘన మగునేని జడంబగుఁ, దనియూరుశ్రియు మట్లుగాన స్థైర్యము గొనరా
దని మెఱుఁగుఁదీఁగ హరికటి, ఘన మజడంబనుచుఁ జేలకైపున నిల్చెన్.

ఉ. దండితజాండభాండములతండము లుండఁగఁ దప్పిచండరు
న్మండలియందునుండి గరిమ న్వెడల న్మగుడం జనంగ బల్
గండి యొనర్చిరో యి దనఁగాఁ దనరెన్ హరిదివ్యనాభి *యు
ద్దండత నల్వఁ గన్నవిరి తెద్దయు నొప్పు (చునుండ) భాస్కరా.

చ. తనదు విచిత్రశక్తికి నిదర్శన మై తనరారఁగా బ్రివ
ర్తని మృగరాజభద్రగజరాజులఁ గౌనున యానరీతియం
దు నలవరించి మించె ననఁ దోఁచును దద్విభుమధ్యయానము
ల్గనుఁగొని యెన్న నచ్చెరు వగున్ హరిసుందరభావ మిస్థరన్.

చ. కవిబుధచంద్రలోకహితకారకమంగళజీవకేతువై
భవత రిపూత్కరంబు గెడపం గడుఁ గూడిన కాలసర్పయో
గవిధిఁ బ్రకాశమందెను నళండ †లసద్భుజదండకాండమై
భవముల నొప్పు మాధవుఁ బ్రస్తుతిసేయఁ దరంబె భాస్కరా.

చ. అమర ధరాంబరద్వయమునం దెసలారుగుణంబునందు ది
ష్యములు(!)సురారినైరిరశనాకృతి దాలిచెఁ గాసి(దా) ననం
తమణిసితాసితార్ద్యగురుధామ వినూతనచంద్రస్థామ్యభా
వముఁ గనఁజాలునే రశనభావము లోనఁ దలంప భాస్కరా.

ఉ. కలికితనాన నోట మిటు గన్పడె నాపను లింకఁ జెల్ల వం
చలవలగాజు చేతనిశితాసియుఁ బల్కయు నావ ముంగిట
న్నిలిపి స్వజన్మదేశమున ‡నిల్చెనునాఁ గనుపట్టె నారును
నులుకటుగంబు నల్లయుదుకుంజకుఁ దొప్పుఁజుమీ యహర్పతీ.

క. చతురాస్యవదనపూరిత. గతిచే వక్షమున కెగసి కనుపడునాభీ
వితతపయోరుహకేసర, వితతి యనం గౌస్తుభంబు వెలయున్ హరికిన్.

క. ఒత్తులువడుచు జనార్దన, భృత్తియు *సుస్వనత లేక వెలవెలఁబోచున్
రిత్తనడి శంఖ మచ్యుతు, కుత్తుకయై పొలిచి నిలిచె గుణనిధి యగుచున్.

క. మంజుభుజకీర్తిహీరా, సంజితధవళిమము భూమిసాకల్యధురా
రంజితము కంసదానవ, భంజను కేలమరు శేషఫణిసన్నిభమై.

చ తను వెలగాఁ గొనుం బసిఁడి దాన మెలంగుటఁగాని చెల్వొలే
దని యలకెంపు తద్విభుశయద్వయమై నవరత్నకోటికాం
చనతను ‡పియుఁ బుచ్చుకొనసాగ విదోషసదోషభావతన్
గొనబు వహించుఁ జూడ్కులకుఁ గోరిక లీరిక లీనుచుండఁగన్.

క. అకలంకగోవిలాస, ప్రకటిత దోషాపరుద్ధభావతఁ గొనుచు
స్వీకరించు తన్ముఖంబున, కకటా దుష్టములు నెలయు నబ్జము సరియే.

చ. తమిగొను ముద్దుకై తలఁచు తామరసాలయకన్య కన్యకా
భ్రమ జనియింపఁ దచ్చనకుఁ బన్నిన నిద్దపుఁదళ్కు మించుట
ద్దము లనఁ దోఁచు జూపఱకుఁ దద్దయు మేల్మినుజెక్కు లౌర చి
త్తమునను వాక్కునం దలఁపఁ దత్ప్రభ సన్నుతిసేయ శక్యమే.

క బలుగండ్లు నోపఁ బవడము, జలజాక్షుని మోవి యయ్యె సాగెపట వధూ
విలసద్రదనక్షతములు, తొలఁగ డెచట బాధ రాగదోషము గొన్నన్.

చ. ఘనవదనాలవాలమునఁ గమ్రవచస్సుధ నాటుదేరి చి
న్నినగవువెన్నెలం గలసి చిక్కనయప్పవడంపుమోసులో
యన రదనాళి యింపొనరె నాదటఁ దత్కిసలం బనంగఁ గృ
ష్ణునిమధురాధరంబు గడుసొంపు వహించు నిలింపవందితా.

క. కమలాహితవరకాంతుల్, శమితతిమిరజూర్తు లమలసత్ప్రథవస్తుల్
భ్రమిఁ గోరు తారకంబులు, కమలాక్షునియంబకములు కదుఁ దనరారున్.

ఉ భవ్యతరంబుగా భరణభారనలాంచితవృత్తియుక్తమై
నవ్యపయోజజాతయమనం బయి యుత్పలమాలికాకృతి
స్తవ్యము గాంచి రాజిలును దైత్యవిరోధిశుభేక్షణాలి త
ద్దివ్యదుదారవైఖరులు తెల్పఁగనాకగునే విభాకరా.

క. శ్రీవిన శ్రుతిపదగము లై, భావింప సువర్ణశబ్దభరణాంకము లై
దైవాఱె మంగళమహో, శ్రీవృత్తము లగుచుఁ బొలిచె శ్రీపతిపేరుల్.

క. హారికప్పుబపరిగ్రహము, *సారెదిగ నవ్వదనచంద్రుఁ బుట్టుకొను దళ
త్సురరాజనీలశోభా, పరిపంథిప్రభలఁ దనరుఁ బరివేష మనన్.

క. హరిచెక్కుల సొంపారెను, గురుతరనవపద్మరాగకుండలరుచి శ్రీ
తరుణీకృతచుంబనవి, స్ఫురదురుతాంబూలరాగముం దలఁపించున్.

గీ. విషయగంధరాగవిహృతిచేఁ జెన్నారు, కమలపత్రనేత్రుఘ్రాణమునకు
విషయ మనఁగరాదు వివరింపఁగా గంధ, ఫలిని †గంధమాత్రఫలిత మగుట.

క. గుణవృద్ధులగుచు రాజిలు, ఫణిరాజశయానుబొమలు పరికించును గా
గుణిగణము వక్రిమే †యిది, గణుతింపఁగ వక్రతను మొకా‡ యిదియనుమన్.

క. చక్షుఃప్రియమృగమదతిల, కాక్షీణసులక్షణైకహారి యగురమా
ధ్యక్షునలికంబునకు నప, లక్షణవక్రింప్రనెల తుల యనం దగునే.

గీ. ప్రథమకైవడి సత్కళాప్రథనహీంచు. దీపితాకారమై సంవృతి కెన యగును
శక్యమే సన్నుతికి యదుసార్వభౌము, లాలితచ్ఛాయమృదులనిటాలఫలము.

గీ. మహితజలధరమాలికామైత్రిఁ గాంచి, నఱలుచుండెనుహరివాలబంధ మొప్పు
లఘుగుణౌజ్జ్వల్యముఖ్యత రాజిలంగఁ, జాల రహిఁజెందుచంపకమాలి కనుర.

గీ. అతిపసౌందర్య మతనికళ్యాణగుణము, లనవశేషంబుగా నెన్న నెవిగాదు
వదనములు నాల్గుగల్గినవానికైనఁ, దలలు వేయింట మొఱఁగెడు విలునకైన.

ఉ. అట్టిసమస్తలోకనిధి యట్టిజగద్ధితవేషధూర్వహుం
డట్టిదయాపయోనిధి యట్టిత్రి మోపహానామకీర్తనుం
డట్టివిచిత్రరూపఖని యట్టిమహాద్భుతకార్యకర్త నీ
పట్టికి మేలుపట్టయిన పట్టు సుమీ పరికించి చెప్పితిన్.

క. మదిలోపల నిక్కార్యము, వదల ననౌచిత్య మచట వదలదును వదా
నదపదనవజములు సమ, పదభాషితభూషణంబు పద మందదుగా.

గీ. అబ్జబాంధవ యింతపర్యంత మిట్లు, హరికథాగోష్ఠి సమయ మత్యంతమధుర
మగుచు వెడలెను సత్యలోకానుసగణ, వాంఛ దీర్పంగ నానతీవలయుననిన.

---

*పారిదిగనన్ వదనచంద్ర- †గంధమాత్ర పఠిత-మూ. ‡రెండ తాపుల 'యిని' యనియేకలదు.

గీ. ఇట్లు బలు *పోటుజాటలనింపుగాంచు, మించుజడదారిరతనంపు మేలుమాట
లాలకించి ముగంబాత్మఁ జాల నించి, యనుఁడుసద్భక్తిఁబల్కె మెల్లనహసించి.

ఉ. ఆంతర మోహనంబుబలు పాఱుప నేఁడు ప్రగల్గెనాకు నే
కాంత మనంత మా నుదయు మంది తనంతిపదంబు గంటి శ్రీ
కాంతసుధాంశుకాంతికళఁ గల్గియుగంబు బోసిఁ దన్పి తీవ్ర వా
కాంతతినూజ నమ్రిజనకల్పకభూజ సునీడనోత్తమా.

కం. ఏకగుణహాని యెఱుఁగని, జోక విశేషోక్తి యందు శోభిలు సమ్మృత
శ్రీకలితసామ్యదార్ఢ్యము, లోకహితాచార బోధలలితవికారా.

గీ. అనఘమిహిరానతిచ్ఛివయట్లు నడచుఁ, గాక యీజనుఁడన్యథాగతిమెఱఁగునె
వైదికోక్తికిమీవంటివారిమాట, కరయ సత్యత నీరెంటి కర్థమొకటి.

వ. ఇట్లు వచ్చించి విరించితనయునకు సవినయంబుగా సహాస్కరుండు నమస్క
రించి యతం డనుగఁ గొంతద వ్వనుగమించి మగుడఁ దదనుజ్ఞ భరించి తిరిగి
వచ్చి కూఁతుం గాంచి గుచ్చి కౌఁగిలించి మెచ్చుగా ముచ్చట దీర న
మూల్యభూషణాంబరంబులు ధరింపించి తక్కినసీల వేణీముఖసఖీజనంబులకుఁ
దగిన సభాజనంబులు సభాజనదృక్సభాజనంబుగాఁగావించి యయ్యంతి*మె
లపుటింతులతో నంతిపురంబునకు ననుపుటయు.

కం. సరిమార్గరూప వినమ. †చ్ఛత్త్రీనమార్గవిధానదక్షసంస్కృతనామా
సురమాన్య మాన్యచరితా, పరతరమౌనీంద్ర హృదయపంకజభృంగా.

గద్యము. ఇది శ్రీమదామచంద్ర చరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి
మాధవయజ్వసముజ్జ్వలత్కృపాకటాక్షాసాదితపాండిత్యాభరణ ప్రభంజన
వంశాబ్ధిరాకాశశాంక నిరంతరారాధిత విచక్షణశశాంక అభినవదన్నయ
భట్టారకాహోబలపత్యాహ్వయకవిమహోపాధ్యాయభట్టారక ప్ర
ణీతంబైన కాళిందీకన్యాపరిణయం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథమా
శ్వాసము.

*పోటినాటల-పమా †మేలుపుటింతులతో. ‡నగమార్గవిధాన. ¶విలసత్యా-పమ

# కాళిందీకన్యాపరిణయము

## —: ద్వితీయాశ్వాసము :—

క. శ్రీమైథిలీమనోహర, కామితఫలదాయ సుజనకల్పమహీజా
శ్యామలవిగ్రహ నుతసు, త్రామా సాకేతధామ దశరథరామా! ౧
వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము, ౨
క. తనతండ్రికి నారదుఁ డా, వనజాక్షునిచరితములను వర్ణింపంగా
విని మనము నాఁటి కామిని, తనకుం దగినట్టివిభుఁ డతండని తలఁచెన్. ౩
ఉ. ఉల్లము రంజిలం దనుఁ బయోరుహ*నేత్రలు గొల్వవచ్చి తాఁ
దల్లికి మ్రొక్కి యాయమ ముదంబున సేస లొసంగి దీవనల్
తెల్లముగా నొనర్ప నొకతీరునఁ గైకొని యొయ్య నొయ్యనే
పల్లవపాణి యందుఁ దగుబంగరుగద్దియఁ జేరెఁ జింతతోన్. ౪
చ. వనజభవేంద్రచంద్రధరవాఙ్మనసాతిగమై వెలుంగు కృ
ష్ణునీలలి సొంపువింపు జిగిసోయగము న్విభవంబునుం దియా
తనునకు నారదుండు తదుదంతము సాంతముగాఁగఁ జెప్పఁగా
వినిన మొదలంత కచ్చవడి వేగమొలెచ్చె హృదంబుజంబున. ౫
చ. తలఁచినయంతనే మిగుల దర్పకుఁ డేఁపఁగ నంతకంతకున్
వ్వలపులు చింత వంత బలవంతపుఁగోర్కెలు వింతసేయఁగాఁ
జెలులకు కెలుంగనీక తనచెక్కిటఁ జెయ్యిడ నేరకుండె నా
జలరుహపాణి భాగ్యమునఁ జెయ్వులు దక్కుచు లోనఁ గుందుచున్. ౬
ఉ. వీనుల విన్న యంతయును వెన్నునిచక్కఁదనంబు సంతత
ధ్యానము సేయుచో నతసియాకృతి కన్నులఁ గట్టినట్లయై
మానుగఁ దోఁచినంతటన మానిని సిగ్గున మోము వాంచినం
గాసమి నంతలో నగచి కన్నుల నించును బాష్పపూరముల్.
చ. నెలఁతకు వెంటనే మరుఁడు నెమ్మదిఁ గొల్మి వియోగవహ్ని రా
ల్గొలుపను మించఁగా నెడలు క్రొత్తజిగాడ్పున వేఁడియూర్పు బై
ల్దొలఁకెఁ దదుద్గతాభినవధూమఘనాంకురపాళినాఁ బయిం
బులకలు నిండెఁ దద్రసముపోలికఁ గ్రిమ్మె శ్రమాంబు చెక్కులన్.

---

* నేత్రలు. పా.

చ. తలఁగక నే మెలంగినను దాపుర*కంటికి మోముదమ్మికిన్
నెఱిఁ దొవరంగు పొంగి దేహము నీటరి సాటి యటంచుఁ బల్కఁగా
నుతియలు లోఁగ వైరి యిఁక నుండఁగ నీకము గాదటంచుఁ దా
నతివలు లయ్యెఁ జెమ్మట నొయారపుఁగస్తురిబొట్టు మోమునన్. ౯

ఉ. క్రమ్మిన చెమ్మఁ గ్రొంజెమట కస్తురికరంబులఁ గ్రమ్ముచున్ గను
ర్పప్మొము పైఁడిదువ్వలువ మూఁత దలిర్పఁగఁ గోరిక ల్మది
న్మమ్మర మేనియు న్నలుఁగుఁ బూని త్రిపావశత న్వయస్యలం
గొమ్మ యెఱుంగనీక యటు గొంత మెలంగెఁ బ్రమోహమగ్నయై ౧౦

క. ఈగతి విన్నంతనె మను, లాఁగక రేఁపున్ హృదంబుజాస్థపునస్సం
ధాగరిమన్ గరితకు న్యాలోఁ గనఁబడియెన్ రమేశురూపం బెల్లన్.

ఉ. శౌరియచింత్యరూపపటుసంపద సింగిణి గాఁగఁ దగ్గరో
దారత నారిగా హారప్రధానమనోహరసౌమనస్యశృం
గారము లంపకోలలుగఁ గైకొని మన్నసుఁ డేయుఁజొచ్చె నే
పార శిరీషపేశలము లైనతలోదరిసుప్రతీకముల్. ౧౨

ఉ. ఈయదుసార్వభౌముకథ లిట్టివి భావభవానుమోదదం
బై యెదఁ బాయకుండె సఖులార సదా యతనుప్రభావమో
పాయ యని వారువారుఁ బ్రకృతోక్తు లవ న్విని మున్గి గాఢన
న్నాయెమఁ గూర్చి పల్కుటని నానసతానవయై వసింపుచున్. ౧౩

వ. అంత నగ్గద్దియనుండి ముద్దియ దిగ్గన లేచి. ౧౪

సీ. శుక్తికానిర్ముక్తముక్తికంబులరీతిఁ గన్నుల బాష్పాంబుకణము లొలుక
జాలాంతరవిలోలచక్రద్వయములీలఁ జన్గవ పైఁటలోఁ జౌకళింప
ఘనసంఘనిర్గతకరకలకరణిగాఁ దుఱుమున నరవిరు ల్డొరఁగుచుండ
సారసోపరిహిమజలబిందువులపోల్కి మోమునఁ జెమ్మట మొల్లలెత్త
నడుము గడగడ వడఁకఁగ †బెడఁగుగడవ
నుడిగెపుఁబడంతు లుడిగెము లొగిఁ బరాకు
చేయుచును జెల్వకైదండ సేయ నదియు
నిచ్చగింపక యింటికి నేగి యచట. ౧౫

* కంటుక—మాలము. † బెగడు కదుల—మా.

సీ. కలువలగములచొక్కపువాసనలతోడఁ గమలసంకోచంబు ఘనతగాంచె
వెన్నెలపులుఁగులచెన్నుఁదనంబులోఁ జక్రాంగఖేదంబు చాల మించెఁ
జంద్రకాంతోపలస్రవదచ్ఛవారితో విరహినేత్రాంబువు ల్విస్తరించెఁ
గాకారిముఖజంతులోకాభయంబుతో జారులమది భీతి సందడించెఁ
బుడమిచెలి మేనఁబుట్టిన భూరితాప, భరముతో నంధకారంబు పఱవఁజొచ్చె
వలులనెఱతావు సద్గుణావలులప్రోవు, నీరజంబులదాయ వెన్నెలలు గాయ.

క. లోకాలోకాంతరమున, భీకరమై యుండుతమము బెదరి గిరిగుహా
కోకహృదంతరసీమలఁ, గాకెక్కడఁ బాఱి యుండఁగల దీవేళన్. ౮౦

క. చలివెలుఁగుచాయ తమముం, గలయన్ హరియించు ననుట గాదబ్రము కో
కులహృదయము నిది చిత్రము, తలఁపఁ దమోమయముగాఁగఁ దన్రుచి చేసెన్.

* అదరి తమంబు సర్వజగదాత్మకవస్తువు గ్రస్యుచుండఁగా
నడఁచెను గోవిలాసముల నత్తను మంతయు వస్తుదృష్టి చే
పడఁగ నొనర్చె సద్వ్రతతి భవ్యముదంబుధి నోలలార్చెఁ దా
నెడయఁ దుదారవిష్ణుపద మీద్విజరాజు మహోన్నుఁ డెన్నఁగన్. ౮౧

గీ. తలఁప నబ్బుర మీకళాధరునిగోవి, లాసమాధుర్యమహిమంబు లబ్ధవర్ణ[గ
హృదయములుతత్ప్రసక్తిగా నిటులుకరఁగ, కుందుఁ దెలిరాలుగరఁగుటకొప్పిరానఁ

సీ. నిజగోవిలాససన్నిహితనానాపదార్థప్రపంచంబున ద్రీప్త మగుగు
మాధుర్యము ప్రసాదమహిమతో నెనయంగమిగులనర్థవ్యక్తి మెఱుపు గొనఁగ
నసృతవాగాదిదోషాత్మకతిమిరంబు దూరింప వస్త్వలంకారరసము
లలరారఁ జిత్రబంధాదివిశేషము ల్వాలఁగ శుచిరసాస్వాదిరసిక
వరకవులుమెచ్చినవరసాస్వాదమందఁ, గుకవిబృందంబుత్సహప్రకటమహిమఁ
జూడఁ జాలక స్రుక్కఁగ జోడులేని, లాలితి వెలుఁగె మేటి కళాధరుండు. ౮౨

చ. ... మొక్కఁ దేప్రబలునొండుగుణంబు గనంగలేక వి
స్ఫురణము దక్క లోకమున శోభిలఁ జేసె గుణవ్యవస్థ దా
విరహిజనాంతరంగములఁ బెందమముం గుముదంబులందు ని
బ్బరపురజంబుగాకరి............గిరిసత్త్వము న్బచున్. ౮౩

క. వెన్నెలరాయునివెన్నెల, వెన్నలపైఁ బర్వ గిరులు వృక్షము లెల్లన్
తెన్నెలజిగి గిరితరువుల, యన్నలుఁ దమ్ములు ననంగ నలరెన్ ధాత్రిన్.

మ. తొలుపక్షంబునఁ దారకల్ విరళతం దు..........తంతకుం
జలినిగ్గక్కుడుచాయఁ జేకొన మరిన్ సంధిల్లె నిత్తెల్వి తా
రలు మేటుల్ మగఁ డేగుదేరఁ బరమార్గ్రింబైనభావంబునం
జెలువొప్ప న్నదు రేగ్గి *తత్తనువు నాశ్లేషించె నంతేనియున్. ౮౭

గీ. మృదులశీతలకరముల......చుఁ జేసి, కువలయానంద మొనరించెఁ గూర్మిరాజు
కువలయానంద మొనరింపఁ గోరు వాఁడె, రాజనుచు నెన్నుదురు బుధరాజు లెల్ల

చ. ఇనుఁడు చనంగ సందుగొని హెచ్చినరక్తత నైంద్రిఁ జెంది య
...నిన్ని శాచరుఁ డొయ్యారమునం గర మంది నన్ను న
య్యనునిపతివ్రతం జెనక నేపునఁ జేరెడు వీఁ డఁ జూచు టే
పని యని పద్మినీరమణి పద్మముఖంబును వాంచె గ్రక్కునన్. ౮౯

చ. సరసి తుషారరశ్మికరసంగతరశ్మితుషారశీకరో
త్కరఘనబాష్పపూరములు గ్రమ్మఁగఁ దామరమోము వంచి యం
తరతరులీనభృంగచయతారనినాదము లుప్పతిల్లఁగాఁ
బురణ దొలంగి జక్కవలు పొంగక పొక్కఁగ నేడ్చె స్రుక్కుచున్. ౯౦

క. రతు లుడిగి పొంత ద్విజదం, పతు లడలఁగఁ జూచి(చూచి)పాప క్రియయున్
వెత గదుర సరసి లజ్జా, నతముఖి యై యుండె నపుడు నలు వెడలంగన్ ౯౧

సీ. తనతమ్ములను జేరఁ దలఁపఁగఁ బగవాని శరబడి తొవల సంసర్గఁ జేయ
ఖరకరుం డగునినుం డుకుతీవ్రతఁ గడంగి పవలు గాఱించు నుత్పలవిచికిల
బాంధ్యాగారంబులఁ బడవేసి యుష్ణంపు మధు రాన్నములు లేక మాడఁ జేయు
నినుఁ బాఱఁదోలి చల్లనిరాజు చనుదెంచి బెడఁగు కరంబుల వెడలఁ దిగిచి
కలువపూఁబళ్లెరంబులఁ గఱవుదీఱ, హితరసాన్నము గల్పింప నింపు గాఁగ
నారవస్తుతు లెసఁగంగ నారగించెఁ, దనివినుదిఁ దీరఁగ మధువ్రతద్విజాళిగి ౯౨

ఉ. చల్లనిరాజు వచ్చి కరసంగతిసేయ నినుండు సేయుఁగా
కెల్లఁ దొలంగ నంగసుఖ మొంతయుగా సుఖనిద్రఁ జెందెఁగా
కెల్లరుఁ బద్మినీరమణి యొప్పును నెల్లను చంద్రునందు రి
క్కల్లను మెత్తురా యని పకాపక నవ్వెఁ గుముద్వతీసతుల్. ౯౩

గీ. సరసులకమిత్రుఁడగు నెచూ చందమామ, యలఘరాంశుండు దమ్మెమియాదరించెఁ
గాఁక గావించి జీవనగ్రాహిగాఁగ, ననుచు నపునవ్వెననఁ గల్వ లపుడు విరిసె.

* త తరువు.

ఉ. ఏమగవారు, నామగనియొప్పు వహించిరి చంద్రుఁ డన్న య
న్నామము స(ర్వ)మోదఘటనం గలిగెన్ శశికంచుఁ జెప్పరే
ప్రేమను నన్నుఁ జేకొనఁగ బెట్టుగ నీరసమూని పద్మినీ
భామయ మోము మోడ్చె నని పక్షున నవ్వెను గైరవావళుల్. ౧౧

సీ. సితపక్షగతి గాంచి చెలువారి పంకజాసనభావవైఖరిఁ జాలఁ బ్రబలి
వెన్నల లీనెడు వెలిమేన దైవాటి జంకకప్పులు పూనుపొంక మమరి
యచ్ఛంపుగుణమూని లచ్చికిఁ దోడౌచు విధుసమాఖ్య జగంబు వినఁగ నలరి
తమము పోఁగొట్ట నుత్తమధర్మరీతులు సాకల్యముగఁ దెల్పఁ జాగ గలిగి
మూఁడుమూర్తులవేసంబు ముచ్చదువుల
యాకృతియు నొక్కవేళన యానుకొనుచుఁ
గాలభిద గోరి తద్వృత్తి గాంచునినుని
మించి దీపించు దివి మంచునించువేల్పు. ౧౨

సీ. ధరణీధరోరుకందరమందిరోదారతమ మణంపమికిఁ దా నమరె నేమొ
ఛాయాపహరణధౌరేయరశ్మిచ్ఛటావాప్తి లేమిడికిఁ దా నమరె నేమొ
ద్విజరాజసంతతి* దీనత్వ ముడుపఁగా నేరుపులేమిడిఁ జేరె నేమొ
సరసుల నామోదసంపద నందింప బలిమిచాలమికిఁ జేపడియె నేమొ
యొకకలంకంబు నెమ్మేనఁ బ్రకటమయ్యెఁ
గళలు పదియాఱు వెలుఁగంగ మొలఁగుదొరకు
సకలసద్గుణనిధి యైనచక్కనయ్య
కొక్కదోసంబు లెక్కింప నొచ్చె మగునె. ౧౩

సీ. జారసంకల్పంబుఁ దూలింపఁగాఁ జేసి చోరుల మూలకుఁ జొరఁగఁ జేసి
సన్మార్గ మెల్లను సత్ప్రకాశముచేసి పంకజావళిఁ బటాపంచ చేసి
యరిజాలములనెల్ల నండ వాయఁగఁ జేసి యాశ్రితద్విజరాజి నలరఁ జేసి
పరతమోగ్రంథుల గిరిగుహల్ సొరఁ జేసి ధర్మసంస్థాపన దనరఁ జేసి
ఖరకరుఁడు మున్ను చేసినకాఁకఁ బాసి, యలరి సద్వర్గ మెల్లను మెలఁగఁ జేసి
కువలయానంద మొనరించెఁ గూర్మిఁ జేసి, యారచల్లనిరాజు దివ్యప్రకాశి.

చ. వెరవు దలిర్ప యజ్వపతి వేగ రథాంగవధూటికామనః
స్ఫురదురుహేమకుండమున భూరివియోగకృపీటయోని భా

* సంపతి-యా

సురకరకాండజాలముల శోభిలఁజేసెఁ దదుత్థధూమమే
పరఁగెను మేన నంక మయి పంకజవైరికి నొంచి చూడఁగన్. ౫౯

ఉ. అచ్చలినిగ్గునిగ్గులు రయంబున నెమ్మొయిఁ సోఁకుకాఁకచేఁ
జిమ్మనవేఁగినట్లు చెలిచిత్తము తత్తఱ మంద హెచ్చి బ
ల్వెచ్చనియూర్పుగా ద్బదర విన్నని కన్నులు విచ్చి చుర్చురన్
మచ్చరమారఁ జూచి యవమానము మీఱఁగ దూఱెఁ జంద్రునిన్. ౬౦

—♦ చంద్రోపాలంభము ♦—

ఉ. చి చ్చిదె మింట మింటఁ గనఁ జిచ్చొక టబ్బెనె చందమామయో
హెచ్చుగ నిప్పు లుప్పతిలు హేతువు గానము పచ్చివెన్నెలో
యచ్చెరువయ్యె నంగముల నంటిన మాత్రన పొక్కు తేలెనో
యచ్చెరు వేల యిట్టివిరహార్తజనంబుల కట్టు లయ్యెడున్. ౬౧

ఉ. తమ్ములకల్మికిం గనలుదాల్చుచు లోపలఁ గుంది కందు నీ
విమ్మెయిఁ బాంథకామినుల నేఁచక మానుదువే తలంపు మో
హమ్మున నిన్నుఁ గన్నకడు పా బడబాగ్నినిఁ గాలకున్నె భా
వమ్మునఁ జూడఁగా విరహవర్గముపాపమె కా నిశాచరా. ౬౨

సీ. చండాంశుకరమహాజ్వాలలలోఁ గాలి మాఁడక తక్కునే మఱియొకండు
బడబాగ్నిలోఁ బడి భస్మమై కూలక మహి వృద్ధిఁ బొందునే మఱియొకండు
కాలకూటంబు సంగతి గాంచినంతనె మసి గాకపోవునే మఱియొకండు
సైంహికేయమహోగ్రజఠరాగ్నిలోఁ బడి మగుడ నేతెంచునే మఱియొకఁడు

(ఇక్కడఁ గొన్నిపద్యములు లోపించినవి.)

ఉ. అన్నను గూఁతుఁ బట్టుకొనునట్లుగఁ జేసిన దుండగీఁడు గా
క్రొన్ననవింటివాఁ డతనిక్రూరత యే మని యెంచుదాన నీ
*వెన్నఁగ మేనమామవు గదే గురుతల్పగు నిన్నుఁ జేయఁడే
యన్న! కళానిధీ! యతని నల్లుఁ డటంచుఁ దలంచి కూడితే. ౬౩

క. గణుతింతు రెఱుఁగువారలు భువి
గుణవంతులు ప్రకృతి వికృతిగొను నితఁ డనుచున్
గుణవృద్ధిప్రతిషేధము
లణువెఱుఁగవు సమభవంబు లందవు చంద్రా. ౬౪

---

* వేఱుక మేనమామవుఁ—మా

గీ. ఆర్యు లెల్లఁ బ్రసాదమాధుర్యముఖ్య
సద్గుణాలంకృతుల కెల్ల జన్మభూమి
యితఁ డనుచు నెన్నుదురు నిన్ను నెట్లు తద్వ
యోభిపజ్ఞానకలన నింపెసఁగునుతులు.

గీ. అసితరుచి మించు నాహాలాహాలముకంటె
వెలివెలుంగుల యాచంద్రవిషము మించు
నసితవిష మెల్ల మ్రింగెను హరుఁడు రాహు
వీని మ్రింగియు నోపక వెడలనుమిసె. ౬౭

గీ. సైంహికేయు వివేకంబు చాల కీవు, ద్విజులరా జని మ్రింగక విడిచి తేల
వీనిద్విజ*సంతతిద్రోహి దీనఁగాదె, మహిఁ బ్రవర్తిల్లె నీకుఁ దమఃపదంబు.

సీ. ఘనతమాగమములఁ గాంచితి వేరీతి వానినూంతరములు గాన వైతి
రహి నన్నియును బదార్థము లెట్లు దెలిపితి వ్యాప్తి నకుంఠతవడయ వైతి
వాగి నపూర్వాలోక మొందితి వేగతిఁ బ్రాభాకరచ్ఛాయఁ బడయ వైతి
పురుతమోహతి నెట్టు లొనరంగఁజేసితి సత్ప్రకాశముఁ జేయఁజాల వైతి
కాదు తెలివికిఁ బదవిభాగంబు సేయు, వ్యాకరణవేత్తవై యెట్లు వఱలి తీవు
జగతి నెన్నఁగ నీవతిజడుఁడ వయ్యు, నహహ యెట్లు కళానిధి వైతిచంద్ర!

గీ. చంద్ర సన్మార్గవర్తి వై జరుగునీకు, సత్ప్రకాశంబు సేయుఁగఁ జనదె చెపుమ
సరవి దప్పంగఁ బలికితి సత్ప్రకాశ,మిలఁ దమోగ్రస్తునకు నెట్లు గలుగనేర్చు.

గీ. అకట పదదర్శనమ్ము కరాగ్రమునన, యున్న దని చంద్ర యేటికి నుల్లసిలెదు
సంధివేళలఁదమము దుస్తరముగాఁగఁ, బ్రకృతిభావంబె తెలియఁగఁబడదునీకు

గీ. పంకజాతారి సంతాపపదమ వగుట, వాసికెక్కెను నీకళావత్త్వ మెన్న
నకటకట నీవు జడభావమందియుండి, యరసిచూడ మహత్త్వంబునంది తెట్లు!

గీ. మేనిది నిశాసహాయత మెలఁగె ననుచు
సామ్యవైరంబుచే బాధ సంఘటింపఁ
జనున పద మాద్యము హరిద్ర నొనరఁ బలుక
శబ్దమాత్రసమాయాతసమతఁ గంటె. ౭౩

గీ. †నలినబాధక గుణవర్గణంబులోన, గణన గొనలేవు ముగుదలఁ గ్రాచ నీవ
అరసి చూడంగనిది చిత్రమయ్యె నెట్టు,లవని నిన్నుఁగళావంతుఁ డనిరిబుధులు

*సంపతీ-యూ †నలినబాంధవ-యూ

చ. హరియణుమాత్రమానసమునందు జనించి మరుం డనంగుఁ డౌ
కరణిని నీ వతీంద్రియుతఁ గాంచితి వేని నిశేశ మాకు సౌ
ఖ్యరమ ఘటిల్లదే యటులు గామి వియోగులభాగ్యహానియే
హరిహరి తప్పునాడితి ననంగుఁడునయ్యు నతండు నేచఁడే. ౭౫

చ. చలువలరాయ నీకు హరిసన్నిధి వర్తిలుదాన నౌటచేఁ
జెలియల నైతి గా వరుసఁ జెప్పఁగ నైనను నన్నుఁ బ్రోవుమీ
చెలియలి నేచుఁ దోడనుచుఁ జెప్పఁగ విందువె యింత చెప్పఁగా
వలవదు తోడనే పొడమి వచ్చినచెల్లెలియిల్లు నిల్పితే. ౭౬

ఉ. తమ్ముల*మేల్ నిజోదయత దాసినయంతనె కూల్చి సుప్రభా
తమ్ములఁ బక్షపాతసుఖతమ్ముల సద్విజరాజచంద్రజా
తమ్ముల నెప్పుడుం బొగలఁ దద్దయుఁ జేయుచు నుండు నీకు నో
తమ్ములదాయ సద్గతియుఁ దద్ద్విజరాజత గల్గె నెట్లొకో. ౭౭

గీ. రాణగైకొని నే ద్విజరాజ ననుచుఁ, జెప్పికొన నీకు మదిలోన సిగ్గుగాదె
విప్రయోగులపాలింటివేరువిత్త, వది నిశాచర నీకెన్న †ననుచితంబు. ౭౮

సీ. పదియాఱుదినములు ప్రాప్తమౌ వెంటనే యటిగెనుసిరికి మి న్నందికొనుచు
ద్విజరాజసాంగత్యవృజినంబు గైకొంచు సరసులు బెగడెడుచాయఁ గనుచు
ద్విజవృత్తిహరియించువెరవులో మెలఁగుచుస్వప్రకాశోన్నతి చనతులఁగుచుఁ
జెలఁగి మాన్యక్షేత్రములనాక్రమించుచుమావంటియనదలమున్ని గొనుచుఁ
దెరలనికలంక మానుచుఁ దిరిగితిరిగి, యుడిగిపోయిరాథోగతిఁబడెడునిన్ను
...ద్విజరాజవని...యెన్నుకొనెదు, కోశకారులు జగతిలోఁ గొఱఁతపడరె.

గీ. చంద్రత్వద్వాచక(ంబగు)చంద్రపదము, పలుకు విపరీతలక్షణాకలిత మగుచు
ఖేదకారిత్వ మిది వింతగాదు తెలియ, దర్పపదము విరుద్ధబోధకము గాదె.

క. కిరణసితరుక్కలంక, స్ఫురిత‡తానీ(ల)రుచులొదవఁ బూర్ణేందుఁడు సం
హరిణారిఁ బోలు నేనియుఁ విరహిమృగము పీనిఁ గనుచు విడుచు నసువులన్.

క. కరము సుఖంబొనరు బుధ, స్ఫురణంబున జగతి నీకుఁ బొడమినబుధవి
స్ఫురణంబు జగదుపద్రవ, కరణం బని తెన్నసయ్యెఁగా భువిఁ జంద్రా!

క. సకలాలంకృతి వేగతి, నకట లలితచిత్రరూపకౌపమ్యంబుల్
వికలములు నీకు మతి దీ, పకభావవిరోధములును బ్రకటం బగునే. ౮౩

* మేలునిజోదయ. - †ననుచితంబె. ‡స్ఫురితాసీరుచులు.

ఉ. ఆతతపుష్పరస్థలి విహారముసేయు గజంబుచంద్రుఁడ
ప్రీతి బిసాంగులం గెడవ *బిట్టు మదిం గనలూని సింహశా
జాతుఁడు మ్రింగి క్రచ్చె మెయి చాలక వానికి దోస మేమి జై
వాతృకుఁగా సృజించు నలువం దులువంచు వచింపఁగాఁ దగున్. ౮౮

గీ. విరహిబిసములఁ ద్రుంచుచు విమలపద్మి, †నీగణంబుఁ గలంచుచు నీరజారి
మదగజేంద్రునిసాటియై మలయుచుండఁ, గరబహుత్వంబు వీనికిఁగలదు గాని.

చ. ♦చఱ కగుమింటిబల్మిఁ గొని స్ఫారము జాఱఁగఁజేయు మారుఁ జి
చ్చుఱకను వెట్టచేఁ గడపి శూలి శశిం దలఁదాల్పె ‡నేలొకో
నెఱవారవింటి కోషధులు నిచ్చలు నేలుట వీనిఁ ద్రుంచినం
దెఱలును ఖేదము ల్విషమదృష్టికి నిశ్చితబుద్ధి గల్గునే. ౮౯

సీ. నింగికి ముట్టంగ నెఱిఁ బాలమున్నీరు పొంగించు, మేనెల్లఁ బొక్కఁజేయు,
జలజాటవి దహించుఁ, జంద్రుఁ డన్న(ను)విశేషార్థవాచ్యార్థంబు లనుపపన్న
ములుగవహ్నిత్రయి దెలియనబ్బురమేమిశ్రౌతవాక్యమున నహాశకేతుముఖ్య
భేదకముల నుపపాదించుసూర్యునిఁ జంద్రమః పద మని చదువులేదె
యరసి చూడంగ వహ్నికి నరిది వీని, వేఁడి యెట్లన్న నత్యంతవిహితయోగ
బలముచే నుక్తకార్యంబు వరఁగుశుచికి,నట్టికార్యంబువీనిఁగన్నంతఁబొడము.

గీ. జనన మందినదేశంబు మనఁగనీఁడు, వీని కాకలితో నెట్లు భేద మెనయుఁ
గలుషితాకృతి యగువీనిఁ గన్నకతనఁ, బాలవంటికులం బెల్ల భంగపడియె.

క. కాఁకదొరబిడ్డ తమ్ములఁ, గాఁకం దొరలంగఁ జేయు గామిడికానిం
గా కెనయ నెట్లు దూఱుచుఁ, గాఁ కెనయం బుర్వరుర్వకట్టిఁడి దిట్టున్.

—। మన్మథోపాలంభనము. ।—

శా. తల్లి న్మ్రుచును నన్నగద్దె యనుచుం దర్కింప కల్లార్చి శా
నల్లారుంజిగితమ్ము లంపగమిపా లౌనట్లుగాఁ జేయునీ
వల్లుల్ గన్గొనఁ గన్నతండ్రిమది దావజ్వాలలోఁ డించదే
చెల్లంబో మముబోంట్ల నేఁచు టరుదే చింతింపఁ జేతోభవా. ౯౦

చ. హరుఁడు మహోత్సుఁ డం చెఱుఁగ కాతని కెగ్గొనరించి కంటిమం
ట రహిఁ దొఱంగి నీఱు యనంగ పిశాచము వైతి కానిచో
ధర నబలాలి సోఁకుదువొ తద్దయుఁ దాపము సంఘటింతువో
పరఁగ నమత్యుణోన్నిమదపారవికారదశల్ రచింతువో. ౯౧

*బెట్టుమదిం †నీరుణంబు ♦చెఱకనియుండఁదగును. ‡నేలకో ద్విట్టకా యూ.

సీ. చల్లెలి*యిల్లెల్లఁ జెల్వుకల్లఁగఁ జేసి కుముదంబులకుఁ బెంపు లమరఁ జేసి
సూర్యసంగతి నైనసొబగుమైఁ గలిమూని సురలకు కళ లెల్లఁ జూఱచేసి
పూర్వపక్షంబున్నఁ బొడవుగా నిక్కుచు నితరపక్షంబున్న నింపు చెడుచుఁ
జాలని యొకకళ సర్వజ్ఞతలఁ దన్ని మేల్కళానిధి వని మిన్నుముట్టి
ధరణిఁ జక్రస్విజాతులఁ దలఁకఁజేసి, శంక డిగి రాజ ననెడుకళంకితోడ
వఁకయేపొంకమనిపూనుమంకుతోడఁ,బొందుదగునయ్యనీకుముకుందతనయ

గీ. సాధనం బవికల మైన జగతి సాధ్య, సిద్ధిఁ గాంతురు గాదె ప్రబుద్ధు లెల్ల
నహహ వికలము సాధనం బైనయట్లు,చేకుఱెను మార యువజయసిద్ధి నీకు. ౯౩

ఉ. తామదిలోఁ గళంకుడిగి తక్కె దలక్కగఁ జేసికొఁగనే
భీముని నీకుబల్వగతుఁ బెద్దగ భూష్మణచేసి నీశరం
బేమఱి కూల్చినట్టి జడు నీతని నే మని చందమామ మా
మామని చెప్పుకో హరికుమారక నీమది సిగ్గు లే దొకో. ౯౪

చ. సమయము గాఁగనే విరియసాఁగెడుతూపులు నంటినంతనే
భ్రమపడి కూయునారి తఱిరాఁ దెగువిల్లు వియోపమైనతే
రు మఱి చిట్టుక్కురన్న బెదరుం బడివాగెలు గల్గి దేహమే
యమరనియోధవై యకట యందితి వెట్లు జయంబు మన్మథా. ౯౫

గీ. బాణ మున్మత్త మై నీకుఁ బరఁగసాగె, మధువుతోఁ గూడ నీకు నున్మత్తవృత్తి
గలుగఁగార్యంబు చెడుఁగానఁ గానిపొందు,విడువనీక నైనఁదగుమధుద్వేషితనయ.

సీ. తియ్యవిలోనంబుఁ దిని మత్తిపట్టులఁ జేరి నున్నుస్తులఁ గేరువాని
నొకమృదుసుమమాత్ర మొంట నంటిన యంతఁ జెల్లుభీతిల్లిమూర్ఛిల్లువానిఁ
బల్లవపద మీఁగి బలుకప్పు నైఁ బూని పంచమవృత్తి చేపట్టువాని
శరవర్షముల నుత్తి గిరిగహ్వరము దూఱి హోవడి తప్పుట†నలరువాని
మప్పరంబున నెలకుబ్బి‡యూఁగువాని, వెన్నెలకె వాడి తెలివెల్లవిడుచువానిఁ
గలసికొని మన్కు వేధింప వలచితేని, మదన మనలే వరూపమయ్యెదవుగాని.

— మందమారుతోపాలంభనము —

క. అలివేణి యిల్లు నెవ్వగ, వలినేలుపునల్లుఁ దెగడి వారనికినుకన్
బలుకీలలీల సోఁకెడు, చలిగాలిన్ దూఱుఁ దూఱి చననివిరాళిన్. ౯౬

సీ. వాగులు మలలు నవ్వారిగా నెలకొని కనరాక మెల్లన చనుచు నెట్టి
సమయంబునైన వాసన మచ్చు వడిఁ జల్లిచలువలెక్కగఁజేసి సాధుమావ

*యిల్లల్ల †బడలువాని ‡మాఱువాని-మూ.

వస్తువ్రణ్గోను నల్వ పశ్యతో హరచోరుఁడని పాపములలోను నలయుహీన
జులములఁ గాఁపుంచి కడ నైవఁగా వాని నటుచేసి తద్ధనం బంత గొనుచు
మఱి శోధింప వచ్చి తిరులయుకవస, మనవిగాఁ జెప్పెదను నాదుమాటవినుము
ధైర్యమునిమ్ముడనొకమహాధనముగలదు, పెన్నునకుదానిలాగెదుపెరవుగనుము
చ. పురహరమూర్తులందు నొకమూర్తివి బాలసమీరి నీవుగా
హరుసకు శాప్ప డతిగతుఁ డైనయనంగుని క్రింద నీఁగఁగాఁ
బరిణత మయ్యె నెట్లు మది భావము నీ కభిమానశూన్యమే
హరిహరి తప్పఁ బల్కితి ననంగత నీవుఁ బిశాచ మాదువున్. ౧౦౧
గీ. బాలభావత జడుఁడవై వచ్చుకీషు, దెలిసికొనలేక ననుడాయుఁదలఁచి పవన
వచ్చె దేటికి మోసంబు వచ్చు నీకు, ఫణిశయానునిసన్నిధిపట్టు మాకు.
క. కట్టా యేఁచెదు చెలువులు, చెట్టలపాలయ్యె నేమిః*చేరెదుఁ బుట్టన్
పుట్టవ యాఁదోడులతో, నుట్టిపడితె యాకసంబునుండి సమీరా. ౧౦౨
ఉ. గంధపుఁగొండ నండగొను కట్టెఁడి పాపవిషాగ్నికీలలం
జెందఁగఁ బోయె నీజడిమ శీతత గల్గినఁ గాఁక చేయుదే
మందత నిట్టి ధీ యొదవె మానగు శైత్యము నీకుఁ గల్గెనా
యందలి దందశూకచయ మంది గ్రసింపఁగ నిందు వత్తువే. ౧౦౩
గీ. విరహిజనముల ప్రాణముల్ వేగఁగొనఁగఁ, బవననీకెట్లుదగు జగత్ప్రాణసంజ్ఞ
యశ్వకర్ణాదినయమున నది పొసంగు, నొండె విపరీతలక్షణ నొవరునొండె.
గీ. నిరతిశయమత్తనూష్ణిమ నీకు నెట్లు, లుష్ణిమ యడంగి శీతత యుద్భవిల్లు
నాతురతఁ గానిపనికి నీ వరుగుదెంచి, తహహ జనునకు విజ్ఞాన మబ్బునెట్లు.
గీ. పాంథులకు నిన్నునుండియుఁ బడనిపాటు, లెట్టు లన్నను జంద్రశీ(తాం)ధనమున
నతనువహ్ని సమింధనం బగుటయరును, మలయపవమానపయినీవుమలయుకున్న.
క. మాయన్న శమనుఁ డనుపఁగ, మాయన్నా వచ్చినావె మ మ్మరయంగా
మాయన్నదూత వగుట, న్మాయన్నయుఁ బోలె నీవు మ మ్మలఁచెదవో.
చ. విరహుల నేఁచుపాతకము వీఁడెడి వోవునె జాహ్నవీజలా
భరమునఁ గుంచి బల్షలలపాలుగ నుంచి భ్రమంబు నించి రూ
పరిదిగ డించి యప్పు గవు లంట రచించి యహీనభీతి మే
దురమా రచించి నిన్నుఁ బలుభ్రోవల బెట్టెదుఁగాక మారుతా. ౧౦౪

*చేరెదుట్టన్ పుట్టదయాం-షా.

గీ. పాంథజనతాపహారిత్వ మొసఁగరింతుఁ బవన నీకుఁ, జెల్లునలాభిధానంబు చెల్ల దనిల
శబ్ద మచ్చట నిత్యసంసర్గఘటన, మహీజనంబుల కెల్లఁ బ్రాణాధికంబు.

చ. మలయసమీర, రీతి గన మించిన శబ్దము నుత్పు శైత్యముల్
బటువులు సుప్రసాదత యపారము మాధురి హెచ్చు వాసనల్
గలుగు రసంబు పూర్ణ మని కా వినుతించు బుధాళి యట్టినీ
తెలువపురీతి నాచెవుల కెంత (నిరోంత), కఠోర మేలొకో. ౧౧౦

— ( శుకకోకిలాద్యుపాలంభనము )—

క. కలకంఠి యిట్లు గందపు, మల మెలఁగెడుగాలిఁ బల్కి మానక శుకకో
కిలబర్హిణాళి హంసల, కలకలముల కలికి పలికెఁ గటకట యనుచున్ ౧౧౧

గీ. శుకసుకవి నీకవిత్వంబు శోభగాంచు, మధురతరవాక్యరచనల మదనమూర్తిఁ
డౌ అపుడె నీకుమీఁ దెక్క నోర్చి తెల్లు, విషము మున్న త్తమతనిగోపితతిగాదె

గీ. యోగిజనులకు నానంద యోగమొసఁగు, నతిజడాయోగులకు నెల్ల నరతిఁ జేయు
నీమధుకోక్తి యీయుక్తి నిజము సుమ్ము, శుకమ్ము మూక్తుల కైవడి శుకవతంస.

చ. హరిపదదేశ మందు మహామధురంపు రుచుల్ స్వజిహ్వకిం
పరుదుగ నాని మాధవసమాశ్రయసైకనిబద్ధబుద్ధి మే
లిరవగునట్టినీకుఁ దగునే శుకసత్త్వము మెన్ని చూచుమా
హరిహరి యోఁడుఁ జేవలకు నాంతర మెల్లను నొవ్వఁ బల్కఁగన్. ౧౧౪

చ. నలువ యొనర్చె ఘ్రాణము ఘనం బగుశక్కగ యేతదర్థముం
దెలియక శబ్దసామ్యమునఁ దియ్యనిచక్కెరఁ బెట్టఁ బోగి ర
ట్టుల వయిన న్నిజోక్తులఁ గఠోరత మానుమ నీకుఁ గీరమా
తెలిసెఁగదా విధాత్రుఁడు విధించినకార్యము రిత్తవోవునే. ౧౧౫

క. సుక మానసీక చిప్పలకుఁ, బిక మాటి కొనర్ప నిది రసికమాధురియే
యిఁక మానుము ముఖజితకిం, శుకమా చల మేల బాలసుకుమారకమా

చ. అనుసమయాపతద్విషధరాగతసన్మువనర్తవానువ
ర్తన లోనగూడియు న్విషధరగ్రసనోగ్రత మించి తోశిఖం
డి నిను నుతింప మైఁ దలఁకు డీవిఁ గలాపము కేశపాశమై
మొనయ యదూద్వహుండు ధరియించుట మెట్టులొకో మయూరమా. ౧౧౭

శా. లేదావంత యనుంగు నవ్వగల జాలిం బొందఁగా నేరికిన్
లే దావంతయుఁ బెంచె నంచ మది న్నోలిం గూర్చి యహోశిఖీ

నాదాతి న్నినుఁ బెంచమార్చ నిఁక నెన్నం గొంచె మా పాపము౯
రా దావ్యాకృతి దా నిపాతితమయూరవ్యంసకంబే కదా. ౧౧౯

సీ. చతురాననాకృతి సతతంబుఁ బూనుట గగనపథంబున గతులు గొనుట
నీరజాంబులయందు నెఱిఁ గూర్మి వడయుట మాధవుచెలువు రా మదిఁ బొదలుట
ఘనకాలమున నప్రకాశతఁ బొందుట యురుధరాంతరసీమనుండి పడుట
కాలవృత్తులఁ గాంచి *కాంచమ్ములా నుంట ఖగశబ్దవాచ్యత గలిగి మనుట
హంసనీకునునన్నుఁగన్నహంసునకును, దారతమ్యంబుగలుగు నెతలఁచిచూడఁ
బోఁడిమిఘటించుమాతంద్రిపొందుడిగిన,యుందుఁబోఁబొందునీకుందునిందితంబు

ఉ. పాలును నీరు నేర్పఱుపఁ జాల్పనుచట్టి(ది) గోపకన్యకా
పాలు నుదారకీర్తిరుచిపట్టిది యంచును నిన్ను నెన్నఁగాఁ
బా లయినట్టి నాదుమయి భావజుతెంపఱియందగుంపుపెం
జాలుగఁ జేసి కన్ను జడిపాలుగఁ జేసితిగా సితచ్ఛదా. ౧౨౦

చ. మును దమయంతి నైషధుని ముచ్చట దీరఁగఁ గూర్చి కీర్తి చే
కొనిమె మరాళచంద్రుఁ డదిగోలె భవత్కుల మెల్ల నిర్మలం
బన నలరారు నమ్మహితునట్ల చరించుట నీకవశ్యమే
విను మటు గానఁ గృష్ణునకు వే చని తెల్పుచు నన్నుఁ గూర్పవే. ౧౨౧

క. కవికి వైదగ్ధ్యవలె న్నాకవి కావైదగ్ధ్య యిష్టగతి ము న్నలరెం
గవిరాజ నీకు నేనుం, బ్రవిమలమతి నిష్ఠురాల భావింపఁగదే. ౧౨౨

గీ. తుల్యరుచిపక్షయుగమునఁదొలఁగువానిఁ, గమలములమేలుసైఁపకకందువాని
మేను సకలంక మైనను మెఱయువానిఁ, గూడకుముహంస తదితరగుణరిరంస.

చ. అనుపమమానబద్ధసరసాగమపల్లవసేవనక్రియా
జనితము లైనమాధవవశంవదతాద్విజవర్యభావముం
గనినటువంటి నీ కకట గాలిమఁ గ౯ తొగరెక్క పంచమ
ధ్వని వచియించు †టిట్టి యుచితం బగునే పికమాతలంపఁగ౯. ౧౨౪

చ. అకట సపక్షపాతత నయంబును బూనితి వంచు నమ్మినం
బ్రకటవిపక్షపాతమున వర్తిలి నీ వవిపక్షపాతము౦
బికమ ఘటించె దేమిటికిఁ బేర్మి మదిం గదియించి ప్రోవు న
న్నిఁక మఱి యొంపు మాని వినుమీ కనుమీ పరపుష్టనామము౯. ౧౨౫

* కాంచమ్ములా ॥ † టిట్టిభియుచితం-యూ.

గీ. మాటమంచితనము మహిలోఁ బ్రసిద్ధంబు, మాటమంచితనము మనకుఁ గలదు
చిగురు వాఁడిచిరసము తెగఁద్రావుదానికి, నీకుఁ బికమ యదియు జోకగాదు

చ. సరసులపొంత హంసగణసంగతి సేయుచుఁ బద్మగహ్వరాం
తరముల నుండుచుం దనువు దాఁచుటకై భువిలో నదర్శన
స్ఫురణగఁ బుచ్చనీయ పలుచోటుల భిక్ష యొసర్చునీకు ని
వ్విరహులమీఁద నెట్లొదవె బెట్టుగఁ గ్రోధరసంబు భృంగమా. ౧౨౮

ఉ. జీవనమాత్రనే తనివిఁ జెందుచు హంసకులంబు నాత్మగా
త్రావళిఁ జాలఁ దన్పుచు ననల్పమనోహరసుప్రసాదశో
భావృతమైన సారసచయంబులయాంతరసార *మెక్కు నీ
కేవిధి సీధుపాయికి నళీ దయపుట్టదు నయ్యయోగిపై. ౧౨౯

గీ. చాల సీధువుఁ గ్రోలుచు జడత నొంది, నీచతను గాంచితివిగాదె నీవు జగతి
సకట భృంగంబ సంబుద్ధి నాంధ్రశబ్ద, శాస్త్రకర్త మహత్త్వంబు నదివె నెట్లు.

వ. ఈరీతి నానారీతిలకం బబ్బెరి నవమతించియు నలరువిల్తు నధఃకరించియు నలసపవను నవమానించియు నళుల నవహేళనించియు నంచల ననాదరించియు నాటపులుఁగుల ననురోధించియు, ననవిందుల నపాకరించియు, నతనుమావుల నపురస్కరించియుఁ దద్దర్శనంబునం దత్స్పర్శనంబునఁ దదనులాపాకర్ణనంబున వెతమేరమీఱిన యయోగపారావారంబున మునింగి మూర్ఛిల్లిన నుల్లంబునఁ దల్లడిల్లి నీలవేణీప్రముఖపల్లవాధరలు తెల్లవాఱు టెప్పుడో †తెల్లంబుగా నీమెతల్లిదండ్రులకు మేమెల్ల (మెల్ల)న నరిగి విన్నవించు టెప్పుడో యని యనితరాయత్తచిత్తలై యమ్మత్తకాశినికి నుత్తల మొక్కింత మెత్తంబడఁ దత్తదుపచారంబు లాచరించు చున్నయవసరంబున. ౧౩౦

చ. సరసుల నేర్చి చక్రముల సంస్మృతిఁ గూల్చి జగంబు వెల్వెలం
బారయఁగఁ జేసి వారుణికిఁ బోయె నిశాచరచంద్రుఁ డింక నీ
వరయఁగ రా నిదే సమయ మంచును సారెకు మిత్రుఁ బిల్చె నా
మొసెసెను గాలవేను లటముందుగ నుత్త్వము మువ్విధంబుగన్. ౧౩౧

శా. ఊకారంబు సవర్ణదీర్ఘయుగళీయుక్తంబు గావింపుచున్
జోకన్ హ్రస్వముఖస్వరాంకములఁ దా సూత్రంబున న్మాటెఁ గా

---

*మిక్కు. †తెల్లంబు గానితల్లిదం-మూ

*వ్యాకర్త్రాముని మద్వచస్సరణి నుత్వం బచ్చుట న్వాన మం
చూకారాకృతి త్రిప్రకారముగ మ్రోయుం గాలవిద్వాంసముల్. ౧౩౨

ఉ. మిత్రుఁడు రాతి †రిచ్చెఁ దనమ్రోలిమిఁ గైకొని పొంగి తండ్రి యీ
గాత్రము లెల్ల నుల్లసిల గౌరవ మొప్పఁగఁ బొచ్చె నింక న
మిత్రుఁడు గైకొను న్వసు(వు) ‡మేను లిఁకెట్టులు ప్రోదిగాంచు నం
చాత్రము దోఁపఁ దెల్విడిగి యాడుచు నుండెను దీపడింభముల్. ౧౩౩

క. నిలిపినదిక్కునఁ గుటిలత, దలఁపక సస్నేహవర్తిత న్వెలఁగు మముఁగా
వెలయింపఁడు ఖరకరుఁ డని, వెలవెలఁ బోయెను బ్రదీపవిసరం బెల్లన్.

చ. కువలయ మేర్చ నుగ్రకరగుంభన మై నినుఁ డేగుదెంచె స
త్ప్రవణత లే దరిప్రజము రాణమొసంగెడు యుష్మదీయ వై
భవములు చెల్ల వేగుఁ డని బంధులఁ దెల్పఁగ వేగ వచ్చె నా
దివిఁ గనుపట్టు సూక్ష్మరుచిఁ దేలుచు వేగురుఁ జుక్క చొక్కమై. ౧౩౪

క. అనుసృతశబ్దగుణాంబై, కనికనముల వేగుఁజుక్క కడు నలరారెం
గనసగుచు గనమిఁ గైకొను, చన్నువగు నయ్యర్థమునకు నతిమిత్రంబై. ౧౩౫

మ. ఉరుపూర్వాగమసంగతిం గొనుచు నెంతో రక్తిమం బూనుచుం
గరము ల్పాఁచె మహాంబురాసు లలరన్ ఖండించె నుద్యత్తమో
భర మెంతే నపరాగమంబు గనుచున్ భావింపఁ జేయుం దమో
భర మారా ద్విజరాజు చిత్రగతులం బాటిల్లి చూపట్టెడిన్. ౧౩౬

చ. అరులు దొలంగ నత్తువలయంబు చెలంగ సమస్తవర్ణముల్
సిరులు మెలంగ బత్తమము చెన్ను దొఱంగఁగ రాజు రాణమై
గరము వసించి కాలగతిఁ గ్లుసిరు ల్విడనాడి పోవుచున్
జరమఘనాగమంబు గొని సారమహాంబుధిఁ గ్రుంకె గ్రక్కునన్. ౧౩౭

— । సూర్యోదయవర్ణనము । —

క. పూర్వమహీధరశిఖరా, ఖర్వాసన మెక్క నినుఁడు కడురక్తిన్ రా
సర్వదిశలన్ ద్విజోక్తులు, పర్వెఁ దదభ్యుదయవిభవపటుబీజము లై. ౧౩౮

సీ. ఇనుఁడు రా నుదయాద్రిఘనభద్రపీఠిపైఁ బఱచిన నునుగెంపుపఱపు పసంగ
సమ్మిత్రరథరశ్మ లై మెలంగెడు చిల్వపడగలరతనాలకాంతి యనఁగ
నజహూప మైనట్టి యంబుజాప్తుని మేని పురతఃస్ఫురత్కాంతిపూర మనఁగ

* వ్యాకర్త్రాముని † రిచ్చ ‡ మేనులిపెట్టులు-యూ.

సప్త - ప్రకృతి

నినుసిరి మగుడంగ నిడ నెమ రేగిన సప్తనాలుకల వేల్పుచాయ యనఁగఁ
భూరిణ తేంద్రమతంగజప్రబలదంత, కుంఠముఖదారితోదయకుధరహైమ
తటసముత్పతగురు రేణుపటలమనఁగ, సాంధ్యరాగంబుతోలు దెసఁజాలనల రె.

సీ. చెలువులు గుల్కెడుసీమంత రేఖపై సొగసూను కుంకుమ సొగ గాఁగ
సింగార మొనరెడు చెక్కుటద్దంబుల దీపించు పూఁతచందిరము గాఁగ
విన్నాణములు గాంచు వీనులఁ గ్రొన్ననశాణించు కర్ణపూరము లుగాఁగఁ
గొమరు సిబ్బెపుగబ్బిగుబ్బలఁ బవడాలఁ బురణించు బలుబన్న సరులుగాఁగఁ
దనదు కెంజాయలకు నాస దందడింప, విప్పుగఁటులతోవకంటులొప్పుమీఱఁ
బొఁడుపుగుబ్బలిగుబ్బలపొందు సేయ, కండిగనుపట్టె మార్తాండమండలంబు.

సీ. అందుగుఁజిగు రంచు బృందారకస్వామిసామజంబు కరంబు సాఁచుఁజూడఁ
బలుకుఁబూఁబోఁడిమై మెలఁగెడుచామకై చిలుకబింబంబంచుఁజిదుమఁజూడఁ
దళుకుఁగెందామరతండం బని *విరించి పడివాగె రాయంచ తడవఁజూడ
మహితకుంకుమకర్దమంబంచునూహించియగచరాంగన లెల్లనలఁదఁజూడఁ
గెంపుడా లంతటంతటఁ గీలుకొనఁగ, నుదితుఁ డయ్యెను జగదేకవిదితకీర్తి
యాదివాఙ్మూర్తి ద్రుహిణరూపానువర్తి, సంహృతనతార్తి ఖేచరచక్రవర్తి.

సీ. సప్తప్రకృతిస్రుత్యర్థసత్తర్కనుగ్రంబు నొఅపుఁ దెల్పెడు మేటిరొజ్జ యనఁగ
†జగదుత్ప్లవోదయశాంతిక్రియార్థమై వఱలెడు పటుహోమవహ్ని యనఁగ
జలవాసనియత యోగాజలజినీతతితపఃఫలము గైకొన్న వివర్త మనఁగ
జక్కవపులుఁగుల స్రుక్కించు విరహాగ్ని మానింప దీపించుమణి యనంగ
మూఁడుమూర్తులతోఁ గూర్చి ముచ్చదువులఁ
బొడుపుగుబ్బలిశిఖరంపుమూషలోన
మొనయ ఘటియించి చేసిన ముద్ద యనఁగ
నింబు మీఱంగ నహిమాంశుబింబ మలరె. ౧౪౩

క. సతతెజీల ఘుకొదత, హాతిఁ దుము రగుపూర్వపర్వతాగ్రస్థలి ను
ద్గత మైనరజము గ్రమ్మిన, గతి నినమండలము కెంపుగదురఁగ నొప్పెఁ.

సీ. అఖిలనేత్రాంధ్యసిద్ధాంజనకళికలు తిమిరోపసంహారదీపశిఖలు
భూమీరుహాగ్రప్రభూతపల్లవములు ‡కమలినీతంద్రీవిఘటనబంధు
లక్ష్మీఘనఘూకౌఘవీక్షణపటలంబు లంబరాంచలతప్తహైమరేఖ

*కలంచి †జగదుత్ప్లవోదయ ‡విఘనవొందు-మూ

లురుయాగవహ్నిసంస్ఫురణైకధౌర్యములు కైరవనిద్రానుసారిగీతు
లతివిరహికోకసాంగత్యచతురచేష్టలుడుగణోత్పాతకర్ణేజపోత్తమములు
దిఙ్మలినతాప్రమార్జనదీప్రవార్ధు లినకరచ్ఛవిమాలిక లింపుగాంచె. ౧౪౬
సీ. ముప్ప్రొద్దుదుగదప్ఛిమోముల్లొంచెడుసామిబారపోఁడుముఁలూనుబలిమికాఁడు
చుక్కలచెలికాని జోడైన నెఱవాది తొవలమే లోర్వనిదుండగీఁడు
తమ్మితావులఁ దావి గ్రుమ్మఱించు ననుంగు వేవేఁడిచాయల విఁతలాఁడు
ముత్తొంటిచదువులు హత్తు మైఁ గలమేటి పగడచక్కగుఱాలసొగసుజాణ
పగలు గావించుచును జుట్ట మగునొయారి, జగజంత వేల్పు
కుంటిగడపరి యొకబండికంటి తేరు, గడప రిక్కలతెరువున నడవఁదొడఁగె.
క. భీకరతమోంబురాశిఁ, జోకఱి పడియున్న జగము శుంభద్యో
ద్రేకత మిత్రుం డొగిఁ దన, వేకరముల నుద్ధరించె వేకనుపట్టన్. ౧౪౭
క. ?తొలుదెసయును పేర్కొదలగు, కలపేరులపుట్టినిల్లు కరువలి జేజే
చెలికాని కప్పు లొసఁగెను, బలుసిరులవెలుంగు బ వెలిఁగెన్. ౧౪౮
గీ. అపుడుసప్తాశ్వుఁడఖిలశబ్దార్థములను, నవనవోన్మేషమొనయించినలువుపఱిచె
నబ్రమా యిది సర్వశబ్దార్థజాల, మహితకరమండలుం డైనమా(న్యమతికి)
సీ. నానావిధార్థసంధాననివాసంబు సత్కాంతికరపదసంగతంబు
నకలంకసుందరం బతులప్రసాదంబు ననుపమాజోగుణాత్యద్భుతంబు
ననదృశానందనిష్యందధౌరేయంబు బహురసగ్రహణైకబంధురంబు
గువలయమోదసంకోచనప్రవణంబు బుధకవిసంయోగభూషితంబు
సంగరౌదార్య మఖిలభూషణ ముపాత్త
విష్ణుపద మాచుఁ గవిచంద్రవిరచితంపుఁ
గావ్యమనఁ గోవిలాసంబు గడు సరసుల
నలరఁజేయఁగ సూర్యమండలము దనరె. ౧౫౦
క. అరుదైన లోకమిత్రత, కరము ప్రసిద్ధంబు గాఁగఁ గడునామోద
స్ఫురణ దయచేసి యరులన్, సరసుల సరిగాఁగ నేలె జలజాప్తుఁ డొగిన్.
గీ. అఖిలపదదర్శనా , వ్యాకృతి యొనర్పఁ దాఁ బూని యఖిలసం
లప్రతీకప్రకాశత నమరఁజేసి, మఱచెఁ గాఁబోలును భసంజ్ఞ వఱలఁజేయ
ఉ. చాయల సారుహావారముపైఁ దమోరిపుం
ఛాయక డాఁచునంచు గిరివర్గముపైఁ బగవానియాంద్రబ

ల్చాయల మాటు నంచు సురజాలఫలంబులయి న్నరోమరహా
జాయతదృష్టు లుంచె వన నంబుజబంధుఁడు నించెఁ గ్రొంజిగుల్. ౧౫౩
చ. తేమను నిరాకరించి...... ౧౫౪

(ఇక్కడఁ గొన్నిపద్యములు లేవు)

—। కాళిందియవస్థఁ జెలి సూర్యునకుఁ దెల్పుట। —

సీ. అవధారు దేవ లోకారాధ్యనిజరూప విన్నఁగదే జగదేకవిమలదీప
యాలింపవే భక్తజాలరక్షణదక్ష చిత్తగింపవె హతోద్రిక్తవిపక్ష
యాదరించవె సహస్రాంశుమాలాధుర్య మనవి చేపట్టవే మహితశౌర్య
మది నిల్పవే వేదవిదితసద్గుణగణ్య యభయ మీఁగదె మహాప్రభువరేణ్య
పలుకువినఁజూడఁగదవయ్యజలజమిత్ర,తలఁపులీడేర్పఁగదవయ్యకలుషజైత్ర
ప్రేమ నాయెడ నిల్పు ముద్దామధామ,చక్కనిటు చూడవే గ్రహసార్వభౌమ.
సీ. సకలలోకానీకసంరక్షణ పరాకు తిమిరోరుగజమృగాధిప పరాకు
కమలప్రమోదసంఘటనధుర్య పరాకు హతభీమనిగ్రహాహిత పరాకు
బ్రహ్మాదిమూర్తిసంపద్బంధుర పరాకు వితతత్రయీరూపయుత పరాకు
భవ్యాంబరాంగణదివ్యదీప పరాకు నిరుపమగుణరత్ననిధి పరాకు
కలితకారుణ్యపూర్ణవీక్షణ పరాకు,నతమనోరథపూరణవ్రత పరాకు
ధార్మికోత్తంససేవితోదయ పరాకు, తపన మార్తాండ సంవిదాత్మక పరాకు.
గీ. సామి నేఁ జెప్పునదియేమి సకలకర్మ,సాక్షి వై నీవు సర్వశాస్త్రములయందు
నధికరూఢత మెలఁగెద వయిన నేను,నబలఁ గద నాదువచనంబు లాలకింపు.
క. కలకంఠి ఖిన్నాదుసన్నిధిఁ, గలగానము సేయ వినఁగఁ గడునలరుచు న
క్కలహంసి వచ్చి తెలిపెఁ,జలజాక్షునిమహిమ మీకుఁ జతురత మేలౌ.
క. తెలుపుచు నంతట నిలువక,జలజాక్షుఁడు నీకుబిడ్డసహచరుఁ డగుచుఁ
మెలఁగఁగలవాఁడు సుమ్మీ, పలు కిది నిజమంచు నాఁడు పలికి చనెఁగదా!
క. అది విన్నది మొదలుగ న,మ్మది రేక్షణ హృదయవారి మాధవగజముం
బదిలముగ రాగశృంఖలఁ, గుదియఁగ బంధించె నధికగోప్యముగాఁగన్.
క. వనితకు నది కారణముగఁ, దనువున నంతంత కతనుధర్మము పర్వెన్
విను మనలకీల యార్ద్రొం, ధనమునఁ బలె సకలసుజనధర్మనిధానా! ౧౬౧
గీ. ప్రకృతి ననుసరించి పరఁగును జగతిలో, వికృతి యిద్ది వింత వెలఁదియందుఁ
బ్రకృతి నడఁచి వికృతి ప్రబలమై కనుపట్టె, నఖలగుణసనాథ యబ్జనాథ.

ఉ. ఇంతికిఁ బుట్టునివ్వికృతి యేమి యొకో యని కొన్నినాళ్లు లే
మెంతయు సంశయం బెద వహింపఁగ నుంటిమి రాఁగ రాఁగ నే
కాంతము మాని బైలుఁబుకునట్టివచోరచనం దనూలతై
కాంతసతాంతతాదివికృతాకృతి నందియ మేగె మాకొగిన్. ౧౬౩

గీ. అరయఁడనినిన్నుఁగోపించియతివప్రాతి,భట్యముభరించెనేమొ తాఁబద్మమిత్ర
తన్వవస్థలు నీవు ద్వాదశతఁ బూనఁ, ద్వాదశాతన్వవస్థలు తరుణిపూనె.

ఉ. తల్లిన పోలుఁ గూఁతు రను ధార్మికవాక్యము పొల్లువోయె నేఁ
డలినిఁబోలఁ జాయవలెఁ దద్దయు శైత్యముఁ *జెందకుందునే
తెల్లముగాఁగఁ దండ్రియగుతీవ్రమయూఖునిఁ బోలి కాఁక మే
న్నెల్ల మునుంగ మంటి నని యుందునిభానన పుల్కు నుల్కుచున్. ౧౬౪

సీ. తలిరాకుఁబోఁడియాటలమీఁదియనురక్తి వంధ్యాసుతక్రీడవాసిఁ దెగడుఁ
గలికి పాటలమీఁది ఘనతరామోదంబు మృగతృష్ణికావారిసొగసుఁ బూను
నతివభూషణధారణాభిలాషస్ఫూర్తి శశవిషాణముతోడ సరసమాడు
నెలవాఁగసరసాన్నగిళనవాంఛోదయం బంబరసుమము నొయ్యారమెనయుఁ
బణఁతిచీనాంబరలతాంతభరణకాంక్ష, యపదవాక్యార్థవైఖరి నపహసించు
బాలికామణితనుధృతిలాలసంబు, నప్రణవవేదపాఠంబు ననుసరించు.

గీ. కాఁక యుడిగినపుడు కలదు సత్త్వగుణంబు, మీఁకుఁ గాన నింతిమిమ్ముమించుఁ
గాఁక మేన మిగులఁ గడుసత్త్వగుణముల, నెనిమిదింటిఁ బూను నెపుడువింటె.

క. ఇంతి యరోగమహాగద, శాంతికి నస్మత్కృతోపచారములు దివా
కాంత చ్యుతమయ్యె నచ్యుత, కాంతోపస్మృతిన్ ఘటించి కరుణింపఁగదే.

ఉ. మన్నొకనాఁడు నీతనుజమోహము దెల్పఁగ వచ్చి సందడిం
గన్నకతంబునం దెలుపఁ గార్యము గాదని పోయి తప్పు డీ
మెన్నవ నయ్యరోగరుజ యింతకుఁ దెచ్చు టెఱుంగనైతి నా
విన్నప మాలకింపు మిఁక వేదన కోర్వదు కూఁతుఁ బ్రోవవే. ౧౬౯

ఉ. ఈగతి నీలవేణి తనయింపులకూఁతు నరోగయాతనా
రోగము విన్నవింపఁగ ననూనకృపాకలితాశ్రువాఃపృష
ద్యోగము గాఁగ దీప్రపుమయూఖసహస్రము చిట్చిటన్వనా
భోగముగా నొకింత వడిఁ బొందిక దప్పక తత్క్షణంబునన్. ౧౭౦

*జెందకుందునే—మూ

ఛా
గీ. ఛాయమాయఁగఁదనమేనిచాయవోలె, జాయసనుదేరఁదరుజాతచాయఁద్రొ
త్తేయుచాయలమనసుతో వేగనమువఁ, జాయపెన్మిటివచ్చెఁ దత్సదనమునకు.

ఉ. వచ్చి యసంస్కృతాంగి యయి వాడుచు జీవితనైరపేక్ష్యమే
హెచ్చు చనుక్తవాచ్య యయి యీహితయోగము దప్పి కాంతిలే
మచ్చుపడంగ నష్టగతి నందనివర్ణము గాంచి పైపయిన్
విచ్చుక క్రమ్ము కష్టత నవేత్తృకృతిన్ హసియించు పైదలిన్. ౧౭౨

సీ. శుక్తికానిర్గతముక్తాఫలంబులకరణిఁ గన్నుల బాష్పకణము లొలుక
రాహునిర్ముక్తపూర్ణనిశాకరునిమాడ్కి ముద్దులనెమ్మోము మురువువదల
వనవహ్నిశిఖలచే బలెవేఁడినిట్టూర్పుగాడ్పుల దిశలెల్లఁ గాంతివిడువఁ
దాపాబ్ధిశైవాలరూప మై కనుజడి జడగట్టి పెన్నెఱుల్ చాయ దఱుఁగఁ
గాఁకచేఁజూర్ణమైఁ పూఁతగంధము నకుఁ, దోడుపడియశ్రువారులుదోఁగిమిగులఁ
బంకమగుపొన్పునెలవునఁబడుచులేచు, పస్పురుసురంచు*వలవంతనున్నదాని.

చ. తనుభవఁ గాంచి మేను మది తద్దయు†జల్లన వేకరంబులం
దనువు మనంబుతో మిగులఁ దాపము చెందఁగఁ గౌఁగిలించి చ
క్కనితొడమీఁద నిల్పి జడకట్టిన పెన్నెఱి చిక్కుదీర్పఁగా
నొన రొకయింతలేక యవి యొక్కెడఁ జేర్చి ముడి న్రచింపుచున్. ౧౭౪

గీ. చెక్కునొక్కుచుముద్దాడిశిరముఘ్రాణ,విషయముగఁ జేసి నెమ్మేను వేకరములు
వెక్కసపుటమ్మమనసుతోఁజిక్కపడఁగఁ, బలికెమధురంబుగాలోకబాంధవుండు.

క. తల్లీ వరనారీమ, త్తల్లీ నీతల్లి మనసు తల్లడపడ నా
యుల్లము జల్లన నీకీ, పల్లట మేలమ్మ మేలుబంగరుబొమ్మా. ౧౭౬

గీ. పడఁతిమత్పూర్వపటుతపఃఫలమ వగుచు, ఖ్యాతి మీఱంగఁదనుజాత వైతివీవు
నీకతంబునఁ గద నాకు నిఖిలలోక, వల్లభుం డైన శ్రీకృష్ణుఁ డల్లుఁ డమరు.

క. అస్తంగతిరహితాధిక, శస్త్రాభ్యుదయంబు నాకు సమకూరు ‡నిఁకన్
నిస్తులసుగుణాంగన యర్కి,హస్తుఁడు లోకైకకర్త యల్లుం డగుటన్. ౧౭౮

ఉ. శీలగుణాభిరూప్యనవిశేష్యకళాచతురత్వవైఖరీ
శాలిత గల్గు నీకు హరిసంగతి గల్గ సమాఖ్య భూషణం
బేల మెలంగకుండు సుజనేరితవాక్కుల నాకుఁ గల్గదే
మేలసమాఖ్య వోవఁగ నమేలసమాఖ్య వరింప రాఁ గనన్. ౧౭౯

* బలువంత † జల్లగ. ‡ నిసుక్ నిస్తులసుగుణాంగనపరి–యూ. నిసుక్...సుగుణాంగనిర్యర్కి
హస్తు–అనియుఁ బఠింపవచ్చును.

క. ఆనాయకమణి వక్షో, ధీనముగాఁ జేయఁదివిరితివి నేను దధా
*నూనాకల్ప మొనరుతుఁగా, మానిని యిక్కార్య మమరు మది సంశయమా.
క. అమ్మా పురుషమణికిఁ గా బలు,నెమ్మున నిలుపంగ నీకు రుచి గల్గినఁ జొ
క్కమ్మది కుదురఁగ నొకసూ,త్ర మ్మతిసూక్ష్మమ్ము గలదు దానిం గొనుమా.
వ. అది యెయ్యది యంటేని. ౧౮౨
చ. దనుజవిభేది లోఁగొనఁగ దానతపోముఖయోగముఖ్యసా
ధనములు పెక్కు గల్గు నని తద్దయు వేదము పల్కు వానిలోఁ
బనుపడుసాధనంబు దృఢభక్తియ దానిన పూని నీవు న
వ్వనజదళాక్షు ధ్యానమున వశ్యు నవశ్యముఁ జేయఁగాఁ దగుఁ. ౧౮౩
సీ. అనుపమానేచనకాంగకంబులవానిఁ దరుణాభ్రసన్నిభతనువువాని
శ్రీవత్సకౌస్తుభశ్రీవిలాసమువాని బాహాచతుష్టయపటిమవానిఁ
దమ్మియింటినెలంత దనరువక్షమువానిఁ బంచాయుధోదీర్ణబలమువాని
మేలిమిబంగారు మెఱపుచేలమువాని భవ్యశేషాహితల్పంబువాని
దివ్యనవరత్నకీలితదివ్యదగ్ర్య, హారకుండలమకుటకేయూరముఖ్య
భూషణోదారరోచులఁ బొలుచువాని, వెన్నుని భజించిసుఖియింపు కన్నతల్లి
గీ. ఇంతి కతిపయదినముల కీసమాధి, నీసమాధిని హరియించు నిజముగాఁగ
మెచ్చి యాఖేటమిషమున వచ్చి నిన్ను, నలకపటయాదవుం డైనహరి వరించు.
శా. సారోదారపనీనివాస మఖలస్వర్భామినీవారసం
చారస్ఫీతము నంవసజ్జనమనశ్చాంచల్యమాలిన్యసం
హారైకప్రవణంబు యామునతటం బచ్చోట నున్నిస్మిత
స్ఫారాగారమునందు నెచ్చెలులతో స్వామి న్భజింపందగుఁ. ౧౮౬
గీ. వనిత కాళిందితీరమె వర్ణ్యమగుచుఁ, దగు నుదాత్తవిభూషణోదారశక్తి
నచట నీ వున్న మఱియు మే లమగుఁగాదె, యెల్లయొప్పులకుప్పవు తల్లి నీవు.
గీ. చెలువ కాళిందిమహిమంబు చెప్పఁదరమె, తద్వినీలపయఃస్మృతి తనువుసోఁక
మతికి నీలిమ రక్తిను మాని మిగులఁ, దెలుపు కనుపట్టుఁ జిత్రమో కలువకంటి.
క. శ్రుతిగదితమహిమ సర్వ,శ్రుతిభూషణసుగుణ యమున సుమ్మీ తద్వి
శ్రుతి పాపహరము గాదే, శ్రుతియుగళనిరుద్ధనయనసుందరవదనా. ౧౮౯
క. హరి†శైశవనవవిస్మయ, కరలీలాజన్మభూమి కాళిందితటం
బరుదా యది ‡భావికయు, గ్వరకవివాక్పూలకు మిగులవర్ణ్యము గాఁగఁ.

* నూనసంకల్ప మొనరితి †శైశవ ‡భావిక-మూ.

ఉ. అమ్మరో కన్నవారి నెడయుం బనివచ్చె నటంచు మానసం
బుమ్మలికం బడంగఁ గడు నొవ్వమిగాఁగఁ దలంపవమ్మ నీ
వెమ్మదిఁ బాయఁ జాయ కొక నేరుపు సిక్కునటమ్మ నాదుపా
దమ్ములు నిల్వ నేరవు గదమ్మ భవద్గృహ మొందకుండినన్. ౯౧

ఉ. చుక్కలదారిమానికము సొంపులకూఁతురి నిట్లు తేనియల్
చొక్కి పడంగఁ జేయు మృదుసూక్తులు పల్కుచుఁ దత్సమాధిఁ దా
నిక్కముగా నెఱింగి గృహనిర్మితి సేయుఁగ దేవవర్ధకిన్
గ్రక్కునఁ బన్పఁగా నతఁ డఖండనిజాద్భుతకృత్యచాతురిన్. ౯౨

సీ. రమణీయనాయకరత్నబంధురంబు నవవిధవస్తువైభవయుతంబు
శ్రీకరాంకాంచత్పతాకాభిరామంబు నురుసుంగశార్ఙ్గపదోజ్జ్వలంబు
దివ్యత్రప్రపంచసంధిప్రాంశులసితంబు నీహారమృగాభిదావగాహితంబు
గగనావలంబివాక్యస్ఫూర్తిమహితంబు మధురవాక్కవిజాలమానితంబు
చిత్రసదలంక్రియాగణోజ్జీవితంబు, నద్భుతరసాఢ్యపాత్రంబు నాత్తదోష
పాటనంబునునగుచొప్పినాటకంబు, క్రియఁ బ్రకాశించునొకదివ్యగృహ మొనర్చె.
గీ. అట్టులగ్గేహ మొనరించియమరతక్షుఁ, డంబుజాప్తునకెఱిఁగింపనలరి యతఁడు
సమ్ముఖంబునఁజాయతో జాయమొనరఁ, గూఁతురావించిపలికె సాకూతుఁడగుచు

క. రమ్మా శంబరరిపుమా, యమ్మా యగ్గేహమునకు ననుఁగుఁజెలులతోఁ
బొమ్మా తపంబు గొను మభ, యమ్మాహరి నీకొసంగు నమ్మాయమ్మా.

ఉ. ఘోరతపంబుచే నధికకోమలవల్లి* యనుంగుఁజుట్టమా
నీరుచిరాంగయష్టిఁ గడు నేచ మనంబు దయావిహీనమై
మీఱఁగఁ జూచుచుండెదు సుమీ హరియాన సుమీ నెలంత చె
న్నారఁగఁ గన్నవారిపయి నానసుమీ పరికించి చూడుమీ. ౯౩

క. † మన మొప్పినఁ దను వొప్పదు, తను వొప్పిన నిట్టికష్టదశ నేనొప్పన్
విను మే నొప్పిన నొప్పదు, జననీ నీజనని ప్రేమసంరంభమునన్. ౯౪

క. దెప్పరపుఁగార్య మూనిన, నప్పగు కాళిందిమేన నగ్గలమగుఁ గా
కప్పుకొను టంతరంగము, దప్పని యావిలతతోడఁ దరళమృగాక్షీ. ౯౫

గీ. అమలినం బైనమానసం బబ్బెనేని, రాజయోగంబె సర్వకార్యములు దీర్పుఁ
జిత్తసంశుద్ధి లేకున్నఁ జెలువ బాహ్య, బహువిధాయాసచేష్టల ఫలము లేదు.

* అనంగుజటము. † మనవొప్పినతమూ.

ఉ. కావున రాజమోగినివి కమ్ము మదంబ కఠోరకృత్యముల్
భావములోఁ దలంపకుము భాస్వదసంగసదంబుమార్గనో
ద్భావముచే మనోంబుజ ముదస్తరజోమల మై యెసంగ నం
దావనజాతు నాత్మవిభు నంచితభృంగముగా రచింపవే. ౨౦౦

క. నాలుగుపురుషార్థములం, జాల ఘటింపించునట్టి సాధనములలో
మే లేర్చిరి ధ్యానం బని, నీలాలకి సర్వశాస్త్రనిశ్చయకర్తల్. ౨౦౧

సీ. బహుసంభవార్జితబహుపాతకవ్రాతవిపినమహావహ్ని విష్ణుభక్తి
మానసరాగాదిమాలిన్యపరిహారవిమలాంబుపూరంబు విష్ణుభక్తి
తాపత్రయోదారదావవైశ్వానరవిపులధారావృష్టి విష్ణుభక్తి
చతురర్థనిష్పాదనసంపాదనక్రియావిదితాంజనంబు శ్రీవిష్ణుభక్తి
సకలసత్కర్మసాద్గుణ్యసంపదలకు, వేల్పుమొదవులమేల్బంతి విష్ణుభక్తి
సద్గురుకటాక్షసముపాత్తసాధుబోధ, విద్యలకు నెల్ల ఫలము శ్రీవిష్ణుభక్తి.

చ. అరయ నభేద మన్నపలు కానెను పెద్దలకేని జీవనం
బురుజపహోమయజ్ఞదృఢయోగముఖాఖిలసాధనక్రియో
త్కరసఫలత్వకారణ మఖండపదార్థనిరీక్షణక్షణా
పరనిరపేక్షసాధనము పంజకలోచనభక్తి నందనీ. ౨౦౩

క. అటుగాన భక్తిపూర్వక, పటుతరతద్ధ్యానయోగపాటవ మెసఁగన్
ఘటియిల్లుఁ గామితము వడి,నటమట మని యెన్నఁబోకు మరయునిజముగన్

గీ. అరసి ప్రాగాదిదిగ్వ్యవహారబీజ, మయిన జేఁ డిట్లు తనకూఁతు నమరఁ బలికి
కూఁతునెడఁ బ్రాయువగలడగ్గుతికవడఁగ,నని యెదడఁబాటుదోఁపనెయ్యపుఁజెలు

చ. పదమున నర్థమున్ బలెను బాయకయుండెదు బాల గోల యి [లకు.
మ్ముదిత తపంబు సేయుపని మోయుట మ మ్మెడఁబాయు మీకు మా
కొదవెడు ప్రేమ దీనిపయి నొప్పెడుఁ గావున నప్పగించెదం
బిడ్డప నెలంతలార వలపించిన పెన్మిటి కప్పగించెదన్. ౨౦౪

ఉ. అంతట ఖేదమోదజనితాశ్రులు కోష్ణము లాచు నేత్రసం
క్రాంతము లైన మంగళము గా దని క్రుక్కుచు స్రుక్కుచు న్రమా
కాంతునిదక్షిణంపుబలుక న్నగువేలుపు బిడ్డహస్త మే
కాంతపుఁబ్రేమఁ గేల నిడు చాదృతిమై నను నీలవేణికిన్. ౨౦౫

ఉ. పెంచినదాన నీవు కదఁ బెక్కువమీఱఁగ శాస్త్ర మభ్యసిం
పించినదాన నీవు గద పెంపుగ నుత్తమశీలరీతి శి
క్షించినదాన నీవ కద చెప్పఁగ నేమిఁక నీదె భార మి
క్కాంచనదేహఁ గాచికొనఁ గాంచినవారికి భార మున్నదే. ౨౦౮

గీ. ఈమధురవాచ నెంతేని యింపుమీఱ, వాసిగాఁగ నలక్షణం జేసి తీవ
గానవైనుపి సఫలత గైకొనంగ, మేలుఫలమునఁ గూర్పవే నీలవేణి. ౨౦౯

గీ. నీలవేణితటం బఁట నెలవుకొనఁగ, నీలవేణి భరింపంగ నేర్పరి యఁట
నీలవేణి యిది తపంబు నెఱఁ గొనునఁట, యేల ఫలసిద్ధి గాకుండు జోలియేల.

వ. అని యనియమిత ప్రేమానుబంధ బంధురుండై లోకబాంధవుండు సర్వ
సఖీసమేత యగు నీలవేణీపద్మేందుముఖికి నప్పగించి ఛాయామిళితుం డగు
తనకుం బ్రణమిల్లిన శ్రీవల్లభుం బ్రాణవల్లభుఁగాఁ గొను మని యుల్లంబు
పల్లవింప దీవించి గ్రుచ్చి యెత్తి గుత్తపుఁగాఁగిటం జేర్చి కార్యభారంబు
త్వరపఱుప నత్తరళాక్షిఁ దరలంబంచిన. ౨౧౧

క. మగువ దివినుండి భూమికి, దిగిరా నవ్వేళ మేనుదీఁగియ చూడన్
గగనతలఘూర్ణ్ణోపల, నిగనిగితస్వర్ణరేఖ నీటు వహించెన్. ౨౧౨

ఉ. వచ్చెను మచ్చెకంటి నెఱవాదిసఖీజను లంటిరాఁగ పై
యచ్చరవీథినుండి ధర కర్యమసూతి సరిత్పయోభరం
బిచ్చ నవాంబుదం బిది యహీనమహాసితరోచి యంచుఁ దా
మెచ్చుచు దాయవచ్చు జిగిమించు చొకాటపుమించుతైవడిన్. ౨౧౩

ఉ. వచ్చి గృహంబు సొచ్చి పితృవాక్యనివేదితకార్యసాధనా
కచ్చరమార్గరీతిఁ గొని కాంత రమాధిపుఁ గొల్చుచుండెఁ దా
నొచ్చెము లేనిభక్తి విమలోజ్జ్వలమానసపద్మసీమయం
దిచ్చ బహిఃపదార్థముల నెంతయు రోయ నజస్రభావనన్. ౨౧౪

క. అకలంకయోగిమానస, సుకరామితదివ్యరూప శోభితనిక్షే
తుకదయమానకటాక్షా, నికటచరత్త్రుభధీశనిర్జరవారా. ౨౧౫

గద్యము-ఇది శ్రీరామచంద్రచరణారవిందమిళిందాంతఃకరణ పోలూరిమాధవ
యజ్వ సముజ్జ్వలత్కృపోన్మీలితకటాక్షాసాదితపాండిత్యాభరణ ప్రభంజనవం
శాబ్ధిరాకాశశాంక నిరంతరారాధితవిచక్షణశశాంక అభినవనన్నయభట్టార
కాపరాభిధానబలపత్త్యాప్యాయకవిమహోపాధ్యాయభట్టారకప్రణీతం బైనకాళిం
దీకన్యాపరిణయంబను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

ప్రథమభాగము సమాప్తము.

ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశితము—సంఖ్య—

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

—। ద్వితీయభాగము ।—




అహోబలపతిపండితప్రణీతము.

(పరిషత్పత్త్రికనుండి పునర్ముద్రితము)

---

కాకినాడ:
కాకినాడముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి
ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమునఁ
బ్రకటింపఁబడినది.

1929.

వెల రు 0-8-0

# కాళిందీకన్యాపరిణయము.

## ద్వితీయభాగపీఠిక.

---

ఈమహాప్రబంధమునకుఁ గర్త యగునహోబలపతి జన్మదేశాదు లగు సామాన్యవిషయములం గూర్చి ప్రథమభాగపీఠికలో ముచ్చటించితిని. ఇంక నిప్పు డిందుఁ గలవిశేషముల్లను వివరించెదను ఈభాగమున ౪-౫-౬ ఆశ్వాసములు గలవు. అందు నాల్గవయాశ్వాసమున నాముక్తమాల్యదాది కాంధ్రప్రబంధరత్నములందువలెను గిరాతార్జునీయాది సంస్కృతకావ్యములందువలెను ఋతువర్ణనము మంచిమంచి కల్పనలతోను గొప్పగొప్ప భావములతోను జేయంబడినది. చూడుఁడు:—

### — ♦ వసంతవర్ణనము ♦ —

సీ. నిఖిలాగమాంతనిర్ణిద్రశోభ నొసంగు నిరుపమమహిమచే నెసఁగువాఁడు
శుకముఖద్విజరాజచూపుల కింపైనఫలములు చేకూర్పఁగలుగువాఁడు
బలుజడిచేనైనయలజడి సహియించుమహానుల మధురోక్తి మనుచువాఁడు
తెలిపువ్వునీటిచే దేహయాత్రఘటించు మాధుకరశ్రేణి మనుచువాఁడు
సాధుసుమనోనిరంతరసౌష్ఠవైక, మూలకారణ మైనట్టి మేలువాఁడు
మాధవుఁడువచ్చినవ్వేళ మధురలీల, వనరమాంగన యామోదమున వెలంగ.
సీ. పంజరగృహాలలోపల నున్కి గైకొని శర్కర మెక్కెడు జంతువితతి
నతివృష్టి కోరిచి యశనంబుగానక గాసిల్లు పూఁసంఘాతములను
సరసులలో నుండి జలవాసవృత్తిచే నర్తిల్లు విరహంసవారములను
నలరునీ రక్కడ నక్కడఁ ద్రావుచు వసియించుచేతనవ్రాతములను
సత్పరిగ్రహాలాభంబు సంభవిల్ల, నురుతరామోద మందెడు యోగితతుల
మన్ననగొనర్చెఁ దావచ్చిమాధవుండు, కామితార్థంబులవ్వారిగాఁగనిచ్చి.

ఇందలి శ్లేషవిశేష మెంతచక్కనిదో!

### — ♦ గ్రీష్మర్తువర్ణనము ♦ —

గీ. కూటిపేదటికంబు గైకొనిరి మిగుల, నాతరముచేత బ్రతికెడునట్టివారు
ఖనన మొనరించితనుయాత్రగడపువారు, కూలిగలుగుటనవ్వేళ గూఁటఁబడిరి.

క. కూటిరుచి పాన మొందెను, బాటిల్లెను నీళ్ల సుళ్లు పవనంబునకున్
మేటి సురతములకూరిమి, గాటపుటుపగూహనములఁ గదలక నిలిచెన్. 32

ఈరెంటియందును స్వభావోక్తి చక్కఁగ వర్ణింపఁబడినది.

క. పడమటిసెక నుడుకఁగఁబసి, పిడికిటివస్త్రంబు లెల్ల బెట్టాఱంగాఁ
గుడికరమునందు నిలిపిరి, కడుఁబూతం బనుచు వానిఁ గర్మారంభుల్. ౩౩

ఇం దాచారసంప్రదాయము కలదు.

—♦ వర్షర్తువర్ణనము ♦—

సీ. ఆహితాగ్నుల కెల్ల నాత్మవైశ్వానర రక్షయే కార్యసర్వస్వ మయ్యె
భోగికైనను రాత్రిభోజనం బెచ్చట నన్నమాత్రము కాని యబ్బదయ్యె
సౌరమంత్రోపాస్తి చతురుల కశనంబు వార్త గల్గుట గాని వావి యయ్యెఁ
బ్రతిగృహంబున కేగి ప్రార్థింపఁ (బ్రార్థింప) శిఖి యొకింతొసఁగినఁ జిత్రమయ్యె
జంబుగూడలకలుములు డంబుమిగిలెఁ, గతకసంపాదనంబులు ఘనతఁగాంచె
నన్నదాతకు నేనియు నతిథి కొకసిక్థమైన నన్నంబు గల దను టరిదియయ్యె.

ఇది యాముక్తమాల్యదయందు—

“ఇల్లిల్లుఁ దిరుగ నొక్కఁడొబ్బు శిఖి; యుష్ణమే నేసింటిలోఁ బూని యిడి విసరక
రాఁజదు; రాఁజిన రవులుకొల్యాతాలఁ గాని కల్గదు; ముట్టి దానఁగలిగె
నేని కూడ దగుట మండినఁబెన్పొగ సుఖభుక్తి సేకూర; దాభుక్తి కిడినఁ
బ్రాణోత్క్రాంతులకే తీఱు బహుజనాన్నము; దీఱ నారులలో దవ్వుఁ బునఃప్రయత్న
మాజ్యపటముఖ్యులయ మొన్న; రాలయాంగ
దాయులయ మొన్న రంతిక: కాంజనిక
పచనగాంధో గృహిణి రామిఁ బడక మరఁదు
వెడనెడవె యార్ప నొగిలి రజ్జడిని గృహులు.

ఉ. కాలువ లెల్ల బల్నదులకై వడిఁ గాంచె నదీలలామముల్
గేలిమొనర్పఁగాఁ గడఁగెఁ గేవల మబ్ధి నతండు నీరమా
త్రాలయుఁడైనఁ దావికృతినందక యుండు వికారహేతువుల్
చాల మెలంగినన్ వికృతిసంగతిఁ గాంచని ధీరచిత్తముల్. ౦

ఇందలి యర్థాంతరన్యాసము మహాకవి కాళిదాసుని కుమారసంభవములోని
“వికారహేతౌ సతి విక్రియన్తే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః” అను
శ్లోకమునుండి గ్రహింపఁబడినది.

కవు లిట్టి మనోహరము లగుకల్పనలను భావములను బద్యభాగాదు లను దత్తద్భావతత్పరులై యనుకరించుచుందురు. దానిని నసమర్థతచేఁ జేసిన గ్రంథచౌర్య మనరాదు.

—♦ శరదృతువర్ణనము ♦—

క. జీవన మంతయు లోకో,జ్జీవనమున కిడుటఁ గార్యసిద్ధి వడసి మైఁ
కేవలపలితంబుగఁ దాఁ,బోవదె ఘనపాళి యుత్తపుంగవు దిశకున్. ౯౪

ఇందు భారతీయులకుఁ బరమపురుషార్థసాధన మగు మహాప్రస్థానము సూచితము.

—♦ హేమంతర్తువర్ణనము ♦—

ఉ. తమ్ములదాయ మేర్పడఁగఁ జాలక తమ్ములనేఁచ మంచుచి
చ్చ్మ్మరియాద విడిచి నడిఁజొన్పఁగఁ దమ్ములతోడ నాత్మస
ఖ్యమ్ము ధరించు కల్వలను గాఱుమఁజెంచెను మిత్రివర్గము
తమ్ము నెఱుంగఁ డయ్యె నుచితస్థితిఁ గాంచ జడుండు నేర్పునే. ౧౧౮

ఇందలి యర్థాంతరన్యాసము సర్వకాలములందును సర్వజనులకు ననుభవసిద్ధమైనది.

—♦ శిశిరర్తువర్ణనము ♦—

ఉ శీతముచేత బాధపడు చిత్రి జగంబు భజింపఁగా జగ
త్ప్రాంతిత దినేశుఁ డీశ్వరతఁ దాల్చుచు నంబరమధ్యసీమఁ దాఁ
జాతురినేగుచు న్నిటలచంచనచంచలదృష్టి కించిదు
న్మీలితము చేసెఁ గానలయు నెమ్మిఘటిల్ల హరించుశీతమున్. ౧౧౯

ఇందలిస్వభావ మెంతబాగుగనున్నదో! మఱియు నీభావము, "బ్రహ్మస్వరూప ముదయే, మధ్యాహ్నేతు మహేశ్వరమ్, సాయంకాలే సదా విష్ణుః త్రిమూర్తిర్హి దివాకరః" అను శ్లోకభావమూలకము.

క. అప్పప్ప యేర్కినను, జెప్పంగాశక్యమైన శీతము మహిమల్
నిప్పుల కప్పులకుం దాఁ, దప్పక యన్యోన్యసదృశతను ఘటియించున్. ౧౨౦

చూచితిరా యతిశయోక్తి మహిమ!

(2) పంచమాశ్వాసమున- శ్రీకృష్ణుఁడు ధర్మరాజును జూడఁబోయి యర్జునునితోఁ గలిసి యమునానదీతీరమునకు వేట కేగి యటఁ దనకై తపము చేయుచున్న కాళిందిం జూచి యామెను దనపురమునకుఁ దీసికొనిపోయి వివా

హము చేసికొనియె నను కథ సహృదయ హృదయాహ్లాదకములైన రసగంభీరకల్పనావిశేషముగల నూటయిరువది గద్యపద్యములతోఁ జక్కఁగ వర్ణింపఁబడినది. చిత్తగింపుఁడు.

ఇంద్రప్రస్థవర్ణనాసందర్భమున నీవిద్వత్కవి తనకుఁ బరిపూర్ణప్రజ్ఞగల యష్టభాషావిశేషము నెట్లు చూపెనో.

సీ. సర్వభాషావచస్సంపన్నిధానంబు సాధ్యసిద్ధవచోపపూరితంబు
శౌరసేనాధారశారుచిమంతంబు వ్యత్యయకారోపపత్యనుగత
మనుసృతభవిశలాపాయోగసిద్ధంబు రేఫోపహతదృష్టోల్లేఖితంబు
అన్యథాభావప్రహాణనిరూపంబు సప్తాంగరూపప్రశస్తమహిమ
మైవిరాజిల్లు చష్టభాషావిశేష, సముదయస్ఫూర్తి హసియింపఁ జాలునట్టి
పురవరంబు హరిప్రస్థపుణ్యనామ, మచ్యుతానందముగఁ గాంచె నచ్యుతుండు.

ధర్మజునిభక్తిగౌరవము లెట్లు చిత్రించెనో చూడుఁడు-

గీ. జలజనయన యిహాముత్రఫలవితాన, మూలకారణ మని మదిఁ జాల నమ్మి
నీమపటభక్తి చేకొని నిలిచినాఁడ, నితరము నెఱుంగఁగద యిట నీనెసాక్షి.

గీ. తిమము హరియించి వస్తుతత్వంబుఁ దెలుప, నీవ కాక న్యదేవత నేర్పుగనదు
దురితసంహారజగతి ఖద్యోతుమహిమ, యొవరు నేరిరిఁ దలఁపఖద్యోతమునకు.

ఈవిద్వత్కవి తన శాస్త్రీయజ్ఞానమును 17 వ పద్యమునఁ గాళిందీతీరారామమును మీమాంసా తర్కవ్యాకరణ చ్ఛందో లంకార భరతశాస్త్రములలోను బ్రాకృతత్రిలింగభాషలలోను నుత్తమకావ్యంబులోను శ్లేషించి పోల్చి చూపెను. శ్రీకృష్ణుని వివాహసందర్భమును 73వ పద్యములో నాదబ్రహ్మమును నిరూపించెను.

"మంచిభోజనము" అను 140 పద్యమున హాస్యరసలనము.

"పగలుగావించు" నను 155 పద్యములో నప్పగింతలలోఁ బిల్లలు పెద్దలం దున్నగుణమే గ్రహియింపవలయును గాని పెద్దలందు దోష మున్నను గ్రహింపరా దనునీతి చక్కఁగా బోధింపఁబడినది.

(3) ఇఁక షష్ఠాశ్వాసము.

ఇందుఁ గాళిందీకృష్ణుల సరససల్లాపములు వర్ణింపఁబడినవి. కాని నాగరకులకు వెగటుగల్గించు మోటువర్ణనము లెందును లేవు. ఇంతియే కాదు కేవలశృంగారప్రధానము లగుపట్టులందుఁ గూడ నీవిద్వత్కవి యావిషయమును

దనశ్లేషమహిమచేఁ గావ్యములతోను శాస్త్రములతోను నాగమములతోను సంస్కృతప్రాకృతాంధ్రభాషలతోను మూలప్రకృతి (అవిద్య)తోను బరబ్రహ్మముతోను బోల్చి చదువరుల హృదయములం దనాదిపరమసిద్ధాంతముల నాటును. వీనికిఁ బూర్వభాగమునందుఁగూడఁ జాల నుదాహరణములు గలవు.

41 వ "కామితమేమియున్" అనుపద్యములో "సర్వత్ర జయ మన్విచ్ఛే త్పుత్రా దిచ్ఛేత్పరాజయమ్" మ్మనుదానిభావము గలదు.

"హృదయగంధి" యను 42 వ పద్యములో "భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యన్తేసర్వసంశయాః, తస్మిన్దృష్టే పరావరే" అను నుపనిషత్సారము నిమిడించెను

"నేరుపుమీఱ" అను 49 వ పద్యములో శృంగారరసము నలు వను సంప్రదాయము తెలియఁజేయఁబడినది.

56 క్రొమ్ముడి యుత్తమనిబంధము (కావ్యము)

60 కబరి యుత్తమకావ్యముం బోలును.

గీ. ద్విస్వరసహితంపుటాకృతిఁ దేజరిల్లి, ప్రాకృతాఖ్యాకభాషనాభావితన్వి
రేఖ నెఖరిగలిగిత్రిలింగదేశ, సుకవిమనసొప్పఁగస్తూరిచుక్కబొట్టు. 67

ఇందుఁ గస్తురి చుక్కబొట్టు ప్రాకృతత్రిలింగభాషలవలె నున్నది.

70 చన్నులచందునుఁజూచిన నీలాపనిందవచ్చెను.

86 కార్యసాధనవిధానము మంచి దను నీతి బోధింపఁబడినది.

90 "వనిత యరగన్ను" అనుదానిలోఁ దపము (నిరంతరదీక్ష) బలిమిని గార్యసిద్ధిని గలిగించు నను నుత్తమసిద్ధాంతము.

97 "వాగ్భూషణంభూషణం" అనుదాని యభిప్రాయము.

113 లజ్జ నవిద్యతోఁ బోల్చి గురూపదేశమున నవిద్య నశించు నను మహాభావము స్ఫురింపఁజేసెను.

124 "సాంజనాతి"—ఇందుశబ్దచిత్రమయిన యమకము.

138 "బ్రహ్మ మనన్నొప్పు"—అద్వైతసిద్ధాంతము. చూచితిరా నేస్తను హేమ! అతిశృంగారములోనుండి మహావేదాంతమునకుఁ గొనిపోయినది.

145 "గళితబింబోష్ఠి"—ఇందుఁ గల్పనావిశేషము.

151 "మృదుపదమై"—282 "సుప్రసాదత"-ఇందు రసావహమైనచో దోషము గూడ గుణమగు నను కవిభావము తోఁచుచున్నది.

163, 236 గగనకుసుమము-అప్రసిద్ధ మని తార్కికుల సంప్రదాయము.

174 "పయోధరమండలము" అను శ్లేషరూపక మహిమచే వర్షాకాలము ప్రత్యక్ష మగుచున్నది.

176 త్రివేణీస్నానమున ననంత సౌఖ్యముకలుగు నను పౌరాణికభావము.

188 తపముచే నణిమాదిసిద్ధులు గలుగును.

191 ఆత్మస్వరూపమును బైలుపఱచువిధాన మతినిపుణముగా నిరూపింపఁబడెను.

197 గురుశుశ్రూష పరమసుఖంబు.

202 రూపకమహిమ మిందుఁ గలదు.

223 ఈపద్యమునందు (అహిభయము) స్వపక్షభయము గలరాజు రాజ్యము క్షీణించు నని చూపఁబడినది.

229 బ్రహ్మతత్త్వము.

230 భగవంతుఁడు సర్వద్రష్ట.

241 భగవంతుని దర్శనమైనపుడు సర్వహృదయగ్రంథులు వీడిపోవును.

270 ఈగద్యము ప్రథమాశ్వాసములోని "వెంసీయుజగజ్జన్మాది" అను పెద్దగద్యమువంటిది. ఒకవిశేషము—అందర్థాలంకారములే గలవు. ఇందుఁ గొన్ని శబ్దాలంకారములును గలవు. కుండలిబంధము, నాగపద్మబంధము, మాలికా బంధము నిట్లు "నానాలంకారలీలామాలాస్పదంబై తనరు."

మొత్తముమీఁద నీమహాప్రబంధమున శృంగారరసము ప్రధానము. మిగిలినవి యంగములుగా నక్కడక్కడ నౌచిత్యానుసారముగా నిరూపింపఁబడినవి. కదళీపాకము ప్రాయికము. అక్కడక్కడ నారికేళపాకము గూడఁ గలదు. శైలి లక్షణలక్షితము. గుణాలంకారము లత్యంతమనోహరములు. రీతివృత్తులు రసానుగుణంబులు. భావంబు లతిగంభీరంబులు. అనర్గళ మగుకవితాధార. దానికిం బదిరెట్లు వేదవేదాంత సంస్కృతప్రాకృతాంధ్ర వ్యాకరణ తర్కమీమాంసాలంకారాది సకలశాస్త్రసర్వతోముఖపాండిత్యమహిమ. దానికి నూఱురెట్లు శ్లేషచమత్కారము. విద్వత్కవి రచించిన యీమహాకావ్యమునందలి భావములు సుబోధము లగుటకు విపుల మగు వ్యాఖ్యాన మపేక్షణీయము. మన యాంధ్రసాహిత్యపరిషత్తువారు తగిన యత్న మొనరించి వ్యాఖ్యానము చేయించి ప్రకటింపఁ గడంగుదురు గాక! మూలమూలల నున్నయట్టి

మహాగ్రంథములను సంపాదించి ప్రకటించి కవులకీర్తులను చిరస్థాయులుగాఁ జేయుచున్న యీపరిషత్తువారికి జగత్కారణం బైన శివకేశవాది నామములచే భావింపఁబడు పరబ్రహ్మము దీర్ఘాయురారోగ్యైశ్వర్యజ్ఞానసరిసదభివృద్ధులను జగదుపకారకకృత్యనిరంతరదీక్షాదక్షతల నిచ్చుఁగాక !

గీ. చిలుకపలుకులు చెవులకుఁ జెలువుగొలుపు
నట్లు దక్షిణవాక్యము లాత్మతృప్తి
నందఁజేసెను శ్రీశు నారాయణాత్మ
ముదముగన లోకబుధులు ప్రమోదిరూప !

ప్రమోదదక్షిణాయనము,
పిఠాపురము,

శ్రీపాదపావయ్యశాస్త్రి.
శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థాన
పండితుఁడు.

# కాళిందీకన్యాపరిణయము

## ద్వితీయభాగము.

— విషయసూచిక — పుటలు.

శ్రీరస్తు

# కాళిందీకన్యాపరిణయము.

## ద్వితీయభాగము.

—చతుర్థాశ్వాసము—

క. శ్రీమద్భార్గవరామవి, రామశరస్తోమధామ రమ్యభుజబలో
ద్దామాభిరామ నుతసు, త్రామా సాకేతధామ దశరథరామా.

వ. మహాత్మా దివ్యచిత్తంబున నవధరింపుము

—వసంతఋతువర్ణనము—

క. అంతట విమలశ్రీరత, సంతతసుమనఃశదంబరంజీవనతం
బొంతై సురభికి మిక్కిలి, వింతై *యేతెంచె సురభి విరహులు †బెగడన్.

గీ. ఉదయరాగచ్ఛదంబు మైమూని కొనఁగఁ, దలఁచి వనలక్ష్మి జీర్ణచ్ఛదంబువిడిచె
మాధవుసిరాక కని వృక్షమండలంబు, దాల్పఁగనుబట్టుజీర్ణచ్ఛదంబు‡రాలె.

సీ. నిఖిలాగమశ్రాంతనిర్నిద్రశోభ నొసంగు నిరుపమమహిమచే §నెసఁగువాఁడు
శుకముఖద్విజరాజిచూడ్కుల కింపైనఫలములు చేకూర్పఁ గలుగువాఁడు
బలుజనిచే నైనయలజడి సహియించు ఘనుల మధుసోక్తి మనుచువాఁడు
తెలిపువ్వునీటిచే దేహయాత్ర ఘటించు మాధుకరశ్రేణి మంచువాఁడు
సాధుసుమనోవిరంతిర సౌష్ఠవైక, మూలకారణ మైనట్టి మేలువాఁడు
మాధవుఁడు వచ్చె నవ్వేళ మధురలీల, వనరమాంగన యామోదమున మెలంగ

సీ. తనను దక్షిణజగత్ప్రాణున కేవేళ నెనఁమాన్యగుణంబు సేయుకతన
నతిరక్తపల్లవప్రీతిని వర్ధిలఁజేయు నభ్యుదయంబుచే నడచుకతన
నఖిలనిస్సంగుల నాయాసపడఁజేయు నీలదేహుల కుక్షి నేర్పుకతన
సురుచిరాకృతి జాతిసుమనోవిలాసంబు కొదవకు నొడిగట్టుకొన్నకతన
నపరిహాదత కాటప ట్టైనకతన, నధికసాంద్రరజోవ్యాప్తి నందుకతనఁ
గలుగునయశోవితానంబుకరణిగనుము, నళులుచరియించునామనినాళిగోనుచు.

చ. అలుకలచే జగద్విజయ మందె మనుం డన యుక్తిభూషణం
గలుగును లక్ష్యమన్న నది గాదు జగజ్జయసాధనంబులై
మెలఁగెడు చాపబాణములు మేలుగ నిర్మితిఁ జేసి మాధవుం
డల మరు నంగహీను విజయాన్వితుఁ జేయు ననంగ లక్ష్యమా. ౭

*యేతెంచు-మూ. †పొగడన్-మూ. ‡రాలె? §నెగడువాఁడు-అనుటయుంచిది.

మ. ధరఁ బాదంబులు నాటి మాఁగ్రిప్పడుచు వంధ్యత్వంబు పోఁగోరి య
త్త్రమరాజు క్కఁడు మాధవుం గొలువఁగా దద్వంధ్యతోత్పాదన
స్ఫురణోద్యత్ప్రసవాభిరామఫలసంభూతుల్ ఘటింపించు త
త్కర(ర)దత్తాయణమంత్రితాక్షత లనం గానంగవయ్యో న్నసల్. ౮

క. ఫలగర్భిత గొను లతికా, కలకంఠ కుసుమగుచ్ఛఘనవక్షోజం
బుల మిగుల నొప్పు గైకొను, నలితోచితశ్యామచూచుకాంచితరోచుల్. ౯

గీ. పంబురసమునసుమనశ్కదంబకంబు, కాలగతి (?) దువుపకాంతలఁజాలఁగూడె
దత్సమాగమాతిమైనపాతకముకేతన, విరిసెఁగాఁబోలు ననసద్ధివిరియుచుండె ౧౦

స. అరయఁగఁ బుష్పవత్యభిధ నంటి రజోవతు లన్న పేరిచేఁ
బరఁగు తాలతాంగులయభంగురసంగతిఁ బొంగి సమ్మద
స్ఫురితనినాదము ల్గొనుట చోద్యమె మత్తమధువ్రతాళికిం
గర మురనైన యవ్విజినరాశిమ మేనున నంట నబ్రినే. ౧౧

క. గిఱకపడి కొనలు సాఁగక, మొఱులులతాంగనలఁ బెంచి మొప్పగఁ బుష్పం
బుఱఁ బువ్వుమొగ్గగుబ్బలు, నఱల ఫలం బెసఁగఁజేసె వలపుబయితు వోగిన్. ౧౨

క. మాధవవిభవముఁ దెల్పుచు, సాధుకవిప్రీతి యొసఁగు సర్వాగమముల్
మాధపవిభవముఁ దెల్పుచు, సాధుకవిప్రీతిదములు సర్వాగముముల్. ౧౩

క. మును వృష్టికి ఘనులొసఁగిన ఘనఋణ మొగిఁదీర్పఁ దమలుకమ్రసుమపుటం
బునఁ బొదఁగి ఋణముఁ దీర్చెను, గనదళిదంభంబుదాల్చి ఘనాళికన్ ౧౪

గీ. బంధురము లైనయులవనస్పతుల కెల్ల, సౌమనస్యంబు విఘటిల్ల భూమిజాత
భానమాకులపాకొందఁబరఁగ *దుర్గ్రంథంబు గావటనుధుపవ్రజంబుమిగిలె. ౧౫

చ. నరినవమాలికాకలితవాసన లూనుచు మాధవీమనో
హరుచి కాస్పదం బగుచు నాత్మసుహాగముఁడై కుజాతివి
స్ఫురణము మాన వర్తిలుచు భూరికవివ్రజమాననీయుఁడై
పరఁగెను మాధవుం డప్పుడు ధన్యఘనాకృతి మాధవాకృతిన్.

గీ. యోగుల భరించి యుగిచక్రియుక్తిమించి, భోగిసంసేవితాకృతిస్ఫూర్తిగాంచి
మాధవుఁడుమాధవుండగుఁసుదిఁదలంప, నలఘుపాంసులతాగుణంబమదుగాని౧౭

సీ. పంజరగుహాలలోపల నుస్కిఁ గైకొని శర్కర మెక్కెడుజంతువితతి
నతివృష్టి కోరిచి యుశనంబు గావక గాసిల్లు పూనిసంఘాతములను
సరసులలో నుండి జలవాసవృత్తిచే వర్తిల్లు వరహంసవారములను
నిలకునీ రక్కడనక్కడఁ దాఁప్రుచు వసియించు చేతనవ్రాతములను

*ధుర్గ్రంథంబనా—మూ.

సత్పరిగ్రహాలాభంబు సంభవిల్ల, నుకుతరామోద నుండెడు యోగితతుల
మన్ననరయొనర్చెఁ దావచ్చి మాధవుండు, కామితార్థంబులవ్వారికాఁగనిచ్చి ౧౮

గీ. దీర్ఘవిశ్రుతశబ్దవృత్తిప్రకాశ, మాశ్రితాంచితమాధుర్య మధిగతప్ర
సాదమైయొప్పెనపుడువసంతఋతువు, మహితకావ్యప్రకాశకృన్మతమువోలె ౧౯

క. పల్లవపేశలశయ్యా, వేల్లద్రీతులకుఁ దనిసి విమలధ్వానులం
బెల్లనయుచుఁ బుంస్కోకిల, తల్లజులు వసంతవేళఁదనరిరి మిగులన్. ౨౦

చ. తెలిపుపునీటివర్షము లుదీర్ణములై నెనరంగ నత్తఱిన్
మలయుఁగఁజొచ్చెఁ బుష్పడిమమారము తెల్లెడల న్నిరంతరా
కలననహించి దట్టమయి కానఁగనయ్యెరు యోగదూరతం
గలఁగెను దంపతిప్రతతి గాంచుమహోష్మపుటూర్పుగాడ్పులున్. ౨౧

సీ. ఉవిదపుక్కిట సుర యుమిసిన నొక్కఁడుతరువు పాదాబ్జఘాతమున నొకటి
చెట్టు, వేఱొక్కటి తిట్టుచు డాసిన హామోదసంపద నందినెలయు
ముద్దుల నగవుల మురిపెంపుఁబాటలఁ గౌఁగిలింతలఁ బ్రేమఁ గనుఁగొనుటల
నడుగుట న్నూర్పుట హస్తసంస్పర్శలఁ గొన్నిమహీజముల్ చెన్నుగొనియె
నవనియందు నచేతనతానుభూతి. గవిసమ్రాఁకులు కామినీఘటితగౌర
వావమానంబులొకటిగానలగరసికు, లలను బెంతయుహోవింతయతివపొంత ౨౨

గీ. చెలువుమీఁటినయవ్వేళఁ జిత్త, మొదవ, నెమ్మిగైకొనెమలఁగెను నెమ్మిరొదలు
నెపుడుఁ గాయనివైజాత్యమిరతుకొన్న, యట్టివయ్యును సాజాత్యమాశ్రయించె.

సీ. అరసానుభూతుల సరసానుభూతులై మెలఁగుచుండఁగఁజేయు మేలుశక్తి
లేఁగొమ్మపొందులు లేకయుండెడువానిఁ దద్వృత్తినందింపఁ దనరునేర్పుఁ
బ్రసవవాసనలేక బడలుచుండెడువానిఁ బ్రసవాప్తినమరించు ప్రబలమహిమ
పల్కులింపులు మీఱఁ బలుకనేరనివానిఁ బలుకదిద్దినయట్టి పాటవంబుఁ
గలిగినవయోగిజనములఁగడుముదమున, నెనయఁజేయుపవంతయోగీంద్రుఁగన్న
యోగరహితజనంబులయుల్లములను, బెల్లువర్తిల్లఁజేసెను పల్లటములు

క. సురభీరయమార్గచరా, స్థిరమానస సమ్మదప్రసుతే ర్భవతి కుహూ
పరిహర్తా నేత్యేవం, పరభాక్కుల సవిరళముగఁ బలుకం బికముల్. (?) ౨౪

ఉ. పంకజకోశపుష్పపుటభాసిమిళిందవిలాసవాసమై
యంకురసూచికావినిహతాహితమండలజీవితంబునై
శంకిలఁజేయు నాభరతశాస్త్రము నామని దానిజూడఁగా
సంకురమూను మోదభర మన్యనిరీక్షణఁ గల్గ నేర్చునే ౨౫

## —♦ గ్రీష్మఋతువర్ణనము ♦—

క. అంతట వేసవి దోఁచె దు, రంతమహోష్మానుగతనిరంతరమిత్త్వే
దంతాభ్యర్హితమతద్ధృ, ష్టాంతమరీచీనిమాలి తాశాంతంబై. ౨౭

క. వరసుమనోజీవిత మగు, సురభిం బఱవంగ భువనశోషకతిగ్మా
కరదనుజుఁడు వడిగఁ దదా కరవిపినంబులను మిగులఁ గాఁక దహించెన్. ౨౮

క. ఆయెడ దక్షిణదిగ్భవ, వాయుపదత్రయికి నెన్న వరుణాలయుది
గ్వాయువు సపాదసప్తా, ధ్యాయి యనం దగు నటంచు నడఁచు న్మదుపుల్. ౨౯

మ. ప్రతికూలుం డగుచంద్రుఁ గూడి విరహివ్రాతంబు నేఁచంగనో
యతిగాఢచ్ఛదశాఖలా వనుల ధ్వాంతారాతి డాపంగనో
యతిశోషోగ్రత నవ్వసంతువయిఁ దా నందెం జుమీ నాఁ బదా
హతి దూరోష్మత లోకబాంధవునియం దారూఢమై వర్తిలెన్. ౩౦

మ. సతవాహంబులు మచ్చరం బొదవఁగా సప్తాశ్వము న్వెంట న
ప్రతిమం బో రథమూాన వంతిడఁగ నాథావంబుచే శీఘ్రసుం
గతి నయ్యశ్వము గాంచ లేమి జడిమం గాంచెం బ్రయాణంబు భా
వతికిన్ నా దివసంబు లాయతము లై పాటిల్లె న వ్వేసవిన్. ౩౧

సీ. నాఁడగు దాహగుణంబు కారణగుణప్రాప్తంబుగా జగత్ప్రాణుదాహ
సక్తిసంపత్తికి సంశయింపఁ బనేమి నీచుఁ డొకఁడు గంధనిలయుగోత్రి
మంది తద్ధర్మంబుఁ జెంది స్వధర్మంబు విడిచిన నేఁ బోవ విడుతు నెట్లు
జడత్వ గైకొనుట నే జలముతో మైత్రికిఁ జొరఁజెచ్చుహరియింతుశరధిఁజొచ్చి
యనుచుఁబచ్చి ముజలనిధియందు మెలఁగు, భీకరాటోపబడబాగ్ని వెడలెననఁగ
నఖిలజనములు భీతి నిట్టట్టు గాఁగఁ, బట్టుబాలక పడమటివెట్ట దోఁచె. ౩౨

క. పుడమి విరియంగఁ గొలుకుల, తడికొలఁకులతడులకోడఁ దరలఁగ జంతుల్
కడు బడలి నీళ్లు గాళ్లం, బడిగొంతులుదడుప మందు(?)పడమరసాగెన్ ౩౩

సీ. బలిసెను బహుదూరపదవి ప్రపలతోడ భూరిసరిన్మధ్యపులినవితతి
యెండసాగెను మార్గగేహతకూపంబు లఖిలపాంథాళికంఠములతోడ
దీర్ఘత గైకొనె దినములు మఱిమఱి యతిదృఢజలరజ్జులతులతోడ
మించెను మిశ్రోపలాంచదగ్నిశిఖాలి చటులదవానలచ్ఛటలతోడ
సంతతాన్నప్రదాతకు సాధుకర్మ, శీలునకు నీళ్ళ వలసలు సేయువలసె
నెతులవశువృద్ధి గలిగినయట్టివాని, కైన నర్థాంబు వబ్బుట [illegible]య్యె ౩౪

గీ. కూటిపేదతికంబు గైకొనిరి మిగుల, నాతరముచేత బ్రీతికెడునట్టివారు
ఖనన మొనరించితనుయాత్రి గడుపువారు, కూలిగలుగుటన వ్వారిగూటఁబడిరి. ౩౫
గీ. తల్లి *పదమునందు ధార్మికమనముల, (సుకవి)కవితయందు సొబగుమిగులు
గుబ్బలాండ్రి పీనకుచమధ్యసీమల, నిల్చు శైత్య మనుచు నిలుచు బుద్ధి. ౩౬
క. కూటికిఁ బచి పానమ్మొదెను, బాటిల్లెను నీళ్ళసుళ్ళు పవనంబునకున్
మేటిసురతములకూరిమి, గాటపుఁ బగహానములఁ గదలక నిలిచెన్. ౩౭
గీ. చూడకయుఁ జూచికొన్నింటిపీడనాడి, యరసియొకకొన్ని రూపంబు లాఁగికొను
చుఁ, బురుషు లింతలు వేర్వేఱ బురదనీరు, కదవ నెలితిగఁ గైకొనికడుబడలిరి. ౩౮
క. హారఫాలోద్ధతవహ్నియె, తిరుగం గ్రీపంగఁ బలఁచి దీపించె నటం
చురవడి వెట్టకు వెఱచుచు, మరుఁ డుసుకుచశిశిరదుర్గమధ్యముఁ జేరెన్. ౩౯
క. బలుబీటల వెంబడిఁ జనఁ, గల (జల)జంతువులు మొదటఁగల పదనంబుం
తెలువబలుగుబ్బ చలువల, నెలవుగఁ గైకొను మగంటు నేర్పున బ్రీతికెన్. ౪౦
సీ. ఇనుఁడు దాక్షిణ్యంబు నెనసి మున్ లోకభాంధవుఁ దనఁదగి యనుద్ధతకరత్వ
మనువుగఁ దమకు జీవనసిద్ధి గావింపఁ దనులోనిజంతుసంతతులతోడ
ముదము గైకొనె నదీనదము లంతటఁ గాలగతిచేత నత్యుగ్రకరతఁ బూని
యతఁడు దాక్షిణ్యంబు గతముగా దినదినంబును నాత్మదత్తజీవనము నెల్ల
గాకఁ గైకొన బంతులొకటికి లేక, సులమలనుమాడఁ ఖన్న లిగలయుగ్రమ్ము
నందఱుల్లంఘనము సేయనమితపంక, భావ మొదవంగ నెంతయుబయటఁబడియె. ౪౧
క. పట్టపగ లెనయుభానుఁడు, బెట్టగు కాఁకల జగంబు బెదరింప హారుం
డట్టియెడఁ గాన నెకక, నట్టపుఁ జిగి మొఱపె ననెడు శేలఁ బుదయించెన్. ౪౨
గీ. పవలధఃకృతరేఖ-బాన ప్రచండ,ఘటనపటువృత్తి దీర్ఘశాచటుల మగుచు
దివ్యతేజోగుణంబున దీప్తిగాంచి,సుకవికృతిరీతిఁగనసయ్యెఁ జూపరులకు. ౪౩
క. పడమటి సెక నుడుకఁగఁబడు, పిడికిటివస్త్రంబు లెల్ల బెట్టాఱంగాఁ
గుడికరమునందు నిలిపిరి, కడు బూతం బనుచు వానిఁ గన్నారూఘుల్. ౪౪
గీ. చిత్రచిత్రరుచివ్యాప్తిఁ జెందె యరస, భావనిత్యాస్పదం బని పలుకఁ దగుచు
భీకరనిదాఘసమయంబు పెంపుగొనియె,జరమకావ్యంబుగొన్న సొష్ఠవముగాంచి. ౪౫
క. పంకరుహాబాండభాండము, పంకజహితతిగ్మకాంతి పటువహ్నిశిఖం
బొంకమయి గ్రాఁగుసపటిని, రంకుశధూమంబునం బరాగము వొడమెన్. ౪౬

*పదగుణందు-మూ.

గీ. భూరిరవిరోచిఁ గాలెడు పుడమి వెడఁద, పెనముపైఁబండు వెన్నెలపేరి యట్టు
మంటమీఁటినయాఁకటమటియు మఱియుఁబొట్టనిండించె రేతేనిపులుఁగుఁదుటుము
చ. ఖరకరరుక్ప్రతప్తదృఢకంబభవాండఘటాంతరంబునం
గరము మెలంగి శాఁగునుడుకాంతవిభామృతముం జకోరముల్
పరఁగు(గుటా)గుటార్భటులఁ బానముచేసెను నోరు పొక్కఁగాఁ
బర మనురక్తిమై మిగులఁ బాటిలుదప్పికి వేఁడి వాఁడియే ౪౯
గీ. అతులమాధుర్యమకలంకమనుచు విబుధ, సముదయం బెన్న జగతిఁ బ్రశస్తిఁ గాంచు
నక్కళాభృదుదంచద్గవామృతంబు, గ్రోలిసుఖియించెఁ జాలఁ జకోరసు*కవిరట్
క. చిచ్చుసరి పగటికాఁకల, నిచ్చన్ జక్కవలు సుఖితనిలిచెను గాఁకల్
హెచ్చెను వెన్నెల వానికి, మచ్చికజనరాండ్రు రేలు†మఱుగునఁ బడుటన్ ౫౦
చ. తోలుత హిమాంశుమంజురుచిశ్యోయరుహోత్కరప్రస్తుతన్
మెలఁగెను చంద్రకాంతముల మీఁదటఁ బర్వ ఛటచ్ఛటార్భటీ
మిళితపుటావృకుల్ దిశల మించెను బిమ్మట రాలు మెత్తనై
నిలిచె ద్రవంబుజాలు బలునిర్ఝరముల్ గలిగెం గ్రమంబునన్ ౫౧
గీ. చంద్రుఁడయ్యెనుదవనుండు చక్రవాక, దంపతులకెల్లనవ్వేళఁ దపనుఁడయ్యెఁ
జందమామయుఁదలఁపనీచందమునదె, యొగలిడభావహేతువులూర్జితముగ. ౫౨
క. భోగులకు రాత్రివేళల, బాగుగ రుచియించె మధురపానకరసముల్
బాగై రుచించె నంతకు, బాగా నిజసతులమోవిపానకరసముల్. ౫౩
ఉ. వేఁవిరాత్రులందు నరవిందరిపూపలవారి నిర్ఝరో
ల్లాసముఁజేసె బ్రోషితవిలాసినిధూ‡రుదితోత్థబాష్పముల్
గాసిగ వీచువట్టి బలుకాఁకల వారుణదేశవాయువుల్
భాసిలఁజేయుఁజాలెఁ దదపారముఖోదితతిగ్మవాతముల్, ౫౪
క. వ్యాకోచమల్లికాళిసు, మాకృతు లవ్వేళఁ గానవయ్యెను జంద్రా
లోకపరిలీన మగుచున్, వ్యాకీర్ణోదీర్ణపరిమళాంచితమహిమన్. ౫౫

—♦ వర్షఋతువర్ణనము ♦—

గీ. అమితభూతాపవినివారణాశ్రయంబు, భువనసస్యానుసంతతస్ఫూర్తి[illegible]జ
మాత్రచాతకసంజీవనౌషధంబు, వంతఁగృష్ణాభ్రము ప్రకాశ మధిగమించె ౫౬
క. తనబలుజీవనధనములు, గొని జగములనేఁచు గ్రీష్మఘోరాసురునిం
దునుమాడ నెత్తె వరుణుఁడు ధను వన నవరాశి నింద్రధను వుదయించెన్. ౫౭

*కవిశబ్దము పక్షిపర్యాయముగా వాడుచున్నాఁడు †మరదలిపడుచున్ మూ. ‡రదపాదబాష్పమూ

సీ. చంచలాటోపవైశ్వానరశిఖ లొప్పఁ జిత్రభానున్నతాస్ఫీతు లెనయ
మేదురగర్జానినాదంబు లెసఁగఁగఁ గరకామహోపలగతులు మిగుల
నాశుగోద్ధతవృష్టు లవిరళంబులుగాఁగ హరిగోపకుప్రతాపాప్తు లడర
వాహిను లెంతేని వడి మించి నిగుడంగ నశనఘోరాస్త్రవిహార మెనయ
నలమయూరాదికవివదు లతిముదమున. ఘనతరస్తుతులొనరింపఁగా ఘనుండు
అఖిలసంతాపకారి గ్రీష్మాపకారి, కడక వర్షాయించె సర్వోపకారియగుచు ౫౮

క. *వార్షికమహాధ్రిపటలా, కర్షణపటుమంత్రవిద్య ఖరఖరకరతా
ధర్షణకారణ మగుతే, ఖర్షభదిగ్వాయు వప్పుడు కడు దీపించెన్. ౫౯

చ. పడమటిగాలి దా జగముపాలిరము నుగ్రకరుండు గాంచు నే
వెడఁ గగులోకభాంధవత వేదనసేయు నటంచు రోయుచుం
గడు నల(రె)న్ బలారిదెసగాడ్పు వదాన్యఘనుండు దోడుతన్
నడుమ జగంబుపాలి మనునామము లోకములో విరాజిలన్. ౬౦

క. జలధిం జులుకంబునఁ గొను. బలునేర్పరి కుంభయోనిఁ బ్రార్థింపుమఁ ద
జ్జలముగొను †నేర్పు గన నన, జలదంబులు జమునతోడు చాయకునడచెన్ ౬౧

గీ. పగలు రేయి దివాకరుఁ బన్ననైఁ, జూడవి వీక్షింపఁ గను విరహిదళనంబు
నేమమునఁ జేయఁ బూనుచు నెగడెమింట, విపులతర మైన(యాకృష్ణ)విషధరంబు ౬౨

క. ధారాధరగళదురరస, ధారానీర్భరిమునఁ దమఁ దత్త్వజ్ఞులకున్
దూరించెను సమవిషమా, కారజ్ఞానములు రూపకం బొక్కటి గాన్. ౬౩

క. స్థలజలభేదము మానఁగ జలదము వర్షించి బహుళశంబు ఘటించెన్
విలసల్లక్షణవృత్తికి, బలుశాబ్దిక లాత్మవృత్తి ప్రీతిసేయుంగన్. ౬౪

ఉ. అందముగాంచు నెట్టిజనరాండ్రను బెండిలియాడుచో నుదిం
జెంద కలంకతో వశిగఁ జేయు స్రవంతివధూటుల న్నిజా
మందతరంగహస్తముల మించి నెదుర్కొని కౌఁగిలింపుచున్
డెందములోని యక్కలఁక దీర్చును దక్షిణవార్ధి నిత్యమున్. ౬౫

సీ. అహితాగ్నుల కెల్ల నాత్మవైశ్వానరరక్షయే కార్యసర్వస్వ మయ్యె
భోగికైనను రాత్రి భోజనం బెచ్చట నన్నమాత్రము కాని యబ్బదయ్యె
సారమంత్రోపాస్తిచతురుల కశనంబు వార్తగల్గుట గాని వారియయ్యెఁ
బ్రతిగృహంబున కేగి ప్రార్థింప(ఁబ్రార్థింప)శిఖయొకింతొసఁగినఁ జిత్రమయ్యె

* వర్షుక—మూ. †నొప్పుగనకన—మూ.

క. భూరిప్రసాదమధురిమ, ధారాగుంభ(ము)లు సంతతస్ఫురదోజ
స్సారములు నభ్రమండలి, గారించు న్ననవరతప్రకాశపుఁ గవితన్. ౨౫

ఉ. జీవనమున్ హరించి యును, జెల్వుని బాపియు, జన్మకోటికిం
గేవలహాని జేసియును, గేరు నినుం దర్శగన్ ఘనుం
జీవనవృద్ధి గైకొనుచుఁ జెల్వుని గూడుచు జన్యసంతతుల్
ఠీవి వహింప రాజిలు పటిష్ఠత గాంచె నదీవిలాసినుల్. ౨౬

గీ. పటుఘనాఘనమండలి ప్రసరదసమ
వర్షధారానిరస్తసంజ్వరత గాంచఁ
జాతకుఁ(డు)సద్గుణముఁ జెందు జగమునందు
విషమభావంబు గైకొను విస్ఫుటముగ. ౨౭

క. నవరసబంధుర మేనియు, నవిరళకర్ణాతికటురవాన్విత మయ్యెన్
*అవగతరసావకర్షం, బవునే యుత్కృష్టరసమహత్త్వంబు మొగుల్. ౨౮

క. ఘనమండలి యత్యున్నతి, గనుఁ†దొల్తం బిదపఁ గరకకలితకుసుమజా
లనవజలసేకములఁ దా, మొనయుం పుడమి నీలకంఠముద మొనరించున్. ౨౯

చ. సరసఘనానుషంగమున సంతతతాపము మాని భూమి దు
ర్భరతరపంకమగ్నతసుఁ బాల్పడి మొం బరికింప నద్ది యే
కరము నిదానమా జగదఖండసుఖంబున కాదిమూలమై
పరఁగు నపారసాధుఫలభారసమృద్ధికిఁ జిత్రమెంతయున్. ౩౦

చ. పడమటివాల్పుచేఁ గను పభంగురవేదన గాంచఁ జూచి తాఁ
జిసిముడి(పా)టుమై నిసురఁ జెందక నందకపాణి యప్పు డా
కడుసెకపేరడంగఁ దనకాన్పు సుఖంపఁగ రెండుకన్నులున్
బడలికదీటి చెల్వుగొన వారిధిఁ గూర్చు ఫణీంద్రశయ్యపై. ౩౧

క. ఉరుగర్జితవాద్యధ్వని, సురుచిరకేకానినాదసుభ(గీ)తంబుం
దరుణమయూరీనృత్యము, పరఁగన్నాట్యంబు మిగుల భాసిలుచుండున్. ౩౨

గీ. ఘనతగల్గె జగద్రక్షకత జనత్వ
వార్ధి తఘటిల్లెఁ గావున నచట భత్వ
ముత్వపరమా‡టుచితమన్న యొఱపుమీఱఁ
బొదలివర్షాభువులు చాల రొదలు సేయు. కప్పల ౩౩

సీ. నిర్ఘాతగర్జితనిరుపమకోపప్రసాదబిహాన్నిరుక్తులు చాలఁదొలుక
విద్యున్నటీలాస్యవిలసనంబులుమీఱ నాపారకారుణ్యమతిశయిల్లఁ

---

*అవితరసావకర్షం-మూ. †దొల్తటిపిదప-మూ. ‡మచితకన్నొయ్యపు-మూ.

జాతకబర్హిణచతురార్భటు లలరంగ జాతు లాటోపవిస్తార మెనయ
ఫలహేతుధర్మసంభరణశక్తి చెలంగ సంతాపవార్తలు శాంతిగొనఁగ
రాజహంసవిలాసంబు రాణదొలఁగ, సమతవర్తిల్లు చున్నతస్థాన మెనసి,
ధరణిపాలించె ఘనుఁడుచిత్రంబుగాఁగఁ, బాకమొక్కటి యెక్కు వైపరఁగఁగ నీ

గీ. మానకృతమైనవిరహంబుఁ బూననయ్యెఁ, దరశనయుతల కవ్వేళ ధరణిలోన
ఖనకసంపాదితద్రవ్యగౌరవంబు, సాధికరణంబు కర్ణధారాళి నయ్యె. ౮౫

క. కట్టువడ కటికాల్నడ, బెట్టగువ్యగ్రములఁ గొనెను బేరముతోడన్
మిట్టమిట్రాటుపల్లెలు, గట్టిగ మొనమూపసాగెఁ గట్రులతోడన్. ౮౬

ఉ. కాలువలెల్ల బల్నదులకైవడిఁ గాంచె నదీలలామముల్
నేలి యొనర్పగాఁగడఁగెఁ గేవలమబ్ధి నతండు నీరమా
త్రాలయుఁడైనఁ దావికృతినందక యుండు వికారహేతువుల్
చాలమెలంగినన్ వికృతిసంగతిఁ గాంచునె ధీరచిత్తముల్. ౮౭

—। శరదృతువర్ణనము ।—

క. తరువాత శరత్సమయం, బరుదుగ ఘటియిల్లె నంబుజాక్షస్వాప
పరనామకబహిరంగము, హరియింపఁగఁజాలు నంతరంగం బనఁగన్. ౮౮

గీ. వారివాహరసారంగవర్ధమాన, బహుసదీపంకబాహుళ్యపాటనక్రి
యాతిదక్షిణనామనామాభిరామ, మై శరత్కాల మామోదము లరనమరె. ౮౯

సీ. కాలవశాగతఘనసీలతా స్థాయిభావభిన్నాదేశభద్రమూర్తి
సర్వసరిన్నీరసంపదనచ్ఛతాద్విహ్వాకవాల్మీకిదీవ్యసూక్తి(?)
రుచిరకేకివచోవిరుద్ధధిక్కృద్ధ్వనసమునసభిన్నైకసంశ్రయంబు(?)
సరసిజాహితబింబసత్కావ్యశోభాతిశయహేతుహితపరిష్కారమహిమ
మూర్జితహరిప్రబోధగురూపదేశ, మఖిలహంసగణాకర్షణాఢ్యమంత్ర
మంబుజాతప్రభావ్యంజితాంజనంబు, దనరెనంతయు శరదభిధానఋతువు.

క. సరసతకల్మిఁ బ్రసాద, స్ఫురణంబున నదులు మెలఁగఁ జోద్యంబగు నే
విరసితభావము నందియు, నరుదారఁ బ్రసన్నభావ మందె నరుదుగన్. ౯౧

క. కలుషతఁ గడపెను శరదృతు, వొలయఁగ సుఖపారవశ్యమొదువ న్నదికాం
తలపులినకటితటంబుల, నలరారఁగఁ బూని రమలహంసకగణముల్. ౯౨

గీ. అలకశాధగు నలరించి యువనిపుంక, ఘటిమవారించి యుద్యోగిబంధ మెడపి
శరము విడువక యాశరత్సమయ మెనయ, నేటిపోటులకలుషత మీఁటె మఱియు.

క. అతతి నంతయు విమలం, బై తనరెం బ్రోషితాంగనాంబర మొకఁడున్
శ్రీతరుణితోడుమై వి, ఖ్యాతిన్ వర్తిల్లనోక్షయంకము కోదగా. ౯౪

క. జీవన మంతయు లోకో, జ్జీవనమున కిడుచుఁ గార్యసిద్ధి వడసి మై
కేవలపలితంబుగఁ దా, ఁ బోవదె ఘనశ్రేణి యశుపుంగవుదిశకున్. ౯౫

మ. పటుసంరంభవిలాస మొప్పఁగ జగత్ప్రాణుండు ప్రేరేప ను
త్కటగర్జాకృపణోక్తు లప్పటిల లోకత్రాణకై జీవనం
బటు వోవైచి యసారుఁడై ఘనజనుం డాహా వెలంబోయి దా
నటునిట్టున్ భ్రమియించు లబ్ధులకు సౌఖ్యం బబ్బునే స్వార్యతిన్. ౯౬

క. రాజధనుస్సులు నిర్జర, రాజధనుస్సుల మెలంగు*రాణంభాఁధ
స్త్రీజనచంచలహృదయా, భోజంబుల సీటికలఁక పూని వసించెన్. ౯౭

చ. నెలయనుమోము లక్ష్మునను సిద్ధపుఁగస్తురిబొట్టుఁ జెంద ని
స్తులఘనకేశపాశము ప్రసూనవిభాసిత మై మెలంగఁగా
విలసదనూనతారకలవింతరుచుల్ దిశలం జెలంగఁగా
వెలయుచు నభ్రలక్ష్మి యతివేల మొనర్చు ముదంబు చూడ్కికిన్. ౯౮

గీ. మధురరసము ప్రసన్నత మాన కూని
మధ్యవృత్తులుగొనుచు నిమ్నగలు కృతుల
చెలువు గైకొని మోదంబు సేయఁ బూని
ఘనముగఁ బత్త్రపకర్షంబు గలుగునేని. ౯౯

గీ సీరసం బౌచు జాడ్యైకదూర మగుచు
సుప్రసన్నత గైకొని దీప్రవిష్ణు
పదమునందు మెలంగునప్పటిజలదము
పుణ్యపురుషునిభావంబు పొందు గొనియె. ౧౦౦

క. నెల ధీరలలితుఁ డయ్యెడు, నలనిర్జరపదవి రంగ మనదగుఁ దచ్ఛ్రీ
వెలుఁగునటియగును దారలు, లలితతదంజలివినిస్సరన్మృదుసుమముల్. ౧౦౧

గీ. లలితమైతోఁచునట్టి కళాపదంబు, వింతయైతోఁచు† నేల యమాంతమైనఁ
దలఁపఁ జిత్రంబుగాదె దుర్లక్షప్రకృతికి, సమయమైయుద్ది మిక్కిలి వెలయుచున్న.

క. మధురరససాధకంబై, యధిరాజమహారణక్రియాబోధక మై
యధిగతరససంకరవా, ప్రథిమం గొని యాశరత్తు ప్రాథిమ మెఱసెన్. ౧౦౩

క. ప్రకటితకాశాకాశా, వికలసవర్ణత శరత్తు విదితం బయ్యెన్
వికృతికిఁ బ్రకృతిత్వము గొని, ప్రకృతికి వికృతిత్వ మొందు భావన్నగుచున్

---

* రాణగొనుంబాం । ధారాచంచల - మూ† సె రమాంతమైన-మూ.

—॥ హేమంతఋతువర్ణనము ॥—

క. సర్వజగద్విజ్ఞానా, ఖర్వనిదానాబ్జమిత్రఘనరుచివిద్యా
సర్వస్వహృత్యవిద్యా, ధూర్వహమై మించుమంచు దూకొనెఁ బిదపన్. ౧౧౫

ఉ. తమ్ములదాయ మేల్గనఁగఁ దాళక తమ్ములనేఁచ మంచుచి
చ్చమ్మగిమూఁదమీఁజ వడిఁజొచ్చెఁగఁ దమ్ములతోడ నాత్మ స
ఖ్యమ్ముభరించు కల్వలును గాటియఁ జెందెను మిత్రవర్గహా
తమ్ము నెఱుంగఁ డయ్యె నుచితస్థితిఁ గాంచ జనండు నేర్చునే. ౧౧౬

క. అహతాకారతఁ *గైకొనె, మిహికాసమయంబునందు మిగుల నెగడుచున్
మిహికాసముదయ మంతట, రహి†సంస్మృతియనఁగ‡వింత ప్రాయఁగనగునే.

ఉ. నింగికిముట్టి తోడుతన నీటుతొలంచెడు వింధ్యశైలముం
జెంగఁగఁ జేయ మంచుమల చిత్రముగా వడి రోదసుల్ గనం
బొంగుచుఁ గ్రమ్మెనో యనెడుబుద్ధి జగంబుల కావహిల్లఁగా
భంగము లేక యెల్లెడలఁ బర్వె హిమాని నిరంతరంబుగన్. ౧౧౮

క. మంచు గిరితరుల ముంచఁగ, వంచకభిల్లుండు వెదకు వలిమలతోఁగన్
ఎంచుకొనఁగఁ డఁగి రమరు లు,దంచితనిజనిలయనివసదామరతరులన్. ౧౧౯

క. ఆరూఢహిమ మడంచఁగ, నేరుపు గానఁ డయ్యె నినుఁడు నెఱిఁబగటను నీ
'హారమివభాస్కరఖ్యాతి', స్ఫారోపమ యొనర మిగుల జతనంపడియెన్

క. పదవర్ణస్ఫోటంబులు, గదియింపుచు ముఖపదముల ఘటియించఁ గడుం
బదిలముగ ధ్వనులు శాబ్దిక, భిదురధరస్ఫూర్తి హిమముపెంపుమిగులఁగన్.

గీ. ముఖపదోచ్ఛ్రయమున ధ్వనుల్ మొనయఁజేయఁ
జాల నెనయించు రూపకమీలనముల
హిమకవీ యొనర్చుదృష్టాంతకములగరిమ
నమజగత్ప్రతియధరప్రణములుగాని. ౧౨౨

—♦ శిశిరఋతువర్ణనము. ♦—

గీ. దాసిపిమ్మట మార్తాండభానుచండ, భావసంస్తంభనామధప్రాభవంబు
సంగతహసంతికాదృఢాలింగనైక, ఘటనచేటంబు నగుశీతకాల మొదవె.

చ. చలి యిడువేదనం బడఁగఁజాలక పద్మజశౌరిశంకరుల్
మెలఁతల నాననాబ్జమున మించునురంబున సామిమేనున

*కైకొని- †సంస్మృతి-‡వింతరాయనదగునే మూ-

న్నిలుపుచు నవ్వేతం గడవ నేటికిఁ బాయరు తత్ప్రదేశముల్
చెలువలు గారవం బరుగఁ జేయఁగ న*ద్దశకోర్వనేర్తురే. ౧౧౪
గీ. అగ్నిదివసాంతసమయవిన్యస్తమిహిర, పటుమహఃపూరసంపూర్ణ బలుఁడుగాన
సంతతార్తియకేవలసన్నిధాన, కలన శీతంబు వారించుఁగా యొకింత.
ఉ. శీతముచేత బాధపడు చిత్రజగంబు భరింపఁగా జగ
త్త్రాత దినేశుఁ డీశ్వరతఁ దాల్చుచు నంబరమధ్యసీమఁ దాఁ
జాతురి నేగుచు న్నిటలచంచదచంచలదృష్టి కించిను
న్నీతముచేసెఁ గావలయు నెమ్మి ఘటిల్ల నివారించుశీతమున్. ౧౧౬
క. కాంతభృశాలింగితధృఢ, కాంతాకుచకుంభమధ్యగతసూక్ష్మబిలాం
భ్యంతరము గని యనంగత, కెంతయునలరుచును మదనుఁడెడ యంజలికిన్
చ. అరమెయినుండు నద్రిసుత యందపుఁగౌఁగిలి లేక చిచ్చు క
న్నర కడు శీతలింపఁ జెలి కడ్డము సేసెరు గంగనాళకు
ర్భరగరపహ్ని మంచుమలరాయునియల్లుఁడు దేటచందమా
మరసిగలో విషాశిఖరమా బలుకంపలి లోఁగఁగట్టుచున్. ౧౧౮
క. †చలికిన్లోఁగకఁ నిలిచిరి, వలివెలుఁగులు పెదలుచల్లువాఁ డొక్కరుఁడున్
విలసత్కాలాగరువౌ, వలిఋబ్బల నండగొన్నవాఁ డొక్కరుఁడున్. ౧౧౯
క. అప్పప్ప యేరికైనం, జెప్పంగా శక్యమాని శీతముమహిమల్
నిప్పుల కప్పులకుం దాఁ, దప్పక యన్యోన్యసదృశతను ఘటియించున్.
గీ. మూర్తికౌటిల్య మెంతేని మొనయఁ జేయు, నధరశబ్దప్రచారంబుల నరఁజేయు
శీతలరసాతిదూరతఁ జెందఁజేయు, శిశిరకాలంబు దలఁప విచిత్ర మయ్యె.
శా. ఈరీతిన్ ఋతువ్రల్ విరాజిలఁగ నయ్యేణాక్షి పద్మేక్షణా
కారధ్యానరసానుభూతి ఘటితాఖండప్రమోదప్రవా
హారజ్యన్నిజవృత్తియౌచు హృదయం బన్యక్రియాజ్ఞానమా
ర్గ్యారూఢం బయి యొప్ప నక్కజపునిష్ఠం బూని యుండెంగడున్. ౧౨౨
క. జగదండమండనోజ్జ్వల, భగవత్పదవాచ్యనామ ప్రణమజ్జనతా
సుగమ నిగమాంతమానస, ఖగరాజారవితనూజకల్పమహీజా. ౧౨౩

గద్య ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి మాధవ
యజ్వసముజ్జ్వలత్పౌత్రపోషిత కలాకౌశల సాధిత పాండిత్యాభరణ ప్రభంజనవం
శాబ్ధి రాకాశశాంక నిరంతరారాధితవిచక్షణశశాంక అభినవనన్నయభట్టా
రక అహోబలపత్యాహ్వయకవి మహోపాధ్యాయభట్టారక ప్రణీతంబై
న కాళిందీకన్యాపరిణయం బనుమహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

---

*నద్దస-మూ. †చలికిలోబడక నిలిచిరి- మూ.

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

## — పంచమాశ్వాసము. —

క. శ్రీపార్వతీసతీపతి, చాపవిలోపనపటిష్ఠ జలదాభలస
ద్రూపక జగత్ప్రదీపక, భూపకవరసార్వభౌమ పురీమలలామా. ౧

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము. ౨

— కృష్ణుఁడు ధర్మరాజుం జూడఁబోవుట —

చ. జగములఁ బ్రోవఁగా మనుజజన్మముఁ జెందు పురాణపూరుషుం
డగణితభక్తి సత్యకసుతాదికయాదవు లంటికొల్వఁగాఁ
దగిలినప్రేమచేఁ దరలెఁ దన్నొకపెన్నిధిగాఁగ నెప్పుడున్
మిగిలెడుభక్తిచేఁ దలఁచు మేటి యమాత్మజు సానుజుం గనన్. 3

క. ఇంద్రారివైరి చనుచు మ, హేంద్రప్రస్థంబుచూచె నింద్రమహీంభూ
సాంద్రసుమవిసరవిగళద, తంద్రమరందైకపూరితస్ఫుటసరసిన్. ౪

సీ. సర్వభాషావచస్సంపన్నిధానంబు, సాధ్యసిద్ధవచోవిచారితంబు
శూరసేనాధారతారుచిమంతంబు, వ్యత్యయకార్యోపపత్త్యనుగత
మనుసృతభవికలాపాయోగసిద్ధంబు, రేఫోపహతదృఢోల్లేఖితంబు
అన్యథాభావప్రహాణనిరూఢంబు, సప్తాంగరూపప్రశస్తమహిమ
మైవిరాజిల్లు చట్టభాషావిశేష, సముదయుస్ఫూర్తి హసియింపఁ జాలునట్టి
పురవరంబు హరిప్రస్థపుణ్యనామ, మచ్యుతానందమునఁ గాంచె నచ్యుతుండు.

గీ. అపుడు శ్రుతులకు నెప్పుడు నబ్బఁబోని
యసమబాణమహావీరునబ్బగాని
సవిధసంప్రాప్తి యతిథివైభవము గాంచె
సుభగమహిమంపునమవర్తిసుతుశ్రుతులకు. ౫

గీ. వెన్నునాగమనంబుఁ దా విన్నయపుడ, ధర్మతనయుఁ డాకర్ణ్యఁ దరలఁబనిచె
ఘనతరానంద మగుతనమనసుతోడ, వాసవసుతాదిహితుల సేనాసహితుల.

ఉ. కూరిమిమీఱఁ దన్నెదురుకోఁ బవనాత్మజు నాత్మవత్సుమం
జేరిసుఖించఁ పుణ్యములఁ జేరిచి నమ్రసజోత్తమాంగుఁడై

ధీయుల నింద్రనందనుని దేవభిషక్తనుజన్ములన్ శుభా
ధారవచస్సుధం జిలికి ధన్యులఁ జేయుచు నేగి యంతటన్. ౮

మ. ఒకచో మాధురిఁ గుల్కు పల్కుగములం బింపొందఁగ వేదోక్తచోఁ
బ్రకటప్రాభవచోనిగుంభనలఁ దీవ్రస్ఫూర్తి వర్తిల్ల నే
కకదోషంబును లేక కావ్యమణి జోకంగాంచు నాస్థానిలో
వికచన్యాయకరత్నమై యనుఋష్యశ్రీకాంతు నీక్షింపుచున్. ౯

చ. నతు లొనరించుపుణ్యుల కనారతసౌఖ్యనిధానదక్షమా
గతి ఘటియించునప్పరము కారణతత్త్వము ధర్మపూతికి
న్నతి యొనరించెఁ బ్రాక్స్వజనినమ్రసంప్రతి తన్నిరంతరో
న్నతి కగుఁ గారణం బని జనప్రకరంబు నుతుల్ ఘటింపఁగన్. ౧౦

క. చాఁగిలిమ్రొక్కినయప్పర, యోగీశ్వరు గ్రుచ్చి యెత్తి యోగీశహృదా
భోగసమనిజభుజాంతర, యోగంగా ధర్మతనయుఁ డొనరించెఁ గడున్. ౧౧

మ. అలవేదాంతసరస్వతీసముపగూహం జేసి గైకొని య
బ్బలు తేజంబు తనంతఁ దాన నిజదోర్బంధంబునం జిక్కను
త్కలితానందపయోధిఁ దేలుచు నజాతద్వేషి నన్నొప్పు పు
ణ్యులు లేరంచు మదిన్ గణింపుమ వరేణ్యున్ శౌరిఁ బల్లెం దగన్ ౧౨

గీ. జలజనయన యిహాముత్రఫలవితాన, మూలకారణ మని మదిఁ జాల నమ్మి
నీకు నదభక్తి చేకొని నిలిచినాఁడ, నితరము నెఱుఁగఁగద యిట నీవె సాక్షి.

చ. అట్టిఁడివాఁడ నే నెటుల నంతకుదాత కవాప్తకాముగన్
గట్టిగఁ గొన్న నీకు శుభకల్పనసేసిన నారకుండఁగాఁ
గిట్టను గాన నాదికవి(?) గేరెన కృష్ణుఁ ద్రుంచి శిష్టుఁ న్
దిట్టముగాఁగఁ బ్రోచికొను దేవరవై జగ మేలుము చొగిన్. ౧౪

ఉ. లెక్కకు నిక్కు జన్మముల లేఁతకుఁ దక్కినభక్తి నే నతుల్
మిక్కిలి నీకొనర్చితి సముద్ధగుణాకర తత్ఫలంబులై
దక్కెను *నాయనమ్రతయుఁ దావకసమ్మతయున్ సమానులన్
నిక్కము ధిక్కరించితిఁ నిష్టురపుణ్యయశస్సమృద్ధులన్. ౧౫

గీ. తమము హరియించి వస్తుతత్త్వంబుఁ దెలుప
నీవ కా కన్యదేవత నేర్పుఁ గనదు
దురితసంహార జగతి ఖద్యోతు మహిమ
యొనరు నేరీతిఁ దలఁప ఖద్యోతమునకు. ౧౬

---

* నాదనమ్రతయు-మా.

వ. ఇట్లుచితాశీర్వచనరచనాపురస్సరనిరస్సర ద్విపీతసూనృతామృతంబుల శ్రవఃపుటంబులు పూరించుచు నుదంచితరోమాంచకంచుకితసర్వాంగుండై సర్వమంగళాయుతనిజాంగసంగసంగతాభంగురసుఖం బెట్టకేలకు వదలి యమునతోఁ బుట్టువుగా రాబుంబట్టి వేల్పుగాళ్లు దిట్టఁపుటాసనంబు వెట్టిన వం దధివసించి బ్రహ్మాండభూలోకజంబూద్వీపభూపాలపురహరిప్రస్థస్థిన్నిలయతత్సభాతత్సింహాసనాశ్రయోత్తరోత్తరోత్కర్షనిష్కర్షతత్పరు లగు తత్రత్యకవులవాక్ప్రసారంబులు ససారంబులై నెలయ నుత్తరోత్తరసూక్తులం దత్కృతప్రశ్నప్రయత్నంబు సఫలంబుగా ననుగ్రహించి సహభోజనసహశయ్యాసహాసనసహసంభాషణాదిక్రియల యమాత్మజు సాయుజ్యం గృతార్థుం గావించె నిట్లు కతిపయదివసంబులు గడువ నంతట నొక్కదివసంబున దివసేశ్వరునిమనుమని యనుమతంబున మృగయావిహారవిలాససమాలింగితాంతఃకరణుండై సత్యభామారమణుండు సత్యకాపత్యప్రముఖయాదవవీరులు చేరికొల్వ బలారినందనుం డనుసరింప గుణవృద్ధిసమాశ్రయత్వంబున నానాదేశవిషయతనిర్వృత్త్యాహారవర్ణసవర్ణత మెఱయు శూరాగ్రసరులగ్రసరులై నడదేర సమానశబ్దప్రతిషేధ నిష్ఠాధారత "నిష్ఠానంజ్ఞాయాం సమాసశబ్దప్రతిషేధ" ఇతివార్తికోక్తి ననుసరింపుచుఁ దద్గుణవిషయతం గృతసర్వాదినిపాతనతవహించుట సర్వప్రాతిపదకంబు నవహసింపుచు(?) ద్వితీయవక్రతను ద్వితీయక వవర్గచతుర్వర్ణప్రతిపాదితనాదమేదురీకృత రోదసీకుహరంబు లగు కౌలేయకతల్లజంబులు మదికి నుల్లాసంబుగా వెన్నాడ వాగురజాలభ్రమ ఖ్రప్రధానసాధనసామగ్రినము దగ్రు లగు నగణితమృగయాప్రకాండు లండ గొన నామలింగానుశాసనంబు కైవడి సింహాదివర్గ సంమిళితంబై మహారాజాస్థానపగిది నానావిధకవిప్రౌఢోక్తిసంకులంబై ప్రాకృతంబు కైవడి వల్మీకభవపదానంబై తర్కంబు చెన్నున నతికర్కశప్రమేయంబై ఛందంబు భాతి మత్తేభశార్దూలవిక్రీడిత లక్షణోపేతంబై భరతంబురీతి సింహవిక్రీడితహారిణీప్లుతకరిహస్తప్రసర్పితాకలితంబై యుత్తమకావ్యంబువడువున నవాచ్యమహిమంబై యలంకారంబు తెఱంగున ననుపమవిషమవిన్యాసంబై మీమాంసక విధంబున నానాగమప్రభూత శాఖావైఖరీప్రకాశంబై పాణినీయంబుననువున వృద్ధాంగగోత్రాశ్రితంబై త్రిలింగభాషానుశాసనం

బు చెలువున నున్నిద్రప్రాణికంబై యత్యద్భుతం బగు నొక్క కాళిందీతీరకాంతారంబు ప్రవేశించి. ౧౭

—శ్రీకృష్ణుఁడు వేఁట సలుపుట—

క. పలుదెసలఁ గాపు లునిచెన్, బలియుల మృగయులను వీరబలశాసనుఁడా
జలజాతపత్రనయనుఁడు, బలశాసనతనయుఁ బిలిచి పటువేగమునన్. ౧౮

గీ. అతులచాతుర్య మొదవంగ సమ్మహాత్ముఁ
డమర ఘటియించె నపుడు పూర్వాదులందు
సంభవత్తత్త్వమయసంజ్ఞ*సరగఁ జేసి
సకలవిబుధులు వినుతింప సద్వ్య(వ)స్థ. ౧౯

క. దిక్కుల గ్రమ్మి ధటుల్ రొదల్ గ్రక్కు మ్మ్రోఁ జేయ మృగము లురవడి బెగడన్
మిక్కుటపుసుకవివాక్కులఁ, బెక్కండ్రవినీతకవులు బెదరెడుమాడ్కిన్. ౨౦

క. జలజాక్షుముఱఁది తమ్ములు, బలుమృగముల వెదకివెదకి పడఁజేసిరి దో
ర్బలమలర శాబ్దికోత్తము, లలయపశబ్దముల నెనుకి హరియించుక్రియన్.

గీ. అలసనత్త్వంబులనసత్త్వములఁగ్రియా†వ
రాశయముల స్వరాదుల నవ్యయములఁ
దా నిపాతంబులుగఁజేసి ధరఁ దదంత
సంగ్రహాయత్తమతి యైనసాధుమౌళి. ౨౨

గీ మాన్యుఁ డైనట్టి యాధ్వనిమార్గవేది, లక్ష్యమూలంపుధ్వని నవలంబనంబు
చేసి హరియించె మిక్కిలి వాసిగాంచు, తనకృతిత్వము మర్మవేత్తలునుతింప.

క. కరమరుదు కృష్ణమేఘం, బురుతరశరవర్షవైభవోదగ్రముగా
ఖరవైశ్వానరకీలలు, విరళితలై కన్నియెడల వేకననమ్యోన్. ౨౪

గీ. అవ్యయప్రకాశ మ‡విధ్యుక్తికోజ్జ్వలం, బగళితోరుసత్త్వ మంతకార్య
కరము నొచు మెలఁగె సురుచిరతద్ధిత, కృద్గణంబు దహనకీలితంబు. ౨౫

వ. ఇటు మృగయావిహారంబు కొంతప్రొద్దు గడపి చాలించి యమ్మించుమాయ
లాఁడు రాజార్హంబు లగు నామిషంబులతోఁ బరివారంబు హరిప్రస్థంబున
కుఁ బోవఁ బంచి విశ్రాంతివ్యాజంబున నర్జునానుచరుం డై కమలాసనవర
మహాంసనీలకంఠసంసేవితం బై శుకముఖసుకవినికరసముపభోగయోగ్యం బై
తనుభవశ్రాంతిసద్వ్యాపహరణప్రవణం బై శరద్రాకాశశాంకాకళంకచ్ఛా

*లలరజేసి-మూ. †పరాశ్రయములు-మూ. ‡విధ్యుక్తిమోజ్జ్వలం-మూ.

యాచోరప్రభాభరంబై తెలిదీవిపైఖరిం బరిహసించు నొక్క కాళిందీనదీ సుందరపులినతలంబున విశ్రమించి. ౨౮

క. కనియెం బద్మదళాక్షుఁడు, కననివిననిమేలుసుమమఁగల ప్రియురాలిం
గనికనఁగరాని చంచలఁ, దనులత యచలంపుఁ జోచిఁ దల మనుదానిన్. ౨౯

## —శ్రీకృష్ణుండు కాళిందిని జూచుట—

క. ఉపమానభావమును దన, కపకారముగాఁగఁ దలఁచు నపఘన మగుచుం
దపముఁ బలు *కాఁకఁ దనకై, తపియింపుచునుండునట్టి తపనతనూజన్.

క. కనికని నిరతిశయానం, దనిధిత్వ(ము) గాంచియేని కమలదళాక్షుం
డెనలేనిముదముఁ గొనుచున్, మనమునఁ గాళిందిరూపమహిమముఁ బొగడున్.

గీ. ఏతదఘనసంగతి నెట్టిముదము, †విషయివర్గంబుఁ గైకొని వేసె దానిఁ
గాంచుఁబున రేతదంగసంఘటనగలుగు, భాగ్యమెన్నఁటికబ్బునప్పటికిమగుడ.

చ. సరసిరుహాననంబుఁ గొని సన్ముఖసీమ గృహీతవాచమైఁ
బరఁగఁగ శ్రోత్రియత్వమునఁ బాటిలి పూర్ణతపంబుసేయఁగా
సరసిజగర్భ! యీయువిదచక్షుఁదనం బొనగూర్చునేర్పు నీ
కరుదు ఘటిల్లెఁ గా కరయ నల్పతపంబున నిట్టి దబ్బునే. ౩౦

ఉ. సారసగంధిమధ్యమము సంఘటియింపఁగ యోగ్యవస్తుసం
భారము లేమినో యిది యభావముచేసితె పద్మజాత నీ
నేరుపు నెట్టు లెన్నుకొన నేరఁగనయ్యెద దానిమీఁదటం
జేరి వసింపఁజేసితివి సిబ్బెపుగుబ్బలు గొప్ప‡క్రొమ్ముడిన్. ౩౧

గీ. ప్రస్ఫురద్వ్యక్తిసంబంధబలముకలిమి, నుల్లసించె నలంకృతు లెల్లఁ గాన
లలనయుత్తమకావ్యంపులక్ష్మి యనుచు,నవనిరసికులుగొనియాడుటరుదుగాదు.

గీ. అమథనావిలసింధుమధ్యప్రభూత, పద్మవాసిని యాశరత్పద్మనయన
వ్యక్తిసుందర§తాన్యకృతాఖిలోరు,భూషణత ముఖ్యకృతిలక్ష్మిఁబోలునింతి.

సీ. ఇది మన్మథాస్త్రత్వహేతు వౌటఁ దలంప మది కింపులొనరించుమరునిదంతి
దంతిగా దిది మృదుత్వంబు చాలఁ జెలంగ మరునిచేతమెలంగు విరులబంతి
బంతిగా దిది కందుపట్టుగా మిఱుంగఁ సోఁలినెదు మేలుసోగమెఱపు
మెఱపుగా దిది నిల్కడౌఁ అవుమైఁ దనరారమానసప్రియభావ మూనునంచ

*కాఁచి-మూ. †విషయి-మూ. ‡క్రొమ్ముడిన్-మూ. §తాన్యకృతా-

యుంచఁగా దిది ఘనరుచినందికొనఁగ, మధురనాదానువృత్తి చేయూన్యపికము పికముగా దిది తెలికంటిచెలువు లెనయు, నతులసౌందర్యదివ్యరత్నాకరంబు.

వ. మఱియుఁ గబరీజలధరమాలికయు నలికచంద్రరేఖయు నిరీక్షణచంచరీకావళియు భ్రూమనోరమయుఁ గపోలశోభావతియు నాసికాకనకమాలయుఁ గర్ణశ్రీకలితయు నధరమధురుతియు హాసకౌముదియు సుముఖశాలినియుఁ గంధరామత్తకోకిలయు వాగమృతధారయు దంతమౌక్తికమాలయు బాహాకుసుమితలతయు హస్తాంబురుహయుఁ గుచబాధురయుఁ దనుమధ్యాంచితయు రోమాళిభుజంగవిజృంభితయు నాభీవిపులయు జఘనఘనాభిరామయు నూరుదండకమండితయు జంఘాప్రభోపరంజితయుఁ బాదలలితయు నంగలతాచపలయు గుణమణినికరయు నగుచు వృత్తరత్నాకరకృతి నగుచున్న ది క్కొమ్మమొమ్మ, యేముద్దుగుమ్మ కైన వనమ్ముగా *నమ్మమ్మ యని మనమ్మున ఘనంబుగాఁ గొనియాడుచు నక్కితవయాదవుండు దండనుండు నాఖండలనందను వీక్షించి యిచ్చంచలాక్షి యుదంతం బాద్యంతమ్ముఁ దెలిసి రమ్మా పొమ్మా యని వినోదంబున ముదంబుగాఁ బలిచిన. ౩౬

—శ్రీకృష్ణుండు కాళిందికడ కర్జునుని బంపుట—

క. సిరికి నలవడనిశోభా, భర మీయింతికి నెనంగుఁ బద్మాక్షునకే తరుణి యిది గృహిణి గాఁ దగు, నను నా శిరమెక్కి యుండు టప్లు ఘుటిల్లన్.

గీ. ఇట్టిసౌందర్య మొనరించునట్టిధాత కమరు నస్త్రీ త్రియాయింతి హరికిఁ గూర్ప మిక్కుటంబుగ జగములో మెఱయుఁ గాని యన్యునకుఁ గూర్ప నయశోభ్బి నది యడంగు. ౩౭

క. ఈగతి నద్భుతరసనం, యోగిహృదంతరములోన నువిదఁ బొగడుచున్ †భోగిశతల్పునమపున, నాగుణధుర్యుండు వేగ నరుగుచు నచటన్. ౩౮

సీ. నభయందుఁ బాడితసంస్కృతవాణికైవడి మహాసరసిలోపలను హంసి వలె వక్షఃస్థలమున జిలుగుఁజందురుసోగవడుపున నవమేఘపటలి మెఱపు చెన్నున నాలయసీముఁ బ్రదీపంపుఁ గళికవైఖరి బోదె నలరుతీవె చెలువునఁ దరువున ఫలశాఖపోలికఁ, ‡బరమకావ్యంబున వ్యక్తిమూర్తిఁ

* దమ్మమ-మూ. † భోగిపర్యంకుపేనుపున-మూ. భోగిశ్రేష్ఠుండు అని కవిభావమై మెూ. అది యసాధువు. ‡ బరమూ—మూ.

బులినతలమున మేలఁగెనుపొలఁతిఁ జేరి, తరళలోచనవలనిసత్కార మంది
తుందిలానందమునఁబొందికుందరదన, వదనమీక్షించిమాధుర్యమొదవఁబలికె.

క. కలికి నీనామ మెయ్యది, జలజానన కన్నవారిన-జ్ఞలు కీదృ
క్షులు హేతువేమి నీవీ, పులినంబునఁ దపము సేయఁబూనెదుమతికిన్. ౪౧

గీ. తేఁటియుంటనికుసుమంబు తేట దోఁచు
నీదురూపంబు గనుఁగొన్న నిర్మలాంగి
యర్హ్వరకాంతు దేవతాప్రార్థనంబు
సేయుచుండెద వని నాదుచిత్త మొదవె. ౪౨

గీ. తన్వి యిచ్చటఁ బరమసాధనతఁ గాంచుఁ
దనువిలాసంబె యితరసాధనము లేల
యరసి చూడుము పండితురాలనైన
శుభఫలావాప్తి *బోధనకన్నఁ గలదె. ౪౩

క. నా విని తమ్ములనేలెడు, దేవునిగారాపుఁబట్టి తేటమొగమునన్
ఠీవి నునునగవుసిగ్గులు, తావుకొని మెలంగ నింద్రతనయుని కనియెన్. ౪౪

గీ. †జ్ఞాతృతాధర్మమున కధిష్ఠాన మరయ
నీకురూపంబు ‡గాకున్న మేదినీశ
యాభిరూప్యప్రసిద్ధమాహాత్మ్యమునకు
నధికరణ మౌట మాననీయత వహించు. ౪౫

ఉ. కావున నాయుదంత మవికారగుణాకర చిత్తగింపు మే
దేవుఁడు సాయగేస్తుఁడయి తెల్వి జగంబుల కెల్ల §నేను న
ద్దేవుఁడు నన్నుఁ గన్నతఁడు దీపిపాలిరమాధినాథునిన్
దేవునిఁగా వరించుకొను ధీ కొని యిట్లు వ్రతంబు సల్పెదన్. ౪౬

గీ. అసితరుచి యగునీనది కధిప నేను, జన్మదైశైకతన సహజన్మఁగాను
నామధేయంబుచే నేని నరవరేణ్య, తత్సహోదరిఁగా నన్నుఁ దలఁపవయ్య.

గీ. సిగ్గిమిత్తదయాంభోధి నీరజాక్షుఁ, దనఁగ నెఱనమ్మి మదిలోన నతని నునిచి
నాయథాశక్తిఁ గొల్చుచున్నాను నేను, భాగ్యమెట్లున్నదో కానిపార్థివేంద్ర.

క. ఎన్నఁడు పద్మాక్షుఁడు ప్రసన్నుండయ్యెడునొ కోర్కె సఫలతఁగాను టెం
కెన్నఁటికో తెలియదు నిన్, గన్నారం గంటిఁ గంటిఁ గన్నా సుఖముల్.

---

* బోదన-మూ. †జ్ఞాతతా-మూ. ‡గాకున్న-మూ. §నీను.

గీ. అనుచుఁ గన్నీరునించుచు నాననంబు, మిగుల వాంచిన యాలేమ మెఱపుఁబోఁడిఁ
జూచి తలయూఁచి యానందవీచిఁ దేలి, ప్రాఁడ్విదారబిడ్డ యా* చైత్రరాజు కనియె.

గీ. నిరతిశయ మైనసీ మేని నెఱిమెఱుంగు, నిర్మలంబైన సీభక్తి నిష్ఠఁ గూడి
రయము మిరాఱుఁగఁ దక్షరగ్రామముఁ గూర్పఁ, దక్షరగ్రామలవకు నత్వపులకు.

క. అని పల్కి కలికి యానెయ్యతి, గని తూఁకుపుఁ జాటి వేల్పుఁగవినయుదారుం
డనితరలబ్ధామోదం, బని తలయూఁచుచును వేగహారిఁ గనవచ్చెన్. ౧౫౨

క. † వచ్చిన నచ్చెలువ చటికి, వచ్చి(న) కార్యంబు రూపనైఖరి మదిలోఁ
బొద్దింబు లేనిభక్తియు, ముచ్చటకడి యుఁగ సకలమును వినుపించెన్.

చ. చెలికల వార్తయిట్లతఁడు చెప్పినఁ దప్పక యాలకించి యా
జలరుహపత్రలోచనుఁడు చక్కఁగ లేనగుఁ బువ్వుసీటిచే
నలఁతఁ దొలంగుస్త్రీము మున నాననపద్మము కన్నుదోయి మే
లొలయఁగ నింతిఁ జూడ మది కొప్పగునం పొగి నేగి యచ్చటన్. ౧౫౪

—శ్రీకృష్ణుడు కాళిందిం గొనిపోవుట—

క. శృంగారైకాశ్రయమా, నంగననెమ్మేను చూచి హరి నవరసపా
రంగత ‡ మగుననుభూతి చె, లంగఁగఁ దా మెలఁగె నట్టి రంబు దలంపన్.

సీ. నీలాభ్రమునఁ జాలు నెఱికప్పు జిగి జాలు మేలు నవ్వఁగఁ జాలు మేనివానిఁ
జలత లేక లసించు తొలిజాఁటి బఱుమించు నొప్పు నేరము లెంచు నొల్లెవానిఁ
దొలుత వేళ నెనంగు జలజాతములరంగు గలకన్నులబెడంగు గనెడు వాని
నమృతధారలు చిల్కు నట్టి చందురు కల్కు, నగెడు నవ్వులతళ్కు మొగము వాని
లచ్చిపేరాదిగల పేరురమ్ము వానిఁ, గౌస్తుభకిరీటముఖవరిష్ఠరణ వాని
సుదికి నీడగు నొకవాలు వడయు హరిఁ, విందుకన్నానఁ గన్న గోవిందుఁ గనియె.

గీ. కనియు స్త్రీవనితరహ స్పృద్ధ్యానఘటితనర్మ, దేశ సంతతదివ్యత్వదీయదివ్య
రూపజాలంబులోనఁ దద్రూపమపుడు, మిళితముగఁ గొంత సేపింతి మిన్నకుండె.

క. అంతటఁ గాంతకు లక్ష్మీ, కాంతుని నిజరూపగరిమ గనవయ్యెఁ దదే
కాంతి(క) దృష్టిప్రభావత, పొంతఁ బురందరుని కట్టి పొసఁగుటచేతన్. ౧౫౮

చ. హరినిజరూప మాహాత్మ్యముదమారఁగఁ గాంచిన కాంచనాంగికిం
బరిచితిఁ జెందవయ్యె నభివాదనవార్తలు సంస్తవక్రియల్

*చిత్రరాజు- †వచ్చియచ్చెలువ కుటికి ‡మగుననుభూతి స్త్రీవనితరహ-మా.

కరము మస్తంబులోపల నఖండితభక్తి గుదిర్చఁ జక్కునన్
హరిహరి యాఁటటంచు గనని పుట్టికచాకచి సంఘటిల్లఁగన్. ౫౯

గీ. వెలఁది "యభ్యాగతః స్వయం విష్ణు"రితి వి
చారసాంగత్య మొనరఁగఁ జలదసాంగ
వీక్షణాంభోజమాలికావిసరములను
బూజ యొనరించె నాజగత్పూజితునకు. ౬౦

గీ. కృష్ణఘనరుచి దనచెంతఁ గీలుకొనఁగఁ
జామముఖచంద్రుఁ డప్రకాశత వహించె
నిమదక్రేఁగంటిచూపులు నీలవేణి
రుచివిలాసంబు దన్మౌళిరుచి గొనంగ. ౬౧

గీ. అంబుజాననదనుఁ జకోరాక్షి యనుట, నిజముగాఁ జేయఁదలఁచి యానీరజాక్షు
వదనచంద్రునిఛాయ కవ్వారిగాఁగ, జారుకొనఁజేసెఁ దనదృక్చకోరకములఁ.

చ. అపుడు ముకుందుఁ డింతిఁ గని యంబుజమిత్రతనూజ నీదు నీ
త్తపము ఫలించె రమ్మనుచుఁ దబ్బుల లేనగుమోము గ్రమ్మఁగాఁ
* దపనతనూభవం జెనుట తద్దయుఁ గ్రమ్మ రథంబుమీఁదఁ దాఁ
గృపనిడుకొంచు ధర్మజునికేళిపురంబున కేఁగె నెమ్మిగన్. ౬౩

క. అచ్చట నారాజున కమ్ముచ్చట దెలియంగఁజేసి భూపతిమదిలో
ముచ్చట దీరఁగఁ గొన్నాళ్ళచ్చపుఁ బ్రేమమున నిలిచి యనుపతియాంతన్.

క. పురమున కేగుతలంపున, నరవరునానతి గ్రహించి నలువారఁగ న
న్నరుఁ దోడ్కొని చనువేళన్, పురజనులఁగ డాయఁజేరి భూపతిఁ బలికెన్

గీ. అనఘకృతి యపార్థ మగునేని పండిత
హృదయమునకుఁ బోలె హితము గాదు
నాదుమదికి నెపుడు నరుఁ బాపు మటుగాన
నన్నుఁ బంపి రాఁగ నరవరేణ్య. ౬౬

వ. ఇట్లు బావయగు తోవకొమ్మతోలంగుడు బావబిడ్డబిడ్డనిచే †సోమాసుల
పెట్టుంజెట్టిఁబట్టి తనవెనుకటిరాకకు నాంతిపడసి యతండు రా ‡నయ్యొడ్డ
కేల్దొరబిడ్డ ప్రామిమ్ము సొమ్ముబరణి గన్నకన్నెఁ గొని నిజపరివారపరివృ
తుండై కదలి సంద్రంపుటగడిత వడయు బెడంగుప్రోలు మేలుబాతికిం జని

* తపనతనూజధరన్ జ.బ.బ. పా. † సోమాసుల ‡ నయ్యానకేల్దొరబిడ్డ

యెంతయు సంతోషంబార నయ్యుదంతంబు నిజాంతరంగంబున నెంచి గించి తదనుమతి రిక్షనుడువులఁ దెలియం బ్రోడతొలిపుట్టువుజన్నిదంపు వారలఁ బ్రాజుల రావించి నిరస్తదోషతిమిరంబును సుగుణవర్తియు సుగ్రహస్నిహంబు నగు నొక్కసుప్రకాశ వివాహముహూర్తం బేర *వ్యాసరభాసురం బని నిశ్చయింపించి సర్వజనులం దనతన్నంబునకు రా నియమించి మీఁదటి †శక్రచక్రవర్తిం బిలిపించి తత్ప్రాలంకారంబునకు నియోగించిన. ౬౭

గీ. అన్నివింతల కాస్పదం బగుపురంబు, నందు నేవింత ఘటియింప నతఁడు నేర్చు నయిన నత్తఱిఁ బౌనరుక్త్యం బొనర్చె, నతులచాతురిఁ గొన్నిపదార్థములకు.

వ. అంత. ౬౮

సీ. వేవెలుంగులు గల్గు విన్నాణి వేలుపు ముప్పొఁదుములు నిల్చు గొప్పగద్దె ముత్తొంటిపలుకులు మొనయు వేసము వాఁడు తమ్ములనగియించుమతఘ్ఘుతేఁడు సుడివాలు పేరింటిపులుఁగు నేదునొయారి పండ్రెండురూపులబలిమికాఁడు కడలియిల్లటపల్లు బెడఁగుబల్లుడికన్ను పగలుగావించు నేర్పరుల మేటి
లెక్క పేరింటిగుఱ్ఱంబుదక్కుజోదు, చుట్ట మంతటి కనఁ దగుదిట్టసామి
చాయకైవడి వన్నెంటఁజాయరాగఁ, గూఁతుపెండ్లికిఁ జనుదెంచెఁ గూర్మిమిగులఁ

గీ. పెండ్లియఖిలప్రమోదంబుఁ బెనుచుజగతి, నఖిలజగములతండ్రి పెండ్లామునఁ గఁ బిలువకున్నను బిలిచిన నెలమి రాక, యుండువారు జగంబుల నుండు టరిది.

క. పంకజలోచనునప్పురి, సంకోచాభావ మొనర సర్వజనంబుల్
పొంకముమీఱి మెలంగఁగఁ, బంకజ*భోదరంబుభాతిం గనియెన్. ౬౯

సీ. చతురాగమానూనసారస్వతస్ఫూర్తి లోకచోట నానంద మొదవఁజేయుఁ
‡జతురాతిశతినదర్శన ఘోషవైఖరు లొక్కచో మోదంబు నిక్కఁజేయుఁ
జతురుదాత్తకవిత్వసాధునిస్వానంబు వీనుల కొక్కెడ వింత యొసఁగఁ
జతురభినయసమంచన్మేదురధ్వాను లొకపంక్ల సంతసం బొప్పఁజేయుఁ
జతురనల్పమహావాద్యవితతి నాద, మంజిమం బొక్కదిక్కున ముదికుమర్ప
నద్దిరద్దిర యోహోహో హెయరాంభళిర, యపుమునాదాత్మక బ్రహ్మమయ్యె బురము.

క. అకుటిలవ్యక్తులకైవడి, నకృతాఖిలదోషయోగ మయి సుగుణాపైఁ
బుకవుల వాక్కులు ముదమిడ, సకలజనులకుఁ జట బ్రహ్మసదనత నేమో. ౭౧

---

*వ్యాసుర- †శక్ర-చక్రీ-రరశ. ‡జతురతిశినదర్శఘోష-మూ.

ఉ. నందడి జాజిభూ(క)వరసంతతభూషణపద్మరాగముల్
పొం దగునందుఁ గుంజివురుబోఁడె లటంచు గజంబు లూని యా
సొందుచు మీఁదికిం బఱువ నూర్ధ్వగళంబున నిల్చె నవ్విరా
నందములు లేక తన్ప్రమలు సాఁకున్ను రక్తవితానరోచులన్. ౭౭

సీ. వితతవజ్రోపలావిరళకీలితములు మున్ను వీథులు ప్రాకమునకుఁ జోరవు
బహుళమహోదారభద్రేభదానవారాపగాపూర్ణంబు లయ్యె నిపుడు
బహుళమహోదారభద్రేభదానవారాపగల్ వయిగ్రమ్మ సమితనృపతి
సంబాధహేతుకసంఘృష్టణచ్యుతచారుసౌవర్ణభూషణరజంబు
లెనయ నవి పంకమై *నెరెత్తర్లఁబోలఁ, దత్క్షణంబునఁ దద్వృత్తిఁ దాల్చెవీథు
లంతటను పంకతవహించి సమితి †జన్మి, బహుళసమ్మర్దజనితోష్మబలముకతన.

గీ. లక్షణాఢ్యగుణస్థూలలక్షులందుఁ, దనరె స్వసమర్పణము పరార్థంబుగాఁగ
నఖలకృగలక్షణులయందు నధివసించెఁ, జెన్నుగ స్వసిద్ధికై పరాపేక్ష మచట.

క. చిత్రవ్యక్తుల నట వా, క్చిత్రాభి‡వ్యక్తు లేమి చిత్రం బగునే .
చిత్రవ్యక్తులఁ జిత్రము, చిత్రధ్వనియుత నర్థచిత్రత మెఱయన్. ౭౮

— శ్రీకృష్ణుని మంగళస్నానము. —

ఉ. అంతట గర్గముఖ్యు లగునట్టి మహీసురు లెల్ల వచ్చి శ్రీ
కాంత సమీపవర్తి యయి కానఁగనయ్యె ముహూర్తవేళ మీ
రింతట జాగు మానఁ దగు నిచ్చ శుభార్థపుమజ్జనంబుపై
నింత వసింపఁ జేయు మన నీహిత మొప్పఁగ మాధవుం డొగిన్. ౭౯

క. అంజనగిరితుల్యుండు ని, రంజనుఁడు జగంబులెల్ల నంజలు లిడఁగాఁ
గుంజరగతి వచ్చుచు న, వ్యంజనమున కతులపీఠి నాశీనుఁడుగన్. ౮౦

ఉ. వన్నెలు మీఱుఁడు గొన్న చెలువం గొని పొంగుచు నస్మదాదులం
గన్నయనాదిపూరుష యఖండమహోదయ యిట్టి పెండ్లి నీ
కెన్నఁగఁ దన్మహామహిమనే కద గాన ధరింపు మామె నం
చన్నలినోద్భవాదిసుర లచ్యుతునొఁదలఁ బెట్టి రక్షతల్. ౮౧

చ. దరము ధ్వరంబు నిచ్చు రొదఁ దాల్చును దా నరిగాదు వీణ వ
ల్లరియుఁగ మేళవింపు నగు నస్ఫురితాక్షర మద్ది సాటియే
సురుచిరవర్ణసన్మధుసూక్తిగళంబుల కంచు నెంచ న
ప్సరము నిచెంతి నంగనలు పాటలు పాడిరి నేర్పు మీఱఁగన్. ౮౨

* నెరెత్తర్లబోలు. † జ. ౖ. ‡ వ్యక్తిలేమి.

సీ. రమణీయనాయకరత్నంబు నంటంగ హేమవల్లికి వేళ యిదె యటంచుఁ
జంద్రరేఖకు నబ్బుసాంద్రాంధకారాభచికురముల్ దెరలించి చెగయుంచుఁ
గృష్ణమేఘముచెంతఁ గీల్కొని మెలఁగంగ విద్యుల్లతకుఁ జాలు వెరవటంచు
నిదె సర్వమంగళాస్పదునోఁదలంటంగ మందాకినియె నేర్పుఁ జెందు నంచు
విధుని సేవింపఁగ నుదారవిత్త యనుచు నీలవేణియె గోవిందు నెలవటంచు
నంబుజాక్షులు సరోక్తులాడుకొనుచుఁ, గడు ముదంబొప్ప మధువైరి గ్రమ్మికొనఁగ

సీ. స్నిగ్ధంబులై మించి చెంతలచూపులు రమణాళిలాబ్జకోరణము లనుప
*సేదనీరొగిఁ గ్రమ్మి చెన్నారు నెమ్మోము మకరందపంకజచ్ఛాయఁ బూన
ననవిల్తుపల్కుఁ బోలి నవీనపుష్పై వాలుచదువు మొదుము గీలుజక చెలంగ
బిగువు కంచుక(ము)లో బెడఁగు దిట్ట మొలుంగు జన్నుమిట్టలో కింతచలన మొంద
హారములు దూఁగఁ గౌను నసి యూఁగఁ దొడఁగ
పలచునూర్పులు పెంపెక్క బళులు సొక్కఁ
గంకణధ్వను లలితాళిగతుల నెనయ
శౌరితల యంటె సోక్ష†మహోదారజఘన. ౮౮

వ. ఇట్లు యదుకుంజరుండు నాభ్యంజనుండై యొక్కకుంజరయాన కైవండ
యొసంగఁ గొమ్మెలుంగు నండగాను ఘనాఘనంబు నను వున ధరాధరశృం
గోన్నతం బగు నవగాహనగేహంబుఁ బ్రవేశించి యొక్కమించుఁబోఁడి వల
పులు నించు మంచిగంధంబు‡టటకలిం బన్నీరుల నూనియ §గ్రస్తదగ్గఁ
జేయ మఱియొక్కకొమ్మ కమ్మతావులూను జలంబుల జలకం బార్చ నొ
క్కరంగులాఁడి బంగరురంగుల తెలుంగుల మసుంగు పడఁ జేయ దువ్వలువ కవ
యొసంగ నుత్తరాధరాంగంబుల ధరియించి కొందఱు మందయాన లమం
దానందంబున నెడనెడ మంగళారాత్రికంబు లొసంగ వాసంతికకుసుమ
విచిత్రాస్పదంబును జంపకమాలోత్పలమాలికా భ్రమరవిలసితలసితంబును
మంజుభాషోర్వశీసుముఖీమనోహరంబును నానాపదార్థసమృద్ధంబును బ్రస
న్నంబు నతిమధురధ్వనిసమాలింగితంబు నస్పృష్టదోషలేశంబు ననుగ తాళ
లాలంకారంబు నగుచు మహాకావ్యంబుతో నెక్కసక్కెంబు లాడు వివాహ
వేదిం దా నాయకరత్నం బగుట నధివసించి కొంద ఱిందువదనలు కుసుల
తడియార్చి సంస్కారధూపంబు దీర్చి జలార్ద్రానిలంబులం దేర్చి సురభికకు

* సేదనిగోని-మూ. † మోహదార-మూ. ‡ టటకంబున- § రంగం జేయు-మూ.

## — కాళిందిని జెలు లలంకరించుట —

ఉ. ముచ్చటగాఁగ నొక్క చెలి మోహనగాత్రికిఁ గొప్పు దిద్దఁగాఁ
బొచ్చెము లేని మేల్వలపుఁబువ్వులదండల గొప్పఁగొప్పవన్
మెచ్చఁగ నిల్పె నొక్క చలదీనవిలోచన సాటి గైకొన
న్వచ్చు నరాతులం బఱప వచ్చిన కీర్తులమూర్తులో యనన్. ౯౭
చ. కుటిలములైన ముంగురులఁగూడి మెలంగెడుకామినీమణీ
నిటలమునందుఁ గస్తురిని నెచ్చెలి యొక్కతె బొట్టుఁబెట్టఁ దాఁ
గుటిలతమాన ఫాలమయి కోమలచందురుఁడు వంకపూనుచుం
జటిలకలంకముం గుటిలసంగతి మిక్కిలిఁ గాంచెనో యనన్. ౯౮
క. పంకజముఖి కొక నెచ్చెలి, పొంకపుసీమంతవీథిఁ బొందుగ నిలిపెం
గుంకుమచూర్ణం బహితా, తంకముగాఁ గబరి వీరతం దాల్చెనన్. ౯౯
చ. నడుమ మహేంద్రనీలమణినాయకమౌ మగరాల బొట్టుచేఁ
గడునలరారు ముత్యపుఁజొకాటపు బొట్టు నెలంత కొప్పినన్
విడువక పీఁక నెచ్చెలులు వెంబడి జాల్గొనిరా మహాభయం
పడి ముఖచంద్రుఁ గొల్చుటకు వచ్చినసింగుశశాంకుఁ బోలుమన్. ౧౦౦
గీ. కంటఁ*గాటుకఁ దీర్చెనుగలికి యొకతె సరసిజాక్షి కింగనుగొయి†సామ్యపక్షి
దళిత మొనరింపఁగోరెఁ దాదృగీక్ష. గల్గు సిద్ధాంజనముఁ బెట్టుకరణి శోభ
గీ. ముద్దులాఁడికి నొకబోటి ముత్తియంపు. మేలుముంగర ముక్కున‡ మెరయనొప్పె
నధరమాధుర్యమాసింప నవతరించి. చెంతమెలఁగెడునమృతంపుఁజినుకనంగ.
క. శ్రీకారసామ్య మాకృతి, నేకా దగప్రికాశ నేనియుఁ గలదన్
జోక(న్ను)వీనుల(న)తులా, లోకపునవరత్నకుండలులు దైవాటెన్. ౧౦౩
క. అంజనరుచిరీవాసిత, మంజులతరనలదపాంగమంజరి మిగులం
గంజాక్షిగండతలమున, నంజన§రుచిరంపుబిందు వందముఁ జెందెన్. ౧౦౪
క. అరుణాధరయరుణద్యుతి, శరణాధరసీమఘటితసద్యోగలక్ష్మా
స్ఫురణంబుఁ గవత నొకచెలి, తిరుగన్ ఘటి(యి)ంపఁదలఁచి తెలివిన్మానెన్
గీ. తొలఁగకుండుసువర్ణబిందువులఁజెంది, మధురబంధంబుగాంచిసమ్మోదమునించి
సాధువాగ్రీతిఁగైకొన్నచానుకంచు, కంబులోఁజన్నుగవ వ్యంగ్యగతిఁజెలంగె

* కాటిక - † సామ్యసాక్షి - మూ. ‡ మేగనొప్పె - మూ. § రుతంపుబిందు - మూ.

చ. ఉరుకరిరాజకుంభములయుద్ధతి మానిచి తజ్జయార్జిత
స్ఫురితయశస్సితం బగుచు శోభిలుదానిఁ దద్వినిస్సర
ద్గురుతరసౌక్తికావళులఁ గూడుట యబ్రమె యుంచు నెన్న న
త్తరళమృగాక్షి చన్నుఁగవ దాలిచె గంధపుఁబూఁత హారముల్. ౧౦౭

ఉ. నీలపురాలకాంచితయనిందితరోచులు క్రిందఁ బర్వుచున్
మేలగురోమరాజిరుచి *మేగుచు(నుండగు)నాభినామకా
హాలములో మెలంగెడు నవారితనీలనిసంభ్రమించి యు
ద్వేలముగాఁ దదుచ్ఛ్వసితగీ విరువంకలఁ జేయు నింతికిన్. ౧౦౮

క. చారుకరపల్లవాంకిత, మై రాజిలుబాహులతిక నతివకునమరెన్
హీరమయకంకణాదులు, సారలతాంతములనేరుచాయం గనుచున్. ౧౦౯

క. మదదంతిగామినీమణి, పదపంకేరుహములందుఁ బాయక నలిచెన్
మృదుమధురనినాదంబులు, †పాదలఁగఁ హంసకములతులపూర్ణద్యుతులన్

సీ. ‡సహావసత్వతికరతనే సవతి గాదు, పంకజావాస కీర్తిశరత్పద్మనయన
నిరుపమావేలసౌందర్యనిత్యపదగ, నేని యులక్ష్మి సవతి యయ్యెందునదన. ౧౧౦

చ. ముదు(గుఁ)దవంబు(వ)క్రితయు మోయుమూని సనూక్ష్మవృత్తి తన్
వదలుచు దృశ్యతం గొనుచు వాసిగహించిన జ్ఞాగ్రికు దాఁ
బొదలుచుఁ §గార్త్రికక్షణదఁ బూని మెలంగిన యుద్ధి సాటిగా
మది ముద మావహిల్లుఁ జెలిమందిలి వేశిల దేహయష్టికిన్. ౧౧.

సీ. కమలలోచనపాణిసంగ్రహణకాంక్షి, నిరతిశయభాగ్యసద్గాత్రీశుఁ గాంచి
సలలితాకృతి ఫాలదేశంబునందు, భాను కలరారె ముత్యాలబాసికంబు

## — వివాహవర్ణనము —

క. అప్పుడు మహీసురోత్తము, లిప్పుడె సుముహూర్తవేళ యెడలే వీనఁగా
రప్పించిరి తెరమఱుఁగున, కొప్పులునుప్పను మునుం బులొప్పలు నుప్పన్.

చ. వలితెలిపచ్ఛడంపుఁదెర పర్విననెచ్చెలిమోము దాఁ గనెన్
హరిసయిదోడు శారదసునేంతరపూర్ణనిశాకమంబలెం
గలికివరాననాంబుజము గన్గొనఁగాఁ దమకించియుం దదా
కలన భరింపదయ్యెఁ బయిగ్రమ్మెడు దట్టపుసిగ్గుబత్తెతన్. ౧౧౪

*మీగు-మూ †పాదంకహంసకలము-మూ ‡సహావసత్వతిగ-మూ §కార్తికనగాతపూన-మూ

క. మధుపర్కాద్యుపచారము, లధిగతపరమార్థతత్త్వుఁ డగుచు నొనర్చెన్
మధువైరి కల్లఁ డతఁడుగఁ, బ్రథితమహాభాగ్య మొనరుబలు వేలు పొగెన్.

చ. జలరుహరాగనీలమణిసంగతహీరమయంపుఁ బాత్రిలో
జలరుహనాభపాదజలజంబులు భక్తి ప్రసిద్ధి వారిధా
(ర)లఁ గడిగెన్ దివాకరుఁడు రాణి యొసంగఁగఁ దన్మణిప్రభా
కలనఁ ద్రివేణికాజలము కైవడి పాత్రిజలంబు కైనడీన్. ౧౧౮

గీ. సాత్త్వికస్వేదమకరందసహితమయిన, హరికరాబ్జంబు ధారోదకాతిసిక్త
మగుచు నాత్మకరస్పర్శ నతిశయిల్ల,నాతి రవియిచ్చె బ్రహ్మార్పణ మ్మటంచుఁగగుల

ఉ. చేతనమాత్రి *సజ్జగతి శ్రీపతిగా మదినిల్పి యాత్మసం
జాత నొసంగువాఁడు నిజజాతిసముల్లసనప్రదాయి నా
నీతఁడె నాదిదేవునకె యింతి నొసంగినయార్యముండు వి
ఖ్యాతిగ లోకదీపకత గాంచఁడె యంచు నుతించి రుత్తముల్. ౧౧౯

క. తెర దొలఁగ నపుఁడు చెలివా, తెరసొగసులు గనఁగ మెలగఁ దీవ్రపుమరువా
తెరగలుగు(?) తెఱన సిగ్గుల, తెర తమి మిగులంగ మరిరి దెరలఁ నాగెన్ ౧౨౦

గీ శుభగుణాస్పద మైనయాసుదతికంఠ, ముకుఁ దన్మాత్ర నెప్పుడు గనిన కంబు
వెల్లు సరియగున నురీతి నింతి†కొలికి. విభుఁడుపొందుగఘటియించెశుభగుణాంబు ౧౨౧

చ. చిఱునగుతేటల న్నగుల శ్రీనిరుపొందిన ముత్తియంబు లా
నెఱనొర యింతిసూఁదలను నిల్పిన నాస్మృతిపైరమూరి య
క్కఱటిమొగు లంను వచ్చి పయిఁ గమ్మిన మించు న నా మెలంగమై
గొమ్మపులకీతఁగమై మెలఁగి గొప్పను మొగ్గలనిగ్గు నిగ్గుచున్. ౧౨౨

క. పరమాణుమధ్య శ్రీహరి, శిరమున ముత్యాలపాళ్లు చేదోయి నిడెన్
హరి(తను)వు తక్పిశింపై, కరమునదుగ నపుడు పుష్పఘనమైయుప్పెన్ ౧౨౩

సీ సవిడివారి హెచ్చరికెమాటలు తేటమాటలాఁడుల§తేటనీటుపాట
లఖిలానవద్యవాద్యారావములు సామముఖవేదరవములు భూరిశాస్త్ర
నివదముల్ దచ్చననేర్పుఁబల్కులు హాసమఘనధ్వనుల్ వస్త్రమర్మరములు
స్త్రీతభూషాగణశింజితంబులు వందిశబ్దముల్ మాగధస్వానములను
సకలసురహానిమనుజసంస్తవయుక్త
జయజయధ్వానములు నొక్కసమయమునను

---

*సజ్జగతి-మూ. †కొలికి-కంఠము ‡తీగమై-మూ. §తేటలనీటు-మూ,

క. నీలమణిమయపుస్తక, ల్పాలామణి ద్రొక్కి శౌరివరతంత్రి(తి)చే
జాలుకొనుననుగురుచులను, నీలోపల మజ్జరాగవింద యొనర్పన్. ౧౩౪

ఉ. మోదముతో సుభద్ర చెలిముద్దులగండతలంబునందు సా
మోదని శాకకర్దమము పొందుగ నించెను నవ్వులాటకై
నీదుకపోలభాగమున నిండి తొలంకెడు తేటమిన్న యో
కా దిపు డే నొసంగుసిత కాంతులు మేలె యటన్నకై వడిన్. ౧౩౫

చ. హరినను జెక్కుటద్దమున నర్మమనంటన సత్యభామినీ
విరచితసంజ్ఞ పూర్వకృతవిస్మితమైత్రియు హెచ్చరింపఁగా
స్ఫుటదరుణంపుఁ గుంకుమము పూసినఁ దచ్ఛవి యొప్పెఁ దేటి (దే)
హరుచిఁ గనంగ మోము గను నద్భుతరాగమునీడయో యనన్. ౧౩౬

చ. ముసిముసి నవ్వు తేటలును ముత్యపుఁ బాపటచేరుచాయలుం
బసగలముక్కుముత్తియపు బజ్జిగియున్ గుమిఁ గూడి ధారయై
మసలుచుఁ బోయి మింటికొన మంచిరుచిం దనరన్ వసిష్ఠుతోఁ
గొసఁగెను నైదువం గనియెఁ బుణ్యచరిత్రి మొసంగి మ్రొక్కుచున్. ౧౩౭

గీ. ప్రమథపల్లజు పెండ్లి సప్పాను భుజించు
మధురచారుకాన్నములు మిగుల మనకు నబ్బెఁ
బెన్నఁ గృష్ణుని కింకొక్క పెండ్లియైన
దొరుగనే తెంచు పుణ్యంబు దీరదేని. ౧౩౮

క. అనియెన్నుచు రుచులానుచుఁ, గొనకొనెసమయంబు లెస్సగొనుఁడా యనుచుం
దినఁదినఁగ వింత లనుచున్, జనత తదన్నానుభూతిఁ జాలం దనసెన్. ౧౩౯

సీ. మంచిభోజన మస్మైమాగధక్షితిపాలసలలితపరిణయోత్సవమునందు
నవి చెప్ప నేటికి నంతకంటెను మేలువెలయు కాశ్మీరేశు పెండ్లిబంతి
యా బంతికన్న నేమి యంతకు(మి)క్కిలి బంగాళపతి పెండ్లిబంతికూడు
అకూటపెనయేమి యంతకంటెను బాగు వంగేశు పెండ్లిలో వంటకంబు
అవినచింపంగ నహ్యామా యంతకంటె, నెక్కుడై వక్కనై నాల్కసోకఁ జేసెఁ
*బోల్కి లేనిది హరి పెండ్లిబోనమనుచు, జనులు మృష్టాన్నములఁ దృప్తిగొనిరి చాల

గీ. ప్రోలుసొరఁబడి వెడలుచుఁ బుష్పచంద్రుఁ
డుచితనోజ్జ్వలమణిసంయుతోత్తమాంగ
మభినవలతాంతవిశదంబు నగు(టఁ) బాఁప
పాన్పునగియెను పెండిలిపాను పెక్కు.

* పోల్కి పొలికి-వ్యా.

ఉ. పాటలగంధితోడ హరి పానుపునందు వసించు నత్తఱిం
బాటలగంధు లిందఱుఁ బాడఁ బాటలు నవ్వులాటలున్
మాటికిఁ గేలుదప్ప కెడమం గుడి రువ్వుదు మారునంపపు-
ఝాటపునీటు లెన్న నెక సక్కెపుమాటలు మీఱెఁ గార్యమున్. ౧౪౩

— శ్రీకృష్ణునకుఁ దాంబూల మిచ్చుట —

క. ఆమెడఁ బదినూఱులబలు, చాయలుగలవేల్పుతేఁడు సన్నగొనంగం
జాయకొమరుందు దమ్ములఁ, మాయదుభర్తకు నొసంగునభిరతి వచ్చెన్

ఉ. వేయగుపాదముల్ గలిగి విశ్రుతధీమహిమంబు గాంచఁగా
చాయపొలంతితేఁ డలఁ సంతతివై తగునీకు నెక్కుడుం
బాయవు మాంద్యకంగుతలు భాస్కజాతంద్రికి వీక్ష్య మిప్పుడే
చాయ నొసంగె దంచు హరిసాత్యకి ఖ్యులుఁ నవ్వుచుండఁగన్. ౧౪౪

గీ. మాంద్యకంగుతలన్నచో మాను జర్ఘ,సమసఁబచ్చటను వష్టి జానుమీఱు
ననుచు నవ్వేచు నుత్తరం బాడికొనుచు, హరికి నసితుండు వీడియంబమరనిచ్చె.

ఉ. తెలివి దలిర్ప నా కబలి దీరఁగఁ గృష్ణుఁడు దివ్యరత్నముం
దెలిబలు ప్రాను మోముకిటి తేటలుగల్గిన గిడ్డి నీగికి
న్వాలయఁగఁ బాచి తద్ఘ(టి)తకృత నవ్వయు తేష్టవస్తుసం
కలన సమస్తలోకముల గారవ మొప్పఁగఁ దన్ని పంపుడున్. ౧౪౬.

— అప్పగింతలు —

క. అంతట సంతటిచట్టం, బంతఃకిరణం బపారగానందపయో
ధ్యంతరమున నోలాడఁగ, సంతికపరుఁ డౌచుఁ గూర్మి నల్లునిఁ బలికెన్. ౧౪౭

ఉ. ఎల్లజగంబు లేలు పరమేశ్వర భక్తజనావనార్థమై
యుల్లలితంపు మానవసమీహితచేష్టలు గాంచుసామి నీ
వల్లుఁడవైతి గానఁ జరమాద్రికి నవ్వలఁ జిమ్మచీఁకటుల్
ద్రోల్లఁగఁ జేయు నట్టిడికటుత్వము గాంచు ప్రభల్ భరించితిన్. ౧౪౮

గీ. ఎంతకాలంబునుండియో యెదయకుండు
కటుతమోగ్రస్తత హరింపఁ బాలుపడితి
నస్తమయశూన్యమైనట్టి యభ్యుదయముఁ
జెందఁగాంచితి నయ్య ముకుంద నేను. ౧౪౯

గీ. హారణ మొక్కఁగుట మామకు న్వర్ణమిచుట, సఖలకర్తకు నీఁదగునట్టి దెద్ది
యయిన సర్వస్వసందర్శనానుకూల,దక్షిణాలోకభర మిచ్చుతలఁపు నాది.

క. హారిదశ్వుఁడు హరి నీగతి, సరసచతురవచనరచన నక్ష్మాదితుఁగాఁ
గర మొనరింపుచు నానతి, వరమపురుషుచేతఁ గొనుచుఁబలికెం గూఁతున్.

ఉ. ఓమదగణ్యపుణ్యవిభవోదయపూర్ణఫలస్వరూపవు
శ్రీమణి నీకతంబున గరిష్ఠగుణాంబుధి కృష్ణుఁ డల్లుఁడై
నామదిపూర్ణకామత ననంతసుఖం బగునట్లు సేసె నిం
కేమివిచార మీహిత మహీనతఁ జేకుఱె నీకు సుందరీ. ౧౫౩

గీ. భాగ్యసౌందర్యశీలానసవత్నివైన, చాన నీకు సపత్నులు చాలఁ గలరు
వారిమదిలోనవిక్రియోత్పత్తిగగన,కుసుమసాదృశ్య మొందింపఁగోరవమ్మ.

గీ. అంబుజాక్షి సర్వకార్యంబులందు, ననుసరింపుముహరిజాయననుసరించి
హరికథానుగతిస్ఫూర్తి నలరినీకుఁ, దల్లియగుచాయఁ బోలంగఁ దల్లి మేలు

గీ. వగలుగావించి మాయమ్మ వగలుసేయు, వాకిటి ద్దన నడచుట వాసిగాదు
మాకు వన్నెగ నంతటమైత్రిపూని, భువనబాంధవసుత యనబుద్ధిగనుము. ౧౫౫

శా. అమ్మా మమ్మొడఁబాసితంచు మదిలో నావంత యైన వ్విచా
ర మ్మానం బనిలేదు కాంతలకు నబ్రమ్మే యదెన్నంగనై
న మ్మానక భవదీయసన్నిధి జగన్నాథుండు నన్నుం గృపన్
సమ్మానింపుచుఁ బాయఁ డెప్పుడు నిజస్ఫారాక్షిగాఁ జూచుచున్. ౧౫౬

చ. సిరికి నివాసమైన హరిచెట్ట గ్రహించిననీకు లక్ష్యమే
హరణముగాఁగ నే నొసఁగునర్థము లైనను దండ్రి వట్టికిన్
హరణ మొసంగు టిజ్జగము లాగమముల్ దగఁ దెల్పు నింతె కా
దరయ బితృస్వకాంక్ష ధృఢమై మదిఁబుట్టెడు నట్టిపోటికిన్. ౧౫౭

ఉ. కావున సర్వవస్తువులు గల్గుటకై సకలోపకారక
ద్భావముకై ద్యులోకతరుబంధురధేనుచిరత్నరత్నముల్
భావము పొంగ నిత్తుఁ గొను భాగ్యవతీతిలకంబ వాని నీ
భావములో స్మరింపఁ గనునట్టి ఘటింపఁగ నానతిచ్చెదన్. ౧౫౮

క. అని చాయతోడఁ గూరిమి, తనయామణి గారవించి తరకేతుణచే
వనజాప్తు డోకవిధంబున, ననుమతి గైకొనుచు నొందె నాత్మాలయమున్.

క. మహానారాజకుమారక, మహనీయగుణాభిరామ మైథిలకన్యా
మహరణవరఖరదూషణ, సహజావైరూప్యకరణ సత్యాభరణా. ౧౬౦

గద్యము.

ఇది శ్రీరామచంద్రచరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి మాధవయజ్వ
సముజ్జ్వలకృపాపోక్షిత కటాక్షాసాదిత పాండిత్యాభరణ ప్రభంజనసం
శాబ్ధిరాకాశశాంక నిరంతరారాధితవిచక్షణశశాంక అభినవ
సన్నయభట్టారక అహోబలపత్యాహ్వయకవిమహో
పాధ్యాయభట్టారకప్రణీతంబైన కాళిందీకన్యా
పరిణయంబను మహాప్రబంధమునందు
పంచమాశ్వాసము.

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

## —॥ షష్ఠాశ్వాసము ॥—

క. శ్రీమత్పద్మజభవహృత్తామరసస్థాపకభృంగ దశముఖభంగా
శ్రీమహిత హితజనాంబుజ, ధామాధిప్రముదితాత్మ దశరథరామా. ౧

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము. ౨

క. చారుశ్రీజనికరమై, హీరావళికాంతిపూరహృద్యంబగుచున్
సారసుధాలయమై, పారావారంబుభాతి భాసిలు మఱియున్. 3

క. అర్థసమృద్ధంబై శ్రీవర్ధనచతురాస్యహర్షవర్ధనపరమై
వర్ధిల్లుచుఁ దనగృహము, మర్త్యాధికసౌధసదృశమగ్గేహంబుల్.  ౪

గీ. ప్రాప్తమండనమచ్యుతప్రాప్తిరదము, సుప్రసన్నసుసంపూర్ణసుందరమును
వీసాదృశ్యమలరారి వేడ్కనెఱిసి, యచ్యుతాంబావిచిత్రమానలరుశయ్య.

క. చారుమహాభోగంబై, భూరిశిరోరత్నకాంతిపూరావృతమై
తోరంపుశేషశయ్యం, గేరెడుసుకుమారపుష్పకీలితశయ్యన్ ౬

క. వసియించి వాసుదేవుఁడు, ముసిముసినగుమోమునందమ్మి మోదమునొప్పఁ బ్రసాదం
బనదృశకాంతావిమయు, ప్రసన్నత్వమానుబంధపటిమందెలుపన్. ౭

చ. అతికఠినంబులౌ జగతి హాటకరత్నము లంగయష్టి నీ
దతిమృదువెల్లుపొందెసఁగునైన నమంబటులేని భూషణా
వృతి కిది వేళయౌ నెటింగి *వేషసమానవిభూషణావళుల్
సతి ఘటియించు మంచు రవిజాత విభూషితఁజేసి రంగనల్. ౮

శా. సారోదాత్తవిశేషచిత్రకవిభూషారీతి నన్య † గ్గుణో
దారవ్యక్తి ‡సువృత్తి దోషరహితన్ ధన్యోల్లసత్ § న్నాయకన్
నీరేజేక్షణఁ గావ్యలక్ష్మిబలె (1)మున్నిద్రాకృతాస్వాదుఁడై
మారుండవ్వాడు చూచి రోసి పదరెన్ మన్నింప కాత్మాస్త్రముల్. ౯

క. (స)తియంగంబులఁ బొంగడెను,నతులప్రాజ్ఞావళీసముంచితవాచా
గతుల ద్వితీయతృతీయ,ప్రతిభటరహితప్రటలంక(ర)ణయుగ(2)మొనసెన్.

* వేగసమాసమభూషణా † గుణాదారా ‡సువృత్తి- § న్నాయకిన్
(1) మున్నిద్రా-,(2) మొనసెన్.

చ. చెలులయతిప్రయత్నమె(గ)జిమ్ముచుఁ గమ్మనివింటివాఁడు పూ
ములుకుల *క్రొవ్వడంపుచు(ను) ముప్పిరిఁగొన్ననురాగగర్వమున్
నిలువ(న)దల్చుచుం జెలువ నిల్చెను నొక్కఁడు గక్కరుండ నిం
తలు భళిరా భళీర మదిఁ దాల్గొను సిగ్గుపటుత్వవైఖరుల్. ౧౧

గీ. మదనుఁ డను కర్గ ధామందు గదియునేని, ప్రేమమనెడి యనువావ శోభిల్లునేని
వేకరంబుల నరదారబిగ్ధయేని, చెలువ నాటంగ లేదమ్మొ సిగ్గుకడలి. ౧౨

చ. వెనుకకు సిగ్గులాగఁ దమివేగము ముందఱ కీడ్వ నవ్యథం
జనున సహింప †భావమును సంధిలు మధ్య మభావ మైన చో
ఘనకుచ‡భారధారణము గాఁ జన దంచు వదింపవచ్చునే
ఘనతరదమాశ్రయించి కలకాలము §తుంజడి వాని గానమే. ౧౩

క. వెడవింటిజోదు విరివి, గ్లుడుసుకడం జేయఁ జేయు గుబ్బకుచ కొక్కా
క్కడు గామడకుం గడచినఁ, గడుదూరం బయ్యె లజ్జగరిమం బంతో. ౧౪

చ. అలవలరాజు పైదలి రమాధిపు(కజ్జకు) వేగఁ (1)జేర్పఁగా,
వలపుదలిర్ప నూఱటలఁ బాయుచు గుప్పెడుఁ బుష్పబాణముల్
చలనము లేనికూర్మి నవసం బయి మించిన లజ్జ జాయఁగాఁ
గలఁగుచు మోము వాంచెఁ గడుఁ గన్నెకు సిగ్గున సిగ్గులాఁడి (2)తాన్ ౧౫

చ. చెలి తలవాంచి తెల్పె బయిదల్పు గ్రొమ్ముడిఁ జిమ్మచీఁకటిం
గలసి మెలంగు పాపటచొకాటపుఁ జెంద్రపురేఖచే మనో
మిళదనురాగవైభవము మించఁగఁ జాలదు లజ్జ నెమ్మెయిం
గలుగఁగ నేర్చు నత్వరితగామిత యుంగ్రుల కెన్నఁ నం చొగిన్. ౧౬

వ. అప్పు డొక్క చెలికలువకంటి యక్కలికి నుద్దేశించి (యి ట్లనియె.) ౧౭

ఉ. క్రొత్తగఁ బ్రాణనాయకునిఁ గూడఁగ నేగెడు వన్నెలాఁడికిం
గ్రొత్తయె లజ్జ లోఁగొనుట కూర్మిచెలుల్ గడితేర్ప జేనికిం
జిత్తము రంజిలంగఁ దగఁ జేయుట యిట్టి విచిత్రలజ్జ మే
మెత్తఱినైన విన్నయది యే కను చెక్కడిమాట యుగ్మలీ. ౧౮

వ. మఱియు నొక్కయింతి యక్కాంత కిట్లనియె. ౧౯

క. ఇటువంటి ముద్దరాండ్రే, కటుతరకుచకుంభవజ్రకంజరసీమన్
ఘటియింతురు నిజలీలల, నిటునటుఁ జననీక జీవితేశ్వరుకమున్. ౨౦

(*) ద్రావ్వ. † భావము. ‡ భావధారణ. § కండిసి. (1) చెప్పగా. (2) తోన్.

వ. వెండియు నొక్కతె తేటచక్షులాఁడి యచ్చక్కనికొమ్మ కిట్లనియె ౨౧

క. నను వైనపూలపాన్పున, మనసూఱుచు నున్నవాఁడు మాధవుఁ డయ్యో
తనువునఁ గల్గుమృదుత్వము, మనమున నీ కేల లేదు మంజులవాణీ. ౨౨

వ. పిదప నొక్క బింబాధర యయ్యిందుబింబాస్య కిట్లనియె. ౨౩

క. హరిఁ గూడక తన మైకం,ధరియించఁగరాదు మేనఁ బ్రాణము లనుచున్
విరిసెజ్జఁ బొరలు నక్కట, దరియా(వక) యిట్టిలజ్జ దా నెటువనునో. ౨౪

వ. మఱియు నొక్క ప్రౌఢ యచ్చేడియకంటి కిట్లనియె ౨౫

ఉ. అక్కరొ నీవు నీమగని(యందపు)మోమ్మున లచ్చిరీతి నీ
వొక్కలఁ గుక్కుచుం దదధరోష్ఠసుధారస మానుచున్నఁ గొం
పొప్పదు నీకు మోవి దళనోదితరాగ మతండు సేయఁగాఁ
దప్పితి వంచు మాటికి నదల్పఁగ సిగ్గది యొంకుఁ బోవునో. ౨౬

వ. అంత నొక్క నిక్కులాఁడి యచ్చక్కఁదనాలకుప్ప కిట్లనియె. ౨౭

మ. కులజాధర*కహ్వారంబునను రాగోద్వృత్తి కీ వేల దా
పరముంజేసెదు మక్కువం దెలియు మోవజ్రా వృథా గాదె యొ
వ్వరికైనం గనఁ జేటఁ జొందు మదిలోఁ జాటిల్లురాగంబు శ్రీ
కరవక్త్రాంబుజరాగనామకమహాకర్ణేజపం బంబుటగా. ౨౮

వ. అనంతరంబ యొక్క పృథుశిరంబ యాకాదంబగమన కిట్లనియె. ౨౯

ఉ. ఇంతచలంబు సేయ ఫల మే మని చెప్పినఁ గాక సేసె దో
కాంతరొ గట్టివాయి యని కాంతుని నమ్మవిఁ దోఁచునమ్మ శ్రీ
కాంతుని కౌఁదలో కలరు కాంతలు వారలకెల్ల మిన్నవై
కాంతమనోనురంజనముగా సుగుణంబుల వన్నెకెక్కవే. ౩౦

వ. తరువాత నొక్క యుగ్మలి యక్కోమలి కిట్లనియె. ౩౧

క. అతినిబిడలజ్జ గా దిది, సతికి న్మదిలోన నువిద సంగమవేళం
గృతములకుఁ బ్రతికృతంబుల, దితరవ్యాపార మెడసి యున్నఁగఁ జొచ్చెన్.

ఉ. అత్తఱి నీలవేణి నగ †వాఁగుచు నచ్చెలులం గడించి యో
చిత్తజుమల్లి కల్లి విను చిత్తము నిల్పుచు నాడువిన్నదం
బిత్తఱి నాలసింపవల దెంతయుఁ బ్రొద్దు చనంగఁ జొచ్చె న
య్యుత్తమనాయకుం గదియ నొప్పుగ నెంతయు నంచుఁ బల్కఁగన్.

---

* కహ్వారము = చెవము. † వాసుచు.

మ. లలనామన్మథ*మూర్తిదృష్టి విలసద్రాగావగావేగసం
†కలనాదివ్యదవత్రపాధురి నమ్రగా ‡నీఁదితభ్రాంతిచేఁ
బ్బలెఁ గ్రొంజెమ్మట గ్రమ్మ మెల్లన రమాప్రాణేశశయ్యాంతిక
స్థలజాగ్రద్ద్విజాధినాయకమణిస్తంభంబు ౯నందం గొనున్. ౩౪

క. కేళీవేళల శ్రీహరి, నీలాగునఁ గౌఁగిలింతు నే నను క్రియ న
బ్బాలిక కౌఁగిటఁ జేర్చుచు, నీలస్తంభంబు సిగ్గునెరయఁ గ్రమ్మఁగా. ౩౫

వ. అంత నక్కాంతం గడచి సఖీజనంబు సవినయభక్తిపూర్వకంబుగా మ్రొక్కి ముందట నిలిచిన నీలవేణీనీలవేణి నీక్షించి జలజాక్షుండు నికటస్థలవిలసదుగ్రకరనందనాసుందరేందురేఖావిలాసనముల్లాసబలప్రబ(ల)విధవదంతరామోదజలధిఫేనాయమానం బగుమరిదస్మితంబు ముఖాంబురుహంబు నలంకరింప నిట్లనియె. ౩౬

క. చెలి వార్తలేమి? దేవర, గలిగినభాగ్యమున మనసు కడురంజిల్లన్
జలజాతనయన మిముఁగన, వలయుచు వచ్చుటయ కాని వార్తలు గలవే.

క. అలికుంతల క్షణదాముఖ, మలులితతిమిరంబు గ్రమ్మె నదియేమి? హరీ
తెలివిఁగొను కృష్ణపక్షము, వలగొను నీక్షణదముఖము వదలునె తమమున్.

వ. ఇట్లు సాభిప్రాయంబుగాఁ దనచతురోక్తికిం దగినయుత్తరం బొసంగు నాకురంగనయనప్రౌఢిమకు ముదంబుఁ జెంది నందకపాణి పాణివలయాదిభూషణపూర్వకంబుగా నభినవాంబరతాంబూలంబు లందఱకు నిడి వెడలి చనుసంజ్ఞ నవతరింపం జేయఁ జాయపట్టిక్కి నీచెట్టఁ బట్టినదార వంపు పెట్టినవనులకుం జనియెద మమ్మరో తిరిగి వచ్చెద మిచ్చట నుండుమని మరుంగుగాఁ బల్కి యచ్చెలులకలకొలుకు లొక్కింత వెడల ననంతరంబ— ౩౯

మ. చతురోక్తిప్రవిలాసవైఖరుల సంచద్రమ్యాభలు నర్తిల్ల ల
జ్జితసంవిస్మితకాంతమఃఖ్యాలలితశ్రీవీక్షణాళీసితా
సితవంకేరుహమాలికన్ మదనకాంక్షేయప్రభాపాళికన్
సితనీరేజదళాక్షి తేని కొనఁగన్ సేవార్హమా కానుకల్. ౪౦

ఉ. కామిత మేమియు న్ననసు గాంచనియట్టియవాప్తకాముఁడ
క్షామునితంద్రిఁ గామునిచొ కాటపుబాణము భామ చూచు చెం

* యత్న † కలనందివ్యపదత్రపా. ‡ నిందితభ్రాంతి।

తే మదిఁబుట్టువీరునియుద్ధపరాక్రమ మెచ్చ నిచ్చెఁ బో
రామికి సూనుచెంగటఁ బరాజయ మొందుట నీతియేకదా. ౮౧

క. హృదయగ్రంథి(౧)భేదము, మొదలంటఁగఁ జేయుబోధమూర్తికి నపుడా
మదవతిహస్తగ్రంథిక, వదలించు టతిప్రయాసభాసిత మయ్యెన్. ౮౨

చ. కరమణికంకణక్వణము లామధనుర్గుణక్వణంబుతోఁ
గరము ఘటిల్లఁ గేల్చుకి నొకానొక యత్నమున న్వదల్చి శ్రీ
హరి హరిమధ్య నంకతల మంద నొనర్పఁగఁ గాంత రాజిలెన్
హరిమణినీలవేదిఁ దొలఁకారెడు పుత్తడిబొమ్మయో యనన్. ౮౩

క. చెలికీలుఁగంటు మెలగెడు, నలినాక్షుని మృదుల పాణినఖరుచి రాజుల్
కిలకిలనవ్వఁ దొడంగెం, బొలుపూరెడు మేల్మి ముడిపువ్వుల సరులన్. ౮౪

వ. అప్పు డప్పురుషోత్తముండు మదనలీలానహాస్యప్రతిపాదకకృతు లగుకృతుల
నిరర్థకతాదోషంబు నిజానస్థానమహిమంబున నపనయింప నవధరించి
యమ్మించుఁబోఁడి కిట్లనియె. ౮౫

ఉ. కన్నది కన్నొకండు మఱి కన్నొకఁ డందపునీమొమునం
దెన్నఁగఁ గొన్న దీదృశదృశీహితవై యలరారు టబ్రమే
సన్నుతగాత్రి నిన్న ఖిలసద్గుణసంపద ముజ్జగంబులో
నన్నులమిన్న యంచు విబుధాళి ముదంబున నోలలాడఁగన్. ౮౬

గీ. మానవతి నీవు శృంగారమయత రసిక, చిత్తమెంతయు నలరఁ జేసెదవు గాన
నీకలంకారకృత ఘటింపనేర దెట్లు, భాసురైకావళీముఖాభరణగణము.

గీ. భూషణంబంగితధరించుభూష్యమగుట, భూషణతఁగాంచియుంగతబూననగును
అర్థములు భావకబలతాద్యములు వాని, కాంత రచియింపవే యలంకారములుగ.

ఉ. నేరుపుమీఱఁ గన్నుఁగవ నీటగు కొప్పునఁ గప్పు పూని శృం
గారము నీకు రూపుగొని గారవమొప్పఁగ నబ్భజింపఁగాఁ
జేరఁగవచ్చెనో తనదుసేవకభావము నాదుసేవ్యతన్
ధారుణి సుప్రసిద్ధముగఁ దా నొనరింపఁదలంచి నచ్చెలీ. ౮౭

గీ. ఉవిద తావకసుగుణాదియోగమహిమ, వాసనాత్మక మగురతిభావమిపుడు
రసతఁ గైకొనె నీకు నీక్రమము కాన, వ్యక్తికతఁబ మనకు సిద్ధాంత మరయ.

ఉ. నేత్రము కర్ణసంకటన నిమ్మి యొసంగెడు సౌష్ఠవంబుగా
సూత్రితరీతి నంగములు చొప్పడుపాత్రత నీకుఁ గల్గదే

పాత్రత నీకుఁ గల్గినను భామిని నిశ్చలవృత్తి నుండఁగాఁ
జిత్రము మాకుఁ దోఁచె నఁట చెల్వఁ దొనర్చెను మందహాసముల్. ౫౧

మ. రసకృత్సద్గుణమై యలంకృతిభరప్రస్ఫూర్జితవ్యక్తి యై
పొసఁగించున్ సుకవిప్రబంధముఁ ద్వదీయుం బైఁబల్కొవ్వదా
వెసఁ దూలించను గర్భకంబునకుఁ(?) దేల్పెన్ గైకొను న్వాంతగా
రసవిస్ఫూర్తి నొనర్చుగర్భకము సంగ్రాహ్యంబుగాఁ జిత్రమే. ౫౨

చ. చెలి తలవాంచి చూపెద(వొ) చెప్పఁగఁ బ్రీది సాటి దీనికిం
గలుగునొ కల్గదో యనుచుఁ గల్గమి సిద్ధ *మనర్ఘరత్నసం
కలితపుఁగుప్పె చామరముగాఁ జటయే గఁటిగొండి యంచు న
బ్బలువగలాఁడు దా †నిమిరెఁ బ్రజల్ చన కేశపాశముల్. ౫౩

ఉ. కన్నులఁ ‡గర్వుకొఁ దమముఁ గాదనఁ జేనియతీపిచూడఁగా
నెన్నదు కల్వఁ బల్కు లొకయింపుసఁబల్కిన బర్హిబర్హముం
§బెన్నరితేటలం గొనను వింతలఁగా మెఱుపుల్ ఘటించు న
బ్బన్నను కోయు నీకబరి యబ్బెను యాకటిలాత్య(1)సఖ్యముల్. ౫౪

చ. కువలయజేత నీవలఁదక్రొమ్ముడి నెయ్యపుఁగొమ్మ (2)యిచ్చుటన్
నవిధములై ప్రమాణములు సంగత మయ్యెను జూచి తెల్లసన్
నవరనిపాటటం గలుగు చక్కసిఁకుంకుమపేవిక్రమం
బవుల ఘటిల్లుమౌక్తికనరాకృతి గాంచిన శుద్ధకీర్తియున్. ౫౫

చ. స్ఫురితగుణానుగాఢరసమ జ్వలమౌక్తికరాజి సద్రసా
కర మతిచిత్రబంధ మధికస్ఫుటచారువిభూషణంబు నై
పరఁగెడుఁ గ్రొమ్ము దుత్తమనిబంధస్థితి విచిత్ర మొక్కటే
తరళమృగాక్షి కేవలము దాఁ గుటిలత్వము మానదయ్యెడున్. ౫౬

క. బిత్తరి మధురగుణంబున, నుత్తమకావ్యంబుఁ బోలు నురుభూషణమై
హత్తును ధృతి యక్కావ్యము, నొతు స్ఫుటవ్యక్తిఁ బరి యొగిమధ్యమమున్.

గీ. మగువ ముక్తాళి యిది శిరోమార్గతమును,(?)పరిప్రాప్తా...మంబు నిరతశుద్ధ
మూర్తిసద్గుణ మమలవంశాభిజాత, మెట్టు లస్వ న్నహానంద మెనయ దిచట.

సీ. నలఁత నీవేనలి నీరదపాళిగాఁ గనుమయి విద్యుల్లతాఘటనఁ జెందెఁ
గలికి నీతురుము చొక్కపుఁగల్వకుంపు ... జాఁకింపువహించెఁ జంద్రరుచుల

* మనర్ఘ † నెమరె ‡ గొప్పుకొందె § వెన్నెలతేట (1) సౌఖ్యము. (2) యిచ్చలన్

మగువ నీకబరి మన్మథకరాయుధముగా జాలువాఱలపోఁతజాను గాంచె
భామ నీక్రొమ్ముడి బర్హిబర్హంబుగాఁ జంద్రకసంబంధచారు వయ్యెఁ
జెలువ చిత్రాళిపాళిగాఁ జికురభరము, సరసతభరించెఁ జంపకచ్ఛాయఁ డాయ
వనుచునఖరోచులంతటవలపుచుండఁ, గొప్పదువ్వెనఁగోవిందుఁ డొప్పమీఱ

చ. కలికిరో మోము వాంఛఁటకుఁ గారణ మేమి కళంకిచంద్రునిం
దులఘుటియింపఁగాఁ గలుగు దుష్టుల పల్కుల సైఁపలేకనో
తెలివి(ని)దప్పి పామరు లతిత్వర సామ్యము పల్కినంతనే
కలుఁగున సాటి లాఘవము గాఁ బనియేమి మృగీవిలోచనా. ౬౦

ఉ. ఎక్కడివింత మాచలి ............ తోఁనట సాటి ప్రొద్దు రా
మిక్కిలి మారుపంకజము మిన్నక పండితమాన్య లీమృపా
వాక్యుల కేల జిహ్వ యులవర్చిరి పంకజవైరి చంద్రునే
నుక్కడఁగించుమో ............ యనందగునే పయోజముల్. ౬౧

ఉ. పంకజనీలకుంతలరుహా భావము దాలుచు కన్నదోయి మే
ల్పొంకము సైఁచునీదుముఖపూర్ణనిశాకరుఁ జూచి చూచి యీ
పంక(జబృంద మెల్లఁ దల) వంపులకుం దగుఁగాక యన్యమే
పంకజ*నేత్ర నీకుఁ దలవంపు లహేతుకలజ్జ మొత్తురే. ౬౨

గీ. వనితరో మోముచందురు వాంఛవేల, కుటిలకుంతలతిమిరంబుకొర...
...నో యనుశంకనో వచ్చుటెట్లు, నిటలపాదెందు నేమించ నేరదెద్ది. ౬౩

గీ. చెలువ ఁజ్జను మోము వాంఛితి వటన్న
నవధరించితో నీవు ముఖార్థహారిగ
విను ............ హరి దాన నెనయు నట్టు
లదియు నొకచోట దోషత నంద దశయు. ౬౪

చ. మృగమదచిత్రకాకృతిని మీఱుకలంకము దానిఁజేసి యీ
మృగ†ధరుఁడేతదా(కృతివహిం)చు నటంచును మోమువాంచుటో
మృగ మఁసుగంధ మొప్పియు సుమృష్ట మశృంగము దాఁ గలంకమే
మృగమదచిత్రకం బది సమృద్ధగుణాన్వితమా కలంకమే. ౬౫

చ. మృగమదచిత్రకానుగతి మేలగుఫాలము పిల్లతేఁటికిం
దగు లగుకేతకీదళము దా నగునం చొగి నెంచి కొప్పపే

* సెర్తి † మదుడేతదా

రగబడు తేఁటిగుం పెడసి యాడెడునందపుఁదేఁటిపిల్లల
న్నగు నగుగాదు ముంగురులు నవ్యవయోరుహవక్త్రలోచనా. ౬౬

గీ. ద్విత్వరహితంపుటాకృతిఁ దేజరిల్లి, ప్రాకృతాఖ్యాకభాషనా భావితద్వి
రేఫవైఖరి గలిగి త్రిలింగదేశ, సూక్తియన నొప్పుఁ గస్తూరిచుక్కబొట్టు.

ఉ. పిన్నఁదనంబు వక్రతకు పెనుపడం దగెఁ గాని లక్షణం
బన్న నెఱుంగనయ్యె నని యయ్యరచందురమోము సొగసీ
నెన్నడు రైజనించి కడునేర్పునఁ గైకొనియెమన్ మృగీమదా
ఉన్నతమాలపత్రరుచిఁ గీల్కొనులక్షణ మోమృగేక్షణా. ౬౭

చ. లలితపుబొట్టు ఫాలముఁ గలంకి నొనర్పఁగ నర్ధచంద్రుఁడో
దులఁ గన దన్నమాట మదిఁ దోఁచిన వాంఛితె మోముఁదమ్మి యా
యలికమునందు నందమగు *నట్టిది. బొట్టిది దోషకారియే
యిల వ్యతిరేకభావ మదియింపఁగ హేతువు కాక కోమలీ ౬౮

గీ. చవుతిదంచురుఁడలికంబుచక్కఁజూడ, మాకుపాలంభమగుననిమాటుకొనితె
యదియుపాలంభవిషయతనందకున్న, నదిఘటిల్లుటవ్యతిరేకమగునుభావ.

చ. రసవదమై మృ(దు)త్వమున రాజిలి లక్షణలక్షితంబు నై
హానన మొనప్పు సాధుకృతి నందపునీనిటలంబు దుష్కృతిం
గవరఁగఁజూచు సామిమయిగాంచిన చందురమోము నిక్కమో
యనదృశగాత్రి లక్షణము నందినయందము పొందుఁ జెందమిన్. ౭౦

చ. మొయి లెడఁబాయుపూర్ణశశిముద్దులునించు(చు) రాణనించనో
వయివయిఁ గ్రమ్ముమా చెడయవద్మముఁరీతి మొలంగ నేర్చునో
దయిత యవక్త్రపాథరము తారఁగ నీమవనోజ్జ్వవక్త్రి మే
మొయివిలసిల్లు సంశయము మేకొను నిచ్చట దానిఁ దీర్పవే. ౭౧

చ. వదన మవక్త్రపాతిమిరబంధతఁ గాంచినఁ జిమ్మచీఁకటిం
జిదిమెడుచందమోము నగు సేయక యుండు నె తప్పఁబల్కితిన్
వదనము సిగ్గుటిర్లు మయిఁప్రాలఁగ నేనియు నెవ్వాడున్ బలెం
బొదలఁగ నిర్గవేళ రుచిపూననిరిక్కలతేఁడు నవ్వనే. ౭౨

గీ. కాంతిసం(ప)న్నవస్తువుల్ గణనసేయు, వేళనీమోముతరువాత వెలయుఁజంద్రుఁ
డట్టిచోట వికల్పంబు పెట్టరాదా, సరసు లనుకల్ప మది యని చదువరాదు.

---

* నట్టిడి-

చ. నల యిది నైన మన్నయనసీరజముల్ వికసిల్లునట్లు దా
నలయ రసా(౦బు)రాశి వడి నిక్కఁగఁ బంకరుహాంబు గానిచోఁ
గలిగడు నేగతిన్ భ్రమరకంబులసంగతి దమ్మినైనచో
విలసన మెట్లు రేయి యిది వింతగు నంశయ మింతి తీర్పవే. ౭౫

ఉ. పీనులయాం దం(లం)కృతిగఁ బెట్టిననీలపయోజపత్త్రముల్
భానుతనూజ నీయసితభవ్యకటాక్షవిలాసభూషణం
బూని వెలుంగ నీక్షణము లుత్పలకాంతి భరించు నన్నమా
టానఁగరా దొకించుకయు నానఁగవచ్చు విరుద్ధలక్షణన్. ౭౬

ఉ. తోయజవైరి నై మొగము దోఁచినవేళలఁ గన్ను లుత్పల
శ్రీయుతిఁ గాంచు వెన్నలఁ బ్రసిద్ధిగఁ గ్రోలుచునుండుపుల్గులై
పాయకనిల్చు మోము నవపద్మముగాఁగ నదెట్లు తోచు నీ
యాయతనేత్రముల్ మెలఁగు నారముఖాక్షి విచిత్రవైఖరుల్. ౭౭

క. వరవర్ణిని నీనయనము, లరమోద్భవ మోముఁ జంద్రునంద మొసఁగుచున్
సురుచిరనీలపయోరుహ, సరసిరుహైకత్వజన్మసంగతిఁ దెలుపున్. ౭౮

సీ. శారదపూర్ణిమాచంద్రమోబింబంబు గర్వసర్వస్వంబు గాసిఁ జెందఁ
దరుణార్కకిరణసంధానజాగ్రన్నవ్యపద్మలాలిత్యంబు పటిమఁ దక్కఁ
జంద్రాతపాస్వాదసమ్మోదమూర్ధ్వచ్ఛకోరవిలాసంబు కొదవ గాంచ
మకరందరసపానమత్తమధువ్రతపోతలావణ్యంబు పొలుపుఁ దూలఁగ
నరి మొగంబెత్తి చూడవే నీటులాఁడి, వెడఁదకన్నులు విప్పవే బెడఁగులాఁడి
సిగ్గుపడువేళ దప్పవే నిగ్గులాఁడి, నన్ను మన్నింపఁదలఁపవే వన్నెలాఁడి ౭౯

ఉ. ఓపరిపూర్ణచంద్రవిజయోజ్జ్వలవక్త్రశశాంకబింబ నా
చూపులపేరుగొన్నపరిశుద్ధచకోరములానఁ గాంతి దా
లోపము గాంచునంచు నవలోచన వాంఛదె మోము సద్ధినం
తాపము వాప నందదకుఁ దక్కువె చంద్రుఁడు కీర్తికెక్కఁడే. ౮౦

గీ. విమలముఖచంద్రుసన్నిధి* వేగుగాంచు, కన్నులకు నిప్పుడుం బెడుకమలములకు
పాటిఁ జెప్పంగ నమరునే సాటియగును, నలకునలరెడుజలజంబు గలిగెనేని. ౮౧

మ. అరవిం ద్వైపనుఁ దొంటికన్న † నజీయా నందంబు గైకొన్న నీ
వరనేత్రంబుల కెల్లసాటి యనఁగావచ్చున్ (వ)సంకోచతన్

* చేను † నెరియానందంబు.

నరసత్వంబుఁ దొరంగి చూడ వెగటై సత్త్వాంతికిన్ దూరమై
ధరలో నుండెడు వారిజోత్పలములం దన్వీ జగన్మోహినీ. ౮౨

క. విలసనమహిమం బెంతే, కలిగియుఁ దాఁ జుట్టుఁదిరిగి కలయఁ జతురిమం
బలవడమి దూర్యశముక, జ్జలమై పై నాడు నీదుచక్షుర్యుగమున్. ౮౩

గీ. మగువ నీవు దృగుత్పలమాలయందు
మీలనాలంకృ(తి)యొనర్చ మెఱుఁగు గాదు
రూపఫలహేతువులఁ జాల రుచికరంబు
మిగుల నుత్ప్రేక్షఁ గావింపు సొగసులాఁడి. ౮౪

ఉ. అప్పతరంగల *న్నిగుల నప్పుడుఁ దప్పదు కోవ మంచు నీ
విప్పుడు చూపు చాలుకొననీక పెనంగెదొ యట్టులైన నో
రొప్పులకుప్ప కొప్పుజిగి రొప్పఁదనంబునఁ జాయ మాయఁగాఁ
దప్పక సేయ నప్పుడిఁ దప్పని తోఁచు టెఱుంగవైతివే. ౮౫

చ. చెలువరొ సర్వలోకముల చేతుల మోడ్పులు గంటిఁగాని నేఁ
గలనయినం గరాబ్జములు గట్టిగ మోడ్చుటెఱుంగ నేరికిం
బలపలగన్ను వేదిలి(యఁ)బాయుమ†నన్నుఁ గృతార్థుఁ జేయు మం
చలికులవేణి సిగ్గునకు నంజలి సేసెనఁ జక్కఁ జూడవే. ౮౬

ఉ. ఎట్టివిశిష్టదేశమున నీసుక పెంతటికాల మెట్టినో
మట్టిటుఁగా కొనర్చుచుఁ గృతార్థతఁ జెందెనొ నీదు మోవితోఁ
జుట్టరికంబు సేయుసతిసుందరమంజరపద్మరాగముం
గట్టిగ దొండపండరుచుఁ గ్రక్కున ముక్కున‡నొక్కుఁ జూచితే. ౮౭

ఉ. వీనులభూషణం బగునవీనమృదూత్పలముల్ కటాక్షదృ
గ్లీనము లయ్యె వాని కవిగీతము శ్రుత్యవతంసభావముల్
గానఁ దదంతరాయఘటకత్వ§మయుక్తము కన్నుదోయికిం
బూనిక తెప్పలెత్తి ననుఁ బొందుగఁ జూడుము సుందరీమణీ. ౮౮

ఉ. కన్నుల క్రేవఁ గన్గొనఁగఁ గారణ మేమి కటాక్షవీక్షణా
ఖన్నమహేంద్రనీలమణికీలితమాలికలన్ శ్రవఃపుటా
సన్నగభీరకూపములఁ జాలఁగ నించుచు వానిమీఁదుగాఁ
జెన్నుగ నేగి ముచ్చిలికిఁ జేరుటకై జతనంబు పూనెనో. ౮౯

* న్నిగులు † మన్మ ‡ నొక్క § మయుక్తమ

గీ. వనితయరగన్నుఁ గ్రేఁగొనిమ(న)సు దెలియ, నాత్మ భావించెదో యట్టియాత్మనీదు
తపముబట్టిని సాకారతను ధరించి, దాఁపుమంబో మరుండెమఁ బక్షుఁ గాంచె ౯౦

గీ. వాతి ప్రకృతాత్మకాప్రధానత్వమునయ, నతిశయిద్ధంబునకు వీక్షణాన్వయిత్వ
మేలదయసేయఁదలఁపవు హేతువేమి, గర్భసాదృశ్యమబ్బినకతననిటులొ. ౯౧

ఉ. చక్కగచక్కుపుల్గులివి చక్కెర రూపినయంత మెక్కి యా
చక్కి మహోక్తమాట వినఁ గతిగాని తెలుంగుగా రొదల్
మిక్కిలిఁ జేయుచున్నయవి మిన్నక యుండెమనట్లుగాఁగ నో
చక్కగబొమ్మ చక్కెరకుఁ జక్కెరయామృదులోక్తిఁ బల్కవే. ౯౨

క. నెలయందురు తామరయని, కలుగదు రీమోము బుధులు భవ్యామృతముం
చిలుకఁగరాదె మరందము, గులుకఁగవలదే బుధోక్తిఁ గుఱుచపఱిచెదే ౯౩

క. చిక్కను నాదగు భావము, నిక్కముగా నరచితంపు నతివల్లులకుం
జక్కని చెలిరో యిప్పుడు, చిక్కెదు నీమధురవచనశృంగారములన్. ౯౪

క. రాలుగరఁగించునేరుపు, చాలఁగ నాకబ్బవనదు చందురుగర్వాలు
*బేలాచల్లింపఁదలఁతు, రాతెల్లం గరఁగఁ బాట రహింపఁగదే. ౯౫

క. రూపవతి మామకశ్రుతి, కూపంబుల నమృతవృష్టిఁ గురియఁగరాదే
రూపింప నీదువదనం, బేపారెడుపూర్ణచంద్రుఁడే నిజమయినన్. ౯౬

చ. పరువము తొంచు నీరసతపట్టయి †చెక్కులఁ డంకరించి ని
ర్భరపహానక్షమాస్పదతఁ బాటిలు రత్నమయోపకుండలా
భరణము లేల వీనులకుఁ బంకజబంధునికూర్మిపట్టి నీ
సరసమృదూక్తి భూషణము చాలు నలంకృతిగాఁగ వీనులన్. ౯౭

క. శృంగారవతి కుచద్వయి, సంగత మగురీతిఁ బల్కు సంగతము దగున్
భృంగాలక నిలువెల్లను, బంగారం బైన మాట బంగారమఁటే ౯౮

గీ. అరిదిమాధుర్యము త్తరోత్తరముగాఁగ, వస్తువులనెన్నఁ బంచమీప్రథమలమరు
సార‡భూమకుఁ దన్వి యొచ్చుటకు నీదు, మధురసూక్తికిఁ బయినెన్నఁ బ్రథమసున్న.

క. ప్రకృతివికృతిస్థూల, ప్రకృతి న్నీకవిత చిత్రపద మగు ననుచుం
బ్రకృతి న్వికృతి న్మూల, ప్రకృతి న్నిరసించువారు కలుగుదు రింతీ. ౧౦౦

గీ. వనజలోచన నాదుగాయనత కొప్పి, యమళవై పాటపాడెదో యబ్రమొదవఁ
దరుణి నాగాయనతపస్సగంబుగాక, గాదవెట్టుంగ కయోగ వద్యోదవాదెపుమ.

* చేలచలింపఁదలచెదు † చెక్కులలంకరించి ‡ భూమన్న

క. చంచలనయనా చంచల, చంచల*వీణాధరించి చతురతచే నా
యించెదవో ధ్రువవీణ భ, రించెదవో తెలుపు మాదరించి కృశాంగీ. ౧౦౨

గీ. శ్రుతిపుటంబుల కమృతంపుసోన లెనఁగ, మానసాంభోద మభినవమాకరంద
మాధురులఁ దేల నీవేళ సాధురీతిఁ, దేటగీతి వచింపవే తేఁటికంటి. ౧౦౩

క. నాలుగువిధములె నభినయ, లీలలు నీకంతుఁ దెలివి లేదన వశమా
యాలోలనయన యిక్వాను, పోలినయభినయముఁ దెలుపు†ప్రొద్దుచనుటకున్

గీ. కలువకంటుక‡కిన్నరకంఠిపదము, యోగరూఢత నీయందు నొనరఁబూను
ననుచు జను లాడుకొనవిందు నదినిజంబొ, కాదొ తెలియఁగ నగుఁ బాటకతన మాకు.

మ. అతిరక్తాధరసన్నిధానమున నాసాగ్రాధమౌక్తాఫలం
బతిశుద్ధం బతిరక్త మయ్యె నిది యన్యాయం బుపేక్షింప నీ
వతులజ్ఞాననిధానమూర్తిపిగదా యబ్జాక్షి మందస్మిత
ద్యుతిమాత్రంబున దానిదోప మెడయం దోలం గటాక్షింపవే. ౧౦౬

గీ. ముదిత స్త్రీముక్కు ముక్తాముత్యమునకు, నాత్మశుద్ధగుణప్రాప్తి నగుసలద్గు
ణంబు రూపింప నన్యగుణంబుఁ గొనఁగఁ, దద్గుణాబుఘటిల్లుఁ జిత్రంబు కంటె.

గీ. జ్ఞానదీపంబున నవిద్య ననఁగ శుద్ధ, మాత్మరూపంబు దీపించు ననువుదోఁప
వెలఁది నీనవ్వు ననఁ గెంపువిచ్చిపోవ, గానన గుముత్తియము శుద్ధభానమగుచు.

గీ. వికసదంభోజపూర్ణేందువిధముఁ దెలుపు, ముద్దు పెద్దంపు నీ నెఱిమోమునందుఁ
జెలుతన వైన నిఁక నేమి చెప్పవచ్చు, మధురసామృతవిభ్రాంతి మానదింతి.

మ. తెలియక మోము వాంచుకొని తేటలనవ్వులు దేరనీక యా
వలనున నున్నఁ జంద్రముఁడు వారిజతుల్యముగాన మోము గే
వలముగ వాంచియుండెఁ దనవాసియు గల్గుమొగంబు వెన్నెలల్
‡సిలుకకయుండునే యని హసింపఁ దలంపులు నింపుఁడా చెలీ. ౧౧౦

క. ఈమూర్తిఁ బలికి య్యాదవ, సోముఁడు లేనవ్వు పూర్ణసోముని నవ్వన్
భామామణి నెఱసొగసుల, మోమునఁ జెలువారఁ దనదు మోము ఘటించెన్.

క. నెల నెలయు(ను) వెన్నెల వెన్నెలయును నెత్తమ్మి తమ్మినీటునఁ గదియం
గఁ సొగసుఁ జూడఁ గలువల, ములుకులవిలుకానికి పుష్యముచ్చట యయ్యెన్.

గీ. అజ్జగద్గురునుపదేశయత్నమహిమ, భావమున నించు ప్రేమానుబంధపటిమ
వారిణలోచన తాదృశాత్యంతిలజ్జ, విప్పుచూపఁగ సాగె నవిద్య పోల్కి. ౧౧౩

---

* వీణాకా- † ప్రొద్దుచ్చుటకు ‡ కిన్నరకంటి ‡ సిలుగక.

క. ఆపడఁతి కొంతలజ్జకు, లోఁబం బెనయంగఁ బ్రేమలుప్పతిల్లరసై
దీపించు బదు లొసర్పఁగ, వ్యాపారము దక్కి కృతము నామోదించున్. ౧౧౪

సీ. సుకుమారవర్ణసంఘటితస్వరూపంబు లలితప్రసాదనలక్షితంబు
ద్రుతికరమాధుర్యధుర్యస్వభావంబు సవిశేషపరివృత్తిశాంచితంబు
సతతిరక్తస్ఫురితవాచ్య మవిహీనదోషసర్వస్వంబు రపికానురంజనంబు
నగుచు సత్కావ్యంబు నందంబు గాని యేని సవిమ్మష్టసద్విధేయాంశమగుచు
ప్రీపదసై పునర్దీప్తి విస్తరిల్లి, భూషణస్ఫూర్తుల కనంగపోషణముల
కాటపట్టయియొకవింత తేటఁగానిమె, మోమునీదని వెన్నుండుమూరుకానిమె.

గీ. సాత్త్వికస్వేదజలసుధాశ్రయుతఁగాంచు, నలికచంద్రుఁడు విశదముక్తాళిపేరు
గన్నయామ్తియపేశలకాంతిధార, ఘనపదంబునఁబ్వాంచెఁ గలికికంటె. ౧౧౬

మ. *ఉపమానాన్వయరూపకస్ఫురితసై యొప్పారుచుం జిత్రకం
బపరక్లిష్టతఁ జెందె నేవియును †వక్రాభిజ్ఞమా భాగ్యవ
ర్ణపదత్వన్నిటఁ స్ఫురత్తనకపత్రంబంచుఁ బద్మేక్షణుం
డపరిచ్ఛిన్నరసాదృతాశయత ముద్దాడె న్నిటాలస్థలిన్. ౧౧౭

గీ. చాన మోము విశేషోక్తిఁ బూనదిపుడు, సామ్యమందమిగుణహానిజాడఁజొరమి
సునయనాంజనకవులకుఁ జూడనమరు, భావరసదృష్టు లందుటఁ బద్మనయన.

చ. భ్రమరవిలాసముల్ సభరభవ్యతరోత్పలమాలికల్ కటా
క్షములన చేసి మీల. ‡వికస్వరత ల్లలితంబుగాంచ నే
త్రములు భళీర వైదుషి యుదారత యంచు చొగి నెన్నుచున్ రమా
రమణుఁడు చేసెఁ దన్నయనలక్ష్మికిఁ జుంబనలక్ష్మిఁ దోడుగన్. ౧౧౯

క. కంబుధరాధరసంగతి, తాంబూలరసంబుసోఁకి తరుణేందువిభా
చుంబితనీలాంబుజీములు, చుంబించెను సూర్యజాతచొక్కపుఁగన్నుల్.

క. హరికృతచుంబితపరిచిత, సురుచిరతాంబూలరాగశోభితదత్తుల్
తరుణ(శశి)కిరణచర్వణ, నిరతచకోరములనీటు నెఱపఁ(గ)సాగెన్. ౧౨౧

గీ. మురవిభంజనుఁ డవ్వేళ ముద్దుగొనఁగ, రమ్యతదధరపీటికారసము నయన
పద్మములనత్త నుద్వేలబహుళరాగ, రసము వెలికుబ్బెనో యనరమణఁగాంచె.

---

* ఉపమానస్వయం † వక్రాభిజ్ఞ ‡ వికస్వరతల్ నిలతంపు.

క. పంకజముఖి కనుకాటుక, పంకజలోచనుని మోవిపయి నవ్వేళం
బొంకము యి కనఁగనొప్పెఁ, బంకెనవిరిమీఁద మెలఁగుమధుప మనంగన్.

గీ. స్వాంజనాతిచలేక్షణసంగమమున, నతులరాగాధరము కప్పు నందె నపుడు
సాంజనాతిచలేక్షణసంగమమున, నతులరాగాధరము కప్పు నందు టరుదె.

గీ. అబ్జహితనందనామణి యనుభవింప, మరుఁడు మాధుర్యరసముంచి మూసివిడాంక
ముద్రయిడి నిల్పు రాజిల్లు విద్రుమంపు, నాళమన నొప్పెఁ గాటుకనలుపు మోవి.

ఉ. కాటుకకప్పు మోవిజిగి గాదిలినవ్వుచు బొత్తుఁగూడుచుం
గైటభదైత్యవైరిముఖకంజముఁ నం దనరారెఁ జూడఁగా
*మాటికి సాటియైన రసముఖ్యము లాదిమశోణసుభ్రముల్
మేటిప్రబంధరాజమున మేళన మంద్గి మెలంగుకైవడిన్. ౧౨౬

మ. తొలుత న్నందునియింటిలోఁ మెలఁగి నీతోఁబుట్టు కాళిందితీ
రలసత్కాననభూమి గోగణము సంరక్షించి తీమీఁద నీ
వలచుం జెక్కిటఁ గేళికత్రమకరీవారంబు పాలించెదం
గలకాలంబును బాసుపాల్యమె కనంగా నోఁచితిం గోమలీ. ౧౨౭

గీ. భవ్యగండద్వయికిఁ గేళికత్రములకుఁ, బొందుఁ గొనఁగూడదన్యోన్యభూషణంబు
పుట్టు మొదలుగఁ బలుగండములకు నోఁచు, నట్టియవిభూషణతకర్హమునఁ గనగునె.

గీ. అతులవాసన నచలభావానుభూతి, ఘనమమార్దవగుణమున నప్రతీత
తాళతళ్యంబుచేఁ గదా తరళనయన, గలిగె నీచెక్కులకుఁ జంద్రఖండసంజ్ఞ.

గీ. అసితపక్ష†లగ్నతుహినాంశుఖండ, తుల యొనంగిననమృతంబు దొలుకవలదె
కలిమి లేములు దెలియంగవలయు మాకు, ననుచుఁ జెక్కిలినొక్కె శ్రీహరి ముదమున.

గీ. మించుటద్దంబు నీచెక్కు మించునంచు, నెంచుకొనవిందు నదినిజమంచు నెంతొ
నిందుబింబాస్యనా మొగంబిచటనిలువ, నమలినచ్ఛాయ ప్రతిబింబమబ్బె నేని.

గీ. ప్రకటదర్పణరుచిరేందుఖండకలములకు, నువిద నీచెక్కుల(కుఁ)బొనరుత్వమనుచు
బుధులువల్కుదురిటదోషబుద్ధివలదు, శాస్త్రమరయంగ విస్మయస్థానమగుట.

చ. నిటలతటంబునన్ మెలఁగు నిద్దపుఁగస్తురిచుక్క‡బొట్టులోఁ
గటికికలంక మానసుచుఁ గ్రమ్మితిఁ జుంబనవాంఛ నంశయం
బటమటమే కలంకపద మంచితలక్షణమే వచింపఁగాఁ
*కుటిలవినీలకేశి యని కుర్మి నొనర్చెను జుంబనం బటన్. ౧౨౮

---

*మాటపటాటమైన †గళతుహినాంశు ‡బొట్టు

క. *పాయుద్ఘ సంహాస్ఫురణముఁ, బాయ దసంకాశరూపభావాస్పదతన్.
†ఏయనువు మంగలమహా, శ్రీయనసత్కృత్తి యమరెఁ జెలి వీనులకున్.

ఉ. ఇంచుకయేని లీలఁ గొన దృక్కులు వీనుల కేఁగుదెంచి నీ
యంచితనేత్రముల్ దలఁప నంతికకర్ణమహాధ్రుసన్నిధిం
బొంచెను భీతిఁ గూపములఁ బొందవు నేత్రము లంచు మీఁలస్రు
క్కించినవాని కట్టిభయకీర్తన మొప్పఁగ కాచె సత్కృపన్. ౧౩౫

ఉ. కర్ణవతంసనామ మిటఁ గాంచెద దృక్ప్రభ యంచు విచ్చి య
భ్యర్ణము సేరెఁ గావలయు సద్దిర యాయసితోత్పలంబు దృ
గ్వర్ణపరంపరాంతరధివాసతఁ గైకొని లీన మయ్యె ని
క్కర్ణమునందు భూషణ(త) గైకొను నేకరణిం గృశోదరీ. ౧౩౬

గీ. కర్ణమునఁ గల్వకనుచాయఁ గప్పుకొనఁగ, మీలితంబయ్యెఁ గంటికే లాలితాంగి
యింతిసామాన్య మిచ్చట నేలకలుగు, సహితధర్మవిశేషసంబంధ మెడయ.

గీ. బ్రహ్మమనవొప్పశ్రుత్యంతలక్ష్యమగుచుఁ, దనరు నిక్కల్వ శ్రుత్యవతంస మగుచు
నుపనిషద్రీతి నిది మన కొప్పఁబలుకన్, వేత్తృవేద్యంబులకు భేదవిదళనంబు.

గీ. తన్వి యాకల్వ శ్రుత్యవతంస మగుచు, నాత్మరూపంబు లక్షింప ననుచితంబు
ఇచట రూపంబు లక్ష్యత నెనయ దెట్లు, దృష్టివిక్షేపమున నది తేటపడదు.

చ. కలువలు వీనుల న్మలఁగఁ గారణ మేమి విభూషణంబుగాఁ
బలుకఁగ సాహసంబు గద భావము నీయది యేమి తెల్పవే
తెలిసెను గల్వ కన్నులకుఁ దేటల సాటగునంచుఁ బల్కుచోఁ
దెలివికిఁ దప్పవారలకుఁ దెల్వగఁ జెంతల వాని నుంచితే. ౧౪౦

క. అతినిమ్నశ్రుతికూపం, బతిపూర్తిగ మెలఁగి పైకి నడరుశుచిరసం
బతితీవ్రత వెదలించిన, గతి నున్నది వీనులందుఁ గలు వోచెలువా. ౧౪౧

చ. సురుచిరహీరనీలముల సొంపగు కమ్మలకాంతిధార యే
కరణి వెలుంగుచున్నయదొ కంటివెఁ దామరకంటి శ్రోత్రకూ
పరమణమాధురీరసము పైకిఁ గడంగుచు జాలుసూపె జ
న్యరసముతో ననం దగిరె నం చొగి నంటుచు రెండువీనులన్. ౧౪౨

క. అలఘువిలాసత నానా, కలితాజరభాంచితత్వాగమకలితగా నే
వలసున జంపకమాలా, లలితత్వము నీకు నాన లాగెం జెపుమా. ౧౫౫

గీ. సుఖదమరుదంచితస్పర్శశోభితంబు, సవ్యపహితస్ఫురద్రసం బవుసుమంబు
కైశికీవృత్తి యన నాన గదు వెలుంగు, నొకనరంధ్రత వదలకయుండుఁగాని.

గీ. మధురిమంబున నీమోవి మధురిమంబు, శంకపడఁజేయు నాసికాచంపకమున
వెడలి మొకరించినిలిచినవిమలమాక, రందబిందువు నాముత్యమందమొందె.

క. బిత్తరి నీనేత్రంబులు, ముత్తియపుంజివ్వ లనఁగ ముద్దుగులుకు నీ
ముత్తెము జన్యము గాదా, హత్తినప్రేమమునఁ జూడ సర్వము గాదా.

చ. అని వనజాక్షుఁ డంచితముఖాంబుజహాసమరంధపాళితోఁ
మనమున రాగసంపద యమందతఁ జెందఁగఁ జిన్నినవ్వుతోఁ
జెనఁగొని ముత్తియంబు నొకవింతయొయారము దాల్ప నానవా
ఖని యగునాసపై వదనకంజముఁ జేర్చుచు మాటిమాటికిన్. ౧౫౯

గీ. ఉవిద మద్బాహుసంవాసయోగ్య మగుటఁ
బ్రతిభటస్ఫూర్తి సైఁపనిప్రభలుగొనుట
వేడ్కఁ గంఠంబుఁ గనఁగ నిన్వేళ నాదు
పాంచజన్యంబు మదిలోనఁ బాదుకొనియె. ౧౬౦

క. సతి నీముకొలికి కువమే, యుత యర్థమె యొక్కభంగి నది యొప్పంగా
సతిమృదుతన్ సుస్వనతన్, వ్యతిరేకం బచుచుఁ బలుకు నది చిత్రంబే.

గీ. కలికి కలుగమ లగుఁగదా కంబువునకు, నాత్మహావప్రబోధంబునందు నెపుడు
గాన జడమగునది యెట్లుగాంచుసాటి, యాత్మహావప్రబోధంబు నందు మెడకు.

గీ. అర్ధనిద్రాన్వితం బగు నారకంబు, పతివ నీకంధరకుఁ జాల నలికియలికి
యట్టిదానికినుపమానతాన్వయంబు, గగనకుసుమంబుతో మైత్రిఁ గాంచుసుమ్ము.

ఉ. చుంబితమై రొదల్ సెలవఁ జొచ్చినకంబుప్ర*తోడిసాటి కం
తంబున కందఁజేసెదఁ గటా కట †మచ్చికయూని పల్కుచో
క్కంబుగఁ బల్లఁగాఁ దలఁపుఁగాంచి యకార్యము గాక కార్యమే
కంబువుసాటి కీర్తికరమే యది తీయగఁ బల్ల నేర్చునే. ౧౬౪

గీ. సరసిజానన నీకంఠసరణిఁ దెలుపు, ప్రస్ఫురద్వర్ణమాధుర్యవచనములకు
సాటియగు నెట్లు తతవాద్యజాతరవము, మధురమే నియువర్ణతమానదెపుడు.

---

* తోటిసాటి † మచ్చినయూనిపల్కుచోకంబుగ

క. ఓసరసురాల నిజముగ, నీ *సరసపుఁగొలికి పెసలు నెత్తిపలుకులకున్
దోసము సరియన్న రసా, భాసాస్పదసుకపి కాదికత్తిస్వనముల్. ౧౬౬

గీ. తరుణి తలఁప వనస్థచేతనత నుండు, శుకము పికముఘనాగమస్ఫూర్తి నెసయు
మఱియుఁ బికమెల్లు త్వద్ధ్వని నెఱి నెసంగు, నీకు గళసూక్తివలెనట్లు గంపుగావు.

ఉ. తావకకంఠనిస్సరితమద్ధుంబితభారతి సద్గుణత్వసం
భావితమైన దోషముల భాసిలు దోషగుణత్వదూరతన్
భావుకు లెన్నదోషముల బజ్జ మెలంగదు దోషమా గుణం
బూన దిష్టగుణమే కాను నంచు వచింతు రుత్తముల్. ౧౬౮

క. నీరసములు గాన నలం, కారము లివి గావు నీముకంఠంబునకున్
సా(ర)రసోత్కృష్టగుణా, ధారము లగుసువచనములు తగుభూషణముల్.

క. పటుబాధస్ఫురితము లు, త్కటబహుకసవస్తుసంవిధానకుములు ల్
†త్రుటితాసారా(?)రంధ్రము, లటు నుగుణములు విఘటిల్లునని గాసొమ్ముల్.

సీ. అనుకరణంబుచే ‡సగృహీతసంస్కారముఖనిత్యదోషసంస్ఫురణ మఱచి
శబ్దత్యాగమై శారద్యమున శ్రుతికట్వాదిదుష్టత కాకు సేసి
యంగాంగితాకథనాదిసాధనముల రసదోషనిచయంబు రాణఁగుంచి
వ్యక్తవాచ్యార్థప్రబంధాఁటీగతి గచనాద్యనర్హత రహి హసించి
రసిక కౌనసఁ ద్రిప్రకారత ఘటిల్లి, నాల్గువిధముల రచన మిన్నానసంబుఁ
గొంచు నీకంఠమున నిస్సరించు ననంచు, వినికి నాకగునదిగొల్లి కనువుసొమ్ము.

చ. అని వనితానురాగరసహర్షసముత్కటమానసంబుతో
వనజదళాక్షుఁ డత్యతిపబంధురపేశలకంఠనాళముం
దనముఖపద్మసంగతినిఁ దద్దయు ముద్దుఁదనంబు గుల్కఁగా
ఘనకరివాబ్జసంభరణకౌశలహస్తము మెచ్చఁ దార్కొనన్. ౧౭౨

చ. కుచపదమండలంబున నకుంఠసజాతివిజాతిభూషణ
ప్రచయము శ్రీరసీరనయభావముతోఁ దిలకంబులక్రియా
ప్రచితము నాచు సద్రసము భాసిలఁజేయుచు దోషవిక్రియా
వచనము దూరమై మెలఁగ వర్తిలుచున్నది కంటివే చెలీ! ౧౭౩

సీ. నిరుపమనానాసణీఁచిత్రరుచిరాజి దంబుమీఱిన రోహితంబుగాఁగ
భావనాతీతసల్లావణ్యపూరంబు సౌదామనీలతాచ్ఛాయగాఁగ

*సరసులకొలికి †త్రుటితనిస్సారరంధ్రము- ‡సవిగృహీసంస్కా-

నక్షత్రమాక్తికహారాళి సాంతతధారఁ బయోధరాంతరములఁ గాఁగ
ముక్తాళిమధ్యగశోభనహీరముల్ లసదురువక్త్రోత్పలములు గాఁగ
లలితరుచివక్త్రశశిమండలంబుదిగువ, దండిమీఱుపయోధరమండలంబు
మా(మ)కమనోరథచ్ఛలమహితసస్య,ఫలము లెల్లను మిగులనిమ్మన్నయుంగ.
క. ముక్తాహారము లివ్వి వి,విక్తచ్ఛాయలు ఘటిల్లి వెలయఁగఁ జేయున్.
ముక్తాపద(?) మన్యమణీ,రిక్తత గన నీనముద్ధరించిన కృతులన్. ౧౭౫
గీ. పూర్వపూర్వవిశేషత పోనఁగె నుత్త,రోత్తరంబున కిది భూషణోత్తమంబు
నాతి యేకావళీభూషణంబు దీని,గన్న రసికులమది మోద మెన్నఁ దరమె.
గీ. రమణి! దీపకభూషణరత్న మిద్ది, మంజులైకావళీయోగమహిత మగుట
మాలికాదీపకం బాచు మామకీన, మానసము నాత్మనిష్ఠతఁ బూనఁజేసె.
క. *అరయ సరసత్వఘటకం, బురుతరలోజ్జ్వలితంబు నొప్పగు సుగుణ
స్ఫురణంబున నేకావళి, పరమాలంక్రియలలోనఁ బర్వేందుముఖీ ౧౭౮
చ. సురుచిరపద్మరాగపరిచుంబితనీలనిబద్ధహారని
ర్భరరుచిరాజి వింతకనుపండువు సేసెఁ ద్రివేణికైవడిం
గర మనురక్తి నేతదవగాహన మొందె మదీయభావ మ
బ్బురమె నిరంతసౌఖ్యరమ పొందుట యిత్తఱిఁ గామినీమణీ. ౧౭౯
గీ. లేమ నెలచాలఁ దారావళికిఁ బ్రకాశ,మబ్బుటరుదని యెంచంగనగు నెచూడఁ
దదురురోచుల నెనసి యుద్ధతపుంజక్ర,వాకయుగళంబు జోదయి వఱలనరుదె.
క. లాలితకుచపదమండల,మాలి నలంక్రియలు చాల నొప్పఁగఁ జేయున్
†బాల వీక్షింపు ముపమా,మాలనములఁ బొందుఁగొనుట మెచ్చు తలంకా
క్ష, ఇక్కరణిఁ బలికి యమునతి, చక్కనిరవణిమునఁ జిక్కునదలింపుమఁ జన్
జొక్కపుంబూతుత్తుల పై,సక్కొనఁగాఁ జేసెఁ గన్నునెజతుమ్మెదలన్.
క. మించి మహీధరగర్వ ము,డంచుట నిరమిత్రమా మిటారికుచంబుల్
కంచుకకవచం బేల ధ,రించెను గాళింది విస్తరించి తెలుపవే. ౧౮౩
ఉ. రంగు లెసంగుమేను మది రాణవహించుదృఢానురక్తిచేఁ
బొంగఁగఁ దద్బలంబునన పుట్టినతత్తనుకంటకంబు లె
క్కం గడుదుర్బలం బగుచుఁ గాంచనకంచుక మిద్ది పక్షుసఙ్
భంగముఁజెందెఁ గన్గొను మభంగురలోలకటాక్షవీక్షలన్. ౧౮౪

*అరస †బాలావీక్షిం-

గీ. చక్రవర్తిత గాని యరిచక్ర మణఁచి, కటుమహాభోగమున నురోభద్రపీఠి
రాణఁ జేకొను భూధరరాజమునకుఁ, గొంకచాఁటున మెలఁగంగఁ గొదవగాదె.

కం. ఎడకు డిగి కూడ మఖశశి, నడఁచి జయింపంగఁ దలఁచు ననుచును జెలువా
కడుఁగంచుకజాలములోఁ, బడనిడి కుచకోకములను బంధించితివో. ౧౮౬

శా. కాంతాపీనకుచంబు లాకృతిచమత్కారంపుగూఢధ్వనుల్
కాంతాసన్నిభవక్త్రినం చొగి నలంకారజ్ఞు లూహించుదృ
ష్టాంతవ్యాహృతి సార్థకంబుగ మదిం, జాల న్విచారించి యో
కాంతారత్నమ కంచుకాకృతిఁ బరిష్కారించితే గుబ్బలన్. ౧౮౭

గీ. నడుమ నెడుమిన్నుపైఁ దప మొడయ కెనయ
ఘనఘనత్వంబు ఫలమయ్యెఁ గాని సూక్ష్మ
సూక్ష్మత ఘటిల్ల దని లజ్జ సొగియ యవిక
చాఁటు కుచమందె నో యది నంది నరుదె. ౧౮౮

మ. అతిసూక్ష్మం బగుటన్ రహస్యతమమై యాఁగా స్వరూపంబు మా
నితిగా దానిఘనాంగతం గొనుచు మన్నింపంగదా సౌఖ్యముల్
సతి నీగుబ్బలు గొప్పగొప్పలగుఁగా స్వాయత్తసంరక్షకై
యతిగోప్యాకృతి మాని యుండు టరుదా యాత్మ న్విచారింపుమా. ౧౮౯

మ. అలగూఢధ్వనికి న్నిదర్శనము దా నాచుం జెలంగుంగదా
బలుచన్నుంగవ మున్న నే నిపుడు తద్భావంబు నైఁవ న్మను
జ్జ్వల*రీతిత్వము నీవు మెచ్చుకొన సంపాదించెద న్గంచుకా
కలనం బాఁపు చగూఢమైనధ్వనితో గారాపుసాదృశ్యమున్. ౧౯౦

గీ. అనుచు హృద్గతతద్గ్రంథికపుకువికల, భావమొనగూర్చికంచుకావరణముడిపి
పరమకారణ మగ్గువెల్వ బయలుపఱిచె, సత్కుచాత్మస్వరూపంబు చాలఁ బ్రీతి.

కం. కలికి చిననాఁడు చేతికి, బలుగుబ్బలి మేలుపూలబంతి యగుంగా
యలచేతి కిపుడు కుచమిది, బలుకొండై మేలపూలబంతియు నయ్యెన్.

గీ. మేలుబంతుల నెల్లను గేలిసేయుఁ
బ్రాయమెక్కినకొలఁది నీబలుకటికిత
నంబు గాను సూక్ష్మమొక్కగుణంబు సొరగ
నెనయు దపకాశసద్వృత్తమెట్లు కుచము. ౧౯౩

---

*రీతిత్వము

ఉ. కొండలనైన తీవవిరిగుత్తులకైవడి మీట రాజవే
దండముగాఁ దమిల్ విరియఁ దాఁకఁగ దక్షతఁగల్గి మీటి యొం
డొంటిని డాసి మా తెఱుఁగఁ గాంచెదు కోడెమిటారిగుబ్బలో
యండజయాన హస్తగత మధ్యముసూత్రమ దెద్ది తెల్పవే.

క. పాలిండ్ల మరగి తిరిగి(తి,) హేలావతి(చి)న్నయప్పు డిప్పుడు నీమే
ల్పాలిండ్లు మరగి తిరుగఁగఁ, బాలయితిం గదవె కోర్కె ఫలియించంగన్.

గీ. మగువ! యేతత్పయోధరమండలంబు
బహ్వాధరహ్రస్వమోదంబు బలియఁజేసె,
మదిరనేత్ర పయోధరమండలంబు
బహ్వాభిన్నోదహేతువై పరఁగు టరుదె. ౧౯౬

క. గురుశుశ్రూషణ మవనిం, బరమసుఖం బిచ్చు ననుచుఁ బలుకుదురు బుధుల్
గురు(వ)కుచశుశ్రూషన్, సంతతయసుఖంబు మాకు నెలకొనదె చెలీ

గీ. అదరి ద్విజరాజచక్రంబుఁ డండఁ జేసి, హృమలతరసుమనఃపఙ్క్తి లోఁదగఁజేసి
మిగులనుద్ధతిగొన్న నీమెఱుఁగుగుబ్బ, మగువ మర్దింపఁగుమార్గ మానఁదగునె.

సీ. కుచములు గిరులన్న గొబ్బునఁ బరువత సాదృశ్యహేతువై చాలఁదోఁచుఁ
దోఁచిన మృదుతనూద్భూతకుచంబుల కదియైన వైషమ్య మనెడుశంక
బలుకుచంబులఁ పూలబంతులైన మృదుత్వమచ్చటఁ గారణం బనెడు తెలివి
వివరింపనత్తెల్వి శమతకవశాత మంబరకుసుమంబ యనెడు మనసు
శీలఁగైకొని మదిఁ బరీక్షింపఁ దెలియఁ
బరుషభావమృదుత్వ*పద్వర్తులత్వ,
పీనతౌన్నత్యములఁ గొన్ని భేదము లిటఁ
గరణములు మాటికని చన్నుఁగవ గ్రహించు. ౧౯౭

మ. బలుకొం డొక్కటి మన్న నాకరమునన్ బాగైనపూబంతి నా
విలసింతుం గద మెల్లుచంబు లివి యీవేళం ధరాయత్తత
స్వాలయ స్వార్థవమేని తత్సదృశత న్నిర్మింతు సక్రాంద క
స్తలపొందున్ జనియించె నంచు హరి మివ్వాగుబ్బ లొత్తుం గదున్. ౨౦౦

గీ. అతికఠినపీనవక్షోరుహద్వయీని, మర్దనము చేసి చేసియు మటియు మటియుఁ
గాంచుచుండు నాడు మ్రోక హాసతం బమితి, చిత్రము దియ నికు చపీకదెలఁగ [illegible]

*సద్వర్తులత్వ-

సీ. రాజోడునాయకకూడి జొబ్బిల్లెడు సుగంధభూరిపంకంబున బ్రుంగిబ్రుంగి
కమనీయకుసుమసంగ్రథితకందుకముల నలరులీలల వాడ నాడియాడి
గుటతరమత్తేభకుంభస్థలంబుల నెఱి నాక్రమింపంగ నిక్కి నిక్కి
యతిఘనాత్యున్నతాహార్యరాజంబులఁ దనయ తత్పద్ధతి దాఁటిదాఁటి
శ్రమజలం బూర నొమ్మొక్కి చక్కనిలుచు
కుచకిశోరంబులను జూచి కోర్కెమీఱ
ముద్దు గొన *మనసుబ్బెను ముదిత యనుచు
ముద్దుఁ జనుదోయి శ్రీపతి ముద్దుఁగొనియె. ౨౦౨

గీ. చంద్రుఁ డోర్కుఁడు బాధింపఁ జక్రియుగళి
యిందుముఖి నీకుగుబ్బలై యెనసి యిపుడు
చూడు బహుచంద్రభూషణస్ఫూర్తి మీఱె
ననుచుఁ గుచముల నఖరేఖ లంటఁజేసె ౨౦౩

క. నెల యొక్కఁడె చన జక్కవ, లలికుంతల నీకుకుచములై బాధింపం
గలిగెన్ బహునఖచంద్రా, కలితక్షతిపీడ యని నఖంబులు నాటెన్. ౨౦౪

గీ. సర్వగురుచిహ్నములు గానిచన్నుగోయి
సర్వగురుభావ మెఱుఁగంగ సన్నాముగని
యనుచు గోవిందుఁ డానంద మతిశయింప
లీలఁ గుచముల బాలేందురేఖ లిడియె. ౨౦౫

క. హరినఖపదచిహ్నితమూ, సురుచిరకుచకుంభయుగళి చూడఁగనొప్పెన్
వరశుకశిశుముఖదారిత, పరిపాకమనోజ్ఞలికుచఫలయుగ మనఁగన్. ౨౦౬

చ. గిరులకుఁ జిత్రపత్రలత గీల్కొను టబ్రమొ కప్పురంబుచేఁ
గరము మెఱుంగులీనుమృదుగంధ మలందఁగఁజేసి తెల్లడా
ల్గిరులకు సాటిదెచ్చి యటఁ గేళివసించు శివుండ సయ్యెదం
దరుణి యటంచు నించు హరి తత్కుచసీమ సుగంధపత్రముల్, ౨౦౭

చ. శుకము మహాగమాంతరతిఁ జూచ్చికి నిం పగుదాడిమీఫలం
బకట పునర్విదారణము లందెడునట్లు ప్రియత్నమూనె నా
మొకము సమందహాసమయి ముద్దులు గుల్కఁగఁ గొమ్మపైఁడిడా
ల్పకచకలూనపయ్యెదను జక్కఁగఁ గప్పెను జొమ్ముఁ గ్రక్కునన్. ౨౦౮

*మనసు పుట్టెడు.

క. అతివకుచోన్నతవృత్తిఁ, బ్రతిలేకుండియును మధురరసమేరీతిన్
సతి నీకుచపదమండల, మతిచిత్రము మధ్యవృత్తి యగుచుం జెలఁకున్.

క. గేయ మగు చేరగురుతో, న్నేయంబై సర్వవృత్తనిచయాద్యంబై
పాయదు గా శ్రీవృత్త, శ్రీ యీవక్షోజయుగము శృంగారవతీ ౨౧౦

క. పరుషంబు లగుటఁ గుచములు, సరళంబులు గాక యున్న సఖ చిత్రించే
స్థిరము లగుచున్న వబ్రము, పరమాణుసమానమధ్య పరికింపంగన్. ౨౧౧

క. ఈకుచపదమండలమున, శ్రీకరభావమున మెలఁగు చెలువౌభూషల్
శ్రీకర ముభయశ్లేషయె, కోకస్తని చాలఁజాల గుఱుతుగఁ గంటే. ౨౧౨

చ. మదభిమత(ంపు)శయ్యయయి మానితభూషణమై యదోషమై
ముద మొనరించుఁ గావ్య మన ముద్దుఁగుదవ్వయి చిత్ర మొక్కఁడే
సదమలగాత్రి సద్గుణము చాలఁగ సూక్ష్మతఁగాంచియేని దాఁ
గదిసి సొరంగ సంది యటఁ గానఁగ శక్యముగాదుచూడఁగన్. ౨౧౩

క. ఈరీతిఁ గుచము లెన్నుచు, వారిజలోచనుఁడు కాంతవారస్ఫురణా
ధారము లగుదోర్మూలా, కారావారములచాయఁ గనుచిరా లడరన్.

చ. చెలి కరపల్లవస్ఫురణఁ జెందినదోర్లతికాలవాలమై
యలరెడుబాహుమూలముల కోర్వము ఖాతము తీవె పూఁతచే
వెలయఁగ బాగుగా యనుచు వేడ్క నఖంబులునాటెఁ గక్షలన్
విలసదనూనబాహువుల వేమఱు గందపుఁబూఁత దా నిడెన్. ౨౧౪

క. అవుఁ గనుఁగొనియె శ్రీహరి, యారుచి ముద మొనరఁజేయ హారిరత్నప్రమే
యేరుం జలిచీమలబ, ల్వారుం గలహ్రాసఁ బిలువఁబంపెడుదానిన్. ౨౧౫

గీ. పిన్నకానునఁ బొక్కిటినేల్పుగావి, లేమ యాచెంత మధుకరాలీకమగుచు
గలదు పేశలరోమాళికల్పవల్లి, విబుధవరు లగుమా కొగివేడ్కఁజేయు. ౨౧౬

గీ. అతివ మున్నంతమేనికి నహివరేణ్యుఁ
డభిమతంబైన తల్పమై యలరఁజేసె
నిపుడు రోమాళిభుజగేంద్రుఁ డీకరాబ్జ
ములకె తా శయ్య యగుచుఁ బల్మొద మొనర్పె. ౨౧౭

క. మాయానరేంద్రహస్త, చ్ఛాయల రోమాళిభుజగచంద్రుఁడం మిగులం
జాయపహించెను జిత్రము, ఛాయాసుత నీకుఁ జూడఁ జనదే చెప్పుమా.

గీ. పరమబంధమయుం బోటఁ బరఁగుగాడ, రీతివోలెను జనుదోయి లేమయల్లు
గానరోమాళియను పేరువూనుచీమ, బారుపయి కెక్కె నాభిగహ్వరము వెడలి.

ఉ. పొక్కిటికోమనుండి నలపుంగిరులంచుఁ గుచంబు లంటఁగా
గ్రక్కున నిక్కుకీలఫణిరా జో హో పొక్కిటిపాదునుండి పెం
పెక్కఁగ నిక్కుచున్ బయట నెంతయు సుక్కుచు గబ్బిగుబ్బలన్
జొక్కపుకొండలం చడరి చొప్పడుతీవెయొ యిద్ది చెల్వవే. ౨౨౧

గీ. రమణి మంజులరుచిరోమరాజిభుజగి, తరుణకృష్ణభుజా దండదండశూక
రాజు తెనుగూడ నెంతేని రమణఁగాంచెఁ, జూచితేముద్దుఁదెలితేటచూపులాఁడి.

కం. అతల నీతల దేశము, లేలెఱ్ఱినైనన్ సమృద్ధి నెనయఁగ ద్రావా
పేత మగు మధ్యదేశము, ఖ్యాతిగ న్నిట నహిభయంబు కలుగుటకతనన్.

కం. కాళిందిమధ్యగత మగు, కాలాహి న్నాదుపాదగతి మర్దింపం
జాలితిఁ గరమున నిపుడీ, కాళిందీమధ్యగాహిఁ గడఁగితిఁ బెనుపన్ ౨౨౪

కం. అండఁగొను వారె భూధర, మండలపతు లగుట మిగుల మహిమంబులచే
నుండుకొన మెండులేమిడి. యండగు వారల*నుబీసయుంటఁగ పొగెన్. ౨౨౫

గీ. కన్నెరో కంటివే నీదుచిన్ననడుము, మిన్నుముట్టిన కలిమి చేకొన్న దేని
యొన్న నబ్బుర మిద్ది దానున్నదిక్కు, నెట్టినెఱవాదులకు నేని యెఱుఁగనీదు,

ఉ. ఉరుకుచభూధరంబులకు నొప్పుగఁ బ్రోవలతాసుపత్రముల్
కరముదలిర్పఁ బొక్కిటిచొకాటపుబొడ్డునబావిలోని యా
ద్యరసపు జాలనా మిగుల నందముఁ జెందెదురోమరాజి యం
చురుదు ఘటిల్లఁగాఁ బొగడు నచ్యుతుఁ డా రొగిఁ గేల నంటుచున్. ౨౨౭

ఉ. విప్పగు నాభిదీర్ఘికను వెల్వడి మీఁదికి వేగఁబ్రాఁకుమే
లక్కవ్వారసంపుజాలుగద గట్టిగఁ జొక్కపురోమరాజి యం
దొప్పగు లేఁదరంగరలరయొోగ్గతదంతుర రేఖలోకదే
యొప్పులకుప్ప యీవళు లహో యని మాటికి నంటు మువ్వళిన్. ౨౨౮

గీ. కాదు భావంబు దృష్టికిఁ గానరామి, పటుకుచద్వయిఁ బూన నభావ మొల్లు
నాతియటుగాననుభయభిన్నంబుకాను, మత్స్యరూపంబుగనుటచే మాకుముద్దు

కం. సర్వద్రష్టను నేనను, గర్వం బిఁక మాకుఁ గలదె కనుపట్టదుగా
పర్వేందువదన మధ్యము, సర్వపదార్థాంతరాళిసంగత మయ్యున్. ౨౩౦

---

*నవీడ కట్టగసాగెన్.

గీ. సత్త్వమెనఁ గూడకున్నను జాన నడుము, విష్ణుపదపదమయ్యెడు విసుము విడవ
విష్ణుపదపదమయ్యెడు విధము లేదు, సత్త్వమెనఁ గూడననినవ్వుఁ జిక్రిధరుఁడు.
క. ఘనజఘనకుచపదంబులు, కనఁ నయ్యెను గురువులగుచుఁ గమలదళాక్షీ,
కన వింత మధ్యపద మిది, కనుపట్టెను లఘువిలాసఘటనం బగు మనన్. ౨౩౨
సీ. బలుకొప్పు కార్మొగుల్ బాగుగా ధరియించి తులకించువదనచంద్రుని భరించి
గంధిలనిశ్వాసగంధవాహముఁ బూని తనతారకుచపర్వతంబు లూని
తన్మధ్యసంధానితనభంబు గైకొని పంచభూతమయప్రపంచ మూని
సూక్ష్మాతిసూక్ష్మమై చూడ్కికిఁ గనఁగాక మాయాభిరామమై మహిమఁ గాంచి
తనమహాకాశపద మొప్పఁ దనరు నడుము
పరమసూక్ష్మత మును విష్ణుపదతఁ గాంచు
నిపుడు మద్దేహసంగతి నెనయు మిగుల
విష్ణుపదభావ మని కౌనుఁ బిడికిలించు. ౨౩౩
గీ. వెలఁది కారుణ్యరసమహావేణియందు, బంధురావర్తమై స్వర్ణపద్మమయ్యె
నతిగభీరమహాహ్రదంబయ్యె మెలఁగు, వేడ్కఁ గనుఁగొంటివే నీదు వెడఁద నాభి
చ. కలితతనూలతం గలవికస్వరనాభిసుమంబులోపలన్
మెలఁగుచునుండి మీఁదటను మేల్వలపుల్ గులుకం దదుద్భవో
జ్జ్వలకుచగుచ్ఛముల్ గొన నవారణమైఁ బయికెక్కెఁ బిల్లతేఁ
టులజిలిబారునా జిగిఁ గడుం దనరారెడు నారుఁ గంటివే. ౨౩౪
గీ. కాంత యేలోకమునకైన గగనకుసుమ
దర్శనము సేయ నొకఁడైన దక్షుఁడగునె
యిప్పుడిమింటఁ గనుఁగొంటిఁ దప్పుగాదు
చారుభాస్వరవికసదంభోరుహంబు ౨౩౬
క. శృంగారరసం బిచ్చటఁ, బొంగదె మధురంపుగుణము పొలుపారఁగనో
యంగన మధ్యమవృత్తికె, సంగదె మాధుర్యగుణము సంకేయ మేలా.
క. ప్రవరుక్తివలెను నడికిం, గనవయ్యెను నాభి మించు గడురూపమునం
బువరుక్తవదాభాసం, బనఁగ నలంకృతుల నెఱుక వందుట లేదే. ౨౩౭
గీ. పంకజాక్షి యాకరపంకజమ్ము, చొరఁగఁ దలఁచెను దాఁ బరసుఖముఁ గోరి
చెలువుమీఱెడు నిమ్నాభిలబిలంబు, నన్యకార్యసమాసక్తి యంత వదలి.

మ. అలమింటన్ సురదీర్ఘికం దెలిగజం *బాహ్యాయశాంచత్కరం
బెలమిం జాఁచుచుఁ గ్రీడసేయుఁగద కృష్ణేభంబు కొన్నింట నీ
చెల్వుపెంపుం బలుడిగ్గియుం బ్రమదియై చేసాఁచి క్రీడింపఁగాఁ
దలఁచెం జూచితె యంచు నాభికడకుం దార్చెం గరాంభోజమున్. ౨౪౦

మ. హృదయగ్రంథి మహాదృఢం బవుఁగదా యిప్పుణ్య నీక్షింపఁగా
వదల న్నే నొకలక్ష్యమా యతినికిన్ భావింపఁగా నంబరా
స్పదమా గ్రంథిత నాస్వభావ మనుచుం బాటిల్లుభీతిం గనుం
జెదరె న్నీవి మనోహరాంగి కనుచుం జిత్తంబులో నెన్నెదన్. ౨౪౧

క. ముడిపోడనె వడిమీఱఁగఁ, గడుసాగెం గటి నెసంగుకనకాంబరమున్
సుడివాలుదాల్పుధైర్యవు, ముడి సాకల్యంబుగాఁగ ముద్దుగ జాఱెన్.

ఉ. అత్తఱిఁ జిత్తజుం గనినయట్టిమహాత్ముఁడు రత్నభూషణం
బొత్తు నటంచు నాత్మమృదులోజ్జ్వలచేలచెఱంగు మెత్తనై
మెత్తగఁ జేసి నందిటను మేలిమిబంగరుఁబోఁడిఁ జేర్పఁగాఁ
గుత్తుక పాంచజన్యమొనగూడినచాయ నొనర్చె నచ్చటన్. ౨౪౩

క. నవ్వుచుఁ బువ్వులతూపుల, గ్రొవ్వుచుఁబుష్పాయుధుండుగువ్వుచుఁదిరుగన్
దువ్వుచుఁ గటిపై †జూపులు, రువ్వుచు నెమ్మేను డిగ్గురుచినుతిఁ గనియెన్.

సీ. వివిధరత్నప్రభావిస్ఫురన్మేఖలామాయావిచిత్రిత మనుటకతన
సూక్ష్మాతిసూక్ష్మత శోభిల్లుకతమున బహుగుణాశ్రయతచేఁ బరఁగుకతన
నంత(టం) దనురోచు లడరించుకతమున నర్హాజనంబున నబ్బుకతన
మాలిన్యలేశంబు మలయనికతమునఁ గటినువ్రిపంచంబు గ్రమ్ముకతనఁ
దరుణి మామిత్రి మిమ్మహాంబరము గానఁ
దనకుఁ దా విడి మాకుఁ హితం బొనర్చె
మేము చేసినపని గాదు లేమ మాకు
నేరమించుకయును లేదు నీవు గనియు! ౨౪౫

గీ. భామ కర్ణావతంసాతిపదములందు, జఘనకాంచిసమానగజఘనవదము
గణితమై యున్నదో కాదో కలిమి లేమి, నీ వలంకారవతివిగా నిశ్చయింపు

క. విరసంబై కనుపట్టెడు, సురధునిసికతామయంబు జోడనఁ దగునే
పరమాద్భుతమషమారస, మిరవొందఁగఁ గాననైనయీగటితటిన్.

* బాహ్యాగకాంచ †నూపులు

గీ. అతివ కాంచి గుణస్థాన మగుటకతన, నెతదుజ్జ్వల వరదరాజేష్టవాస
మెట్లు గాకుండు నిటవసియించునట్టి, పరమపూరుషు దలఁచు తావంబుగొనున

గీ. చామ యీకటిధూధరచంద్రమునకు, లీల భూచక్ర మంతయు నేలఁజాలు
భాగ్య మొనగూడ గిరిదుర్గపాలనంబు. పులినదేశంబుగోలు టబ్బురముగాదు.

క. ఈకాళిందినితంబము, జోకై మాక్రీడ నమరఁ జూపెడు మదిలో
నాకాళిందిమనోజ్ఞత, రాకృతిపులినస్థలీవిహారము లెల్లన్. ౨౫౦

గీ. అవదసౌందర్యమై కటి యుపహసించుఁ
బాత్రికృతవ్యాకృతిని జిత్రరసముదోఁచు
నొక్క యెడ నద్ది పురుషత్రయోజ్జ్వలంబు
ప్రథమపురుషైకసంస్పర్శభవ్య మిద్ది. ౨౫౧

గీ. కటిపదంబున *నర్థసంఘటిత మగుచు, జఘన మభిధకు పాటియౌ సన్నితంబ
మాత్మపశ్చాన్నితంబిస్థితియైయుండులక్షణాభిరూప్యంబురుచిగాంచిమ్యక్తిఁబోలు.

క. నిరుపమసంభ్రమ మొదవఁగఁ, గరిగామిని కుంచితంబు గావింతు నిటం
బరమాద్భుతరస మొదవఁగ, వెరవు దలిర్పంగ †నే వివృత మొనరింతున్.

సీ. పొంగుచు నీకటిరంగస్థలంబున లేమ చక్రభ్రమరిం ఘటింతు
ననుమోదభరమున నంబుజలోచన లీల ఛత్రభ్రమరిం దనర్తుఁ
గువలయేక్షణకోర్కికొనలుసాఁగుచుమీఁజునుద్వృత్తమునఁజాలనొప్పు గాంతు
నురుతరమై రాగ మొదవ నున్నతవేణి రథచక్రచారిత రమణనింతు
నతివ యిట్టు హరికాంతి మైయెసంగ, జతనపడుచున్ వైష్ణవస్థానమై హ
సంగ‡వ్యావృతినొందనుఁ జటురవృత్తి, మెఱయునీవేళ నీచేత మెప్పుగొందు.

క. ఈరీతి వచింపుచు హరి, చానుదళీపీనజఘనసంగమమోదా
కారపయోనిధి నీదఁగ, నేరీతి న్వెఱపులేక యెడమెలఁగంగన్. ౨౫౨

క. ఊరువులందుచుఁ దద్గత, చారుమృదుత్వంబుఁ గాంచి సరసకదళికా
కారంబు లధికకఠినవి, కారము లని మనసు సౌఖ్యంగా నిట్లనియెన్. ౨౫౩

గీ. లలన(నీయూరు)యుగళి పేశలతవలనఁ, బరిభవముఁజెందఁగదళికాతరువనంగ
వయ్యె నచ్చట సమసనార్థాంతరంబు, లోకవిభ్రాంతిమూలంబు గాకయున్నె

గీ. తరుణి యూరూత్తరపదోజ్వాధాయకత్వ
మొందు మోగంబునఁ ద్వదూరుయుగళపర్యా

*నసగ్రసంఘటిత † నేలివృత్త మొనర్తున్, ‡వ్యావృతికొందు౹

వారిఁ గనఁడయ్యె ముని త్వరితంబుగతన
నబ్రిమే వార్తికోక్తుల నతఁడు గొనెన.

క. అని యూరుద్వయిపొందిక, కనితరసాధార(ణ)ంబు హర్షముగొనుచుం
గనకపుటూల్లియ వేలుపు, కనకాంగిపదద్వయంబు గనుఁగొను చనిమెన్

గీ. అంతజంఘా(?)లసద్దీప్తియై మెలంగి, లలితవర్గోరురీతుల లక్ష్య మగుచుఁ
దళుకులీనునలంకృతధ్వనులఁ దనరి,రమణి సొగసైన యాపదరచన వెలయు.

గీ. హారికరస్పర్శసంజాతహర్షవిభవ, యతులమృదురూపనీరజాతాధివాస
లక్ష్మి నీపాదములసేవ లాగుచున్న, దింతకన్నను భాగ్య మిం కేమి నీకు

మ. అను చంఘ్రిద్వయదర్శనాగతమహాహర్షంబు లోకాళిక
ల్పవనత్యల్పవిలాసతం గొనునిజస్వాంతంబు నాత్మాశ్రియం
బన కెంతేవడి మీఱి శ్రీధవుఁడు ప్రోగ్రీయాలిం దగం గొఁగిటం
జెనయంజేసి కుచాంతరం బురము నాశ్లేషించెఁ జెన్నొందఁగన్. ౧౬౧

చ. అతిసితంపుటగ్రిముల నందెడు బల్చనుబొంగరంబు లు
న్నతి మిగులంగఁ దాఁక జిగిఁదప్పమురంబు నురంబు(దాఁ)కినన్
ద్యుతి యొకయింతలే కడరుచక్కనిగుబ్బలు వెంటిదార్ఢ్యముల్
ప్రతిఁగొన *నొక్కఁడొక్కటికిఁ బాయునిపొక్కులు యుక్తయోగముల్.

గీ. ఘనలసద్వంశములఁబుట్టి జనులొనప్పు, ఛిద్రముల కోర్చి శుద్ధాంతరిద్రిస్ఫూర్తిఁ
జాలరాణిల్లు మేల్ముత్యసరులువిడుచు, సద్గుణంబుల నుద్ధతాశ్రయముగతన.

గీ. అంతరం బగుజార మూవంత లేక
బయటఁ జెల్వులు గొన్న యాస్వప్నమగన్న
నొక్కటికే పాసి యగు నని యొప్పంబలుకు
చతులహా(రా)ళిసూత్రింబు లపుడు విరిసె. ౧౬౫

గీ. ఛిన్నసూత్రంపుముత్యముల్ చేరువేళ, నవ్యనక్షత్రపుహావిన్ను నవ్వుఁ గొను
ముత్యములునాభిసరసిక మొనయునపుడు,తతపయోధరగళదుదస్రితములయ్యె.

ఉ. కంచుకనామసత్కవచగర్వగతత్వ మఖండసారభా
వాంచితసైనవారలకు నర్హ మగా దని వీడనాడరే
కొంచెపుఁబూత తోడగునె కూడునె కీర్తులు కార్యవేళ నం
చెంచి కుచంబుపూఁత నెడయించె నసం గడువీడెఁ బూఁతయున్ ౧౬౭

* దొక్కడొక్కటికి

క. బలయుతులు లన్యోన్యంబును, బలవత్సంఘర్షసేయ బలమతి నడుమన్
మెలఁగెడునది సనుచుం, దెలుపుచుఁ గుచపత్రికాళిదెరలెన్నిగులన్.

మ. పతమత్కృష్ణము ఖోరుదోషగుణసంబంధాన భిజ్ఞత్వసం
గత మాదార్యసుకాంతిముఖ్యగుణసాంగత్యాభిరామంబునౌ
సతిచన్దోయి యలంకృతాన్యమయినన్ సత్కావ్యముంబోలి శ్రీ
పతిచిత్తాబ్జమునం బ్రమోదభర మాపాదించె నెంతేనియున్. -౨౬౯-

వ. అంత ననంతలీలాపరాయణుం డగు నారాయణుం డమ్మానవతీరత్నంబు నయ
త్నాయత్తాసాధారణాగణ్యాంగలావణ్య బనిదం ప్రథమపరిదృష్టం బయ్యె
నిదంప్రథమావలోకనసంపాదితానుమానకుతుకంబు మనంబునకు *నా
పాదింపం దలంపుతో నిబ్బరంపుటబ్బురం బొంగుబ్బుకొన నోయలినీలకబరీ
కబరీభారంబున నుదాత్తాలంకారంబును గలితాలికాలకంబున వక్రోక్త్యలం
కారంబును గమలాననంబున వికస్వరాలంకారంబును గన్నుదోయి నుత్ప్రే
క్షాలంకారంబును గలికానాసిక లలితాలంకారంబును గపోలయుగళిం జిత్రా
లంకారంబును గర్ణంబులఁ గుండలీబంధాలంకారంబును గన్నుబొమల
దృష్టాంతాలంకారంబును గమనీయాధరంబున రసవదలంకారంబును
గంబుకంఠంబున సత్యోక్త్యాలంకారంబును †గనకకుంభకుచంబుల ‡శ్లిష్ట
రూపకాలంకారంబును గనద్బాహుల మాలికాబంధాలంకారంబును గర
తలంబులఁ బద్మబంధాలంకారంబును గప్పనూగారున నాగబంధాలంకా
రంబును గనకచ్ఛాయంపువళుల విషమాలంకారంబును గౌనుదీఁగె సూ
క్ష్మాలంకారంబును గభీరనాభి నతిశయోక్త్యలంకారంబును గటితటుల
సారాల్లంకారంబును గరభోపమోరుల రూపకాతిశయోక్త్యలంకారంబును
గాఁడిలిజంఘల ననన్వయాలంకారంబును గలపదంబుల విరోధాభాసాలం
కారంబును సర్వాంగంబుల సమాలంకారంబును ధరించునించుఁబోఁడిది
గావున నానాలంకారలీలామూలాస్పదంబ వయి వెలుంగెదవు గావున
ననుపమ వేఱె నువమసగుటకు సంశయం బొకయంబున నుదయింప
నేర్పునే యనుచు నగుచు నవ్వారాశోహానిజపటుకరవికోలదోరంతరారో
హం గావించి చాలపొద్దు పుచ్చుకొన ననంతరంబ -౨౭౦

* నాపాదింప † గుననగుచంబుల ‡ శ్లిష్టోపమాల్పకారంబు

ఉ. అత్తరళాయతాక్షి యసమాయుధుపూర్వరణంబు శ్రీహృదా
యత్తునిచిత్త మాత్తకుతుకాతిశయంబునఁ జేసె వ్యక్తిగా
ధ్వాత్తచమత్క్రియం బయి నిరస్తసుశబ్దవిశేషవాచ్య మై
యుత్తమకావ్యమున్బలె సదుజ్జ్వలభావసమృద్ధాన మై. ౨౭౧

క. దయపడుటనో గురుజను లని, భయపడుటనో శాంతి నేమొ బాణాసనని
చ్చయములు గొనవాడుటనో, కయి సిర్వ్యాపార మయ్యెఁ గందర్పునకున్.

చ. అలరులవిల్లు నీరసత నందఁగ నాఁకటిచిచ్చు హెచ్చఁగా
*వలియుచు వీఁకివీఁకిపడు బంభరపాళి ధనుర్గుణంబుచేఁ
గలుగదు కార్యసిద్ధి యని కంజశరాసనవీరుఁ డత్తఱిన్
విలు గొనకుండఁగా నిడియె వేళమ ధ్యానతి కేలుఁదమ్మికిన్. ౨౭౩

సీ. సజలాంబుదంబున జతకూడి యెడయక మెఱయుచుండెడు కారుమెఱుపనంగ
హరిమణిస్తంభంబునందు నందము మీఱఁబూనిక్కఁ జెక్కిన పైఁడిబొమ్మయనఁగఁ
దనరారుసహకారతరు(వు)తోఁ బెనఁగొంచు లలిమించుమాధవీలత యనంగఁ
బరమకారణ మైనబ్రహ్మంబు ననుపున సంగతం బగుచిత్రశక్తి యనఁగఁ
బొలిచెఁ గాళిందినెమ్మను భువనభయని
వారణాధారనాటోపవామదేవ
ఘనభుజాదండసంతతాకాంత మగుచు
మించువలయిక వొలయు నిద్రించువేళ. ౨౭౪

గీ. ఏకశయ్యాపదప్రవేశైధమాన, మూర్తు లగుచును దంపతుల్ పొలిచి రపుడు
నేకశయ్యావదప్రవేశైధమాన, మూర్తు లైనయలంకారములసరణిగ. ౨౭౫

సీ. చక్రవాకశోకచటులాంధకారంబు దొలుకకుప్పతమంబుతోడ విచ్చె
నమరమూర్ధన్య†దిగ్రమణీయకాంతితో ఘూకోష్ణనిశ్వాసగుణము హెచ్చెఁ
బంకజామోదసంభవముతోఁ గలునలం దదభావసంభూతి గదియవచ్చెఁ
దరుగతపక్షిసంతతిశబ్దములతోడఁ జోరనిశ్శబ్దత సాగియఁజొచ్చె
నఖిలలోకసదాలోకనాంజనంబు, సారధర్మప్రచారాదికారణంబు
జారసంచారదుర్గ్రహోచ్చాటమంత్రి, రాజమగుచు‡నుష ర్వేళ తేజరిలఁగ. ౨౭౬

గీ. సుప్రసాదత సుకవీంద్రసూక్తు లడర, బోధ గైకొనె వేగంబ పువ్వుఁబోఁడి
సుప్రసాదత సుకవీంద్రసూక్తు లడర, బోధ వేగంబ చెందుట పోల్కిగాఁగ.

* ... మూఁడలును అనిలపాసమా? † దిగ్రమణామగంబుతో ‡నుష ర్వేళ

సీ. చలిగాడ్పుచేఁ దీఁగెబలెఁ దేటనెమ్మేన వలరులు జలజలంజలను రాలఁ
గొప్పు చక్కఁ గుదుర్చుకొనఁ గక్షకాంతులు పొంత బంగరుజలపోఁత లీన
నిదుర చాలనియట్టినెఱిలోచనంబులు తత్కాలజలజంబుఁ దప్పుగొనఁగ
మిగిలెడునమరక్తి మగుడిచూడఁగఁజూచి మదనుండు క్రాలూన మనసువడఁగ
హాస్దరస మున్పఁ గాల్యభయంబు నడుప
నలసయానంబు పాదంబు లడుగు లిడఁగ
నంత యిం తనరాని యాయాసపడఁగ
బెడఁగువగలాఁడి పడుకయి ల్వెడలి వచ్చె. ౨౭౯

క. అతిసూక్ష్మాంబరశయ్యా, గతకృష్ణఘనాంగ మెడసి కమలేక్షణ దా
నతిమందయానమున *రా, నతిభద్రితటిద్విలాస యగుచుం బొలిచెన్.

క. అనలంకృతరూపము గొని, వనజాయుతనయన యపుడు వఱలె ననంగాఁ
జనదే వస్తువ్యంగ్యం, బనలంకృత మైన మోద మచ్చట లేదే ౨౮౦

గీ అతనుభూషణవిస్ఫూర్తి నందితొలుత, సుతనువు తనూమతల్లి సొగసుపూను
నతనుభూషణవిస్ఫూర్తి నందకున్న, నతనుభూషణవిస్ఫూర్తి నలరె నపుడు.

గీ. సుప్రసాదత సద్వ్యక్తి సుభగ యగుచు
ఘనతరాలంకృతిస్ఫూర్తి గొనక మగువ
యుత్తమం పుఁగృతి న్నగునొక్కవింత
యొక్కయెడ సంస్కృతిచ్యుతి నొప్పు మిగుల. ౨౮౧

సీ. సానవట్టినయట్టి జలజాతబాణుని చేతిమిన్నా హేతిఁ జెన్నకుదానిఁ
జానుపుంస్కోకిలాస్వాదితం బైనట్టి కొమ్మావినిం దప్పు గొనెడుదాని
సంతతరాజహంసక్రీడితం బైన కమలినీకైబొమ్మగట్టుదాని
మలయశైలాశ్రాంతమగ్నసల్లాంత మా సుమశాఖఁ జులుకఁగాఁ జూచుదాని
దపనసుతఁ జూచి ద్వారంబు దాఁటువేళఁ, దోడినెచ్చెలికత్తెలతోడవచ్చి
బిగ్గఁ గౌఁగిటఁ జేర్చుచుఁ బేర్మిమిగుల, మేలుగాఁ బల్కె నొకవాణి నీలవేణి.

ఉ. కోరిక దీరఁగా మగసిగూడి సుఖించిననిన్నుఁ జూచినన్
మేనకు మీఁఱుమోదమున మేను సుఖంచె మనంబు చింత మా
నూఱడె నీవు సెజ్జకడనుండి కటాకట తోడులేక యీ
ద్వారముదాఁక నిట్లిటకు వచ్చితివమ్మ భయంబు దక్కుచున్. ౨౮౪

* దానతిశదరి-

ఉ. అంతట నింతియోర్తు నగ వానన మానుకొనంగఁ బల్కె నీ
యింతికిఁ దోడు గావలెనె యిక్కడ కక్కడనుండి రాఁగ నా
వంత భయంబు లోఁగొనక యాత్మవిభుం దరుదంద నీనిశం
గంతుదురంబుఁ జేసి పలుగాయము లందినమేటి గావునన్. ౨౮౫

ఉ. అప్పుడు నీలవేణి చెలియందపుఁజేష్టలు చూడఁగోరి యో
య్యొప్పులకుప్ప నీదుమది కొప్పుగ నేఁ డలపూని కఁ బూనెనే
తప్పక చెప్పు మన్న నగుఁగాల్చుట సిగ్గున మోమువాంచుటం
జెప్పెను నాతి యంతరము చిన్నెలు చెప్పఁగఁ బోనరుక్తిగన్. ౨౮౬

వ. ఇట్లు కాళిందీమిళిందచికురం గరగ్రహణంబుచేసి యనంతరంబ మిత్రవిం
దాకుందరదనం బెండ్లియాడి నాగ్నజితీరూపవతిం జెట్టపట్టి భద్రాభద్రే
భయానం గాలుదొక్కి మద్రరాజన్యకన్యక యైనలక్షణకుం బొట్టుగట్టి
యష్టమహిషీనయన చకోరశరదాకానిశాకరుండై యక్కపటయాదవవ
రుండు పిదప నరకాసురుం దునిచి (యింద్ర లోకంబునకుం జని యదితిచేఁ
గుండలంబులు గొని పారిజాతనగంబు సంగ్రహించి నరకుం దునిచి) తత్కా
రాగృహాక్రాంతషోడశసహస్రరాజకన్యకల నాత్మకరగ్రహణంబున ధన్యలం
గావించి తద్యానతనిరంతరప్రమోదాపాదనదక్షిణుం డగుచు దక్షిణుండై
ధీరలలితనాయకోత్తముం డన వెలయుచు మునులకుఁ దపఃఫలం బై యరి
వీరులకుఁ గృతాంతుం డై యర్థులకుం జింతారత్నంబై ధనుర్ధరులకు వీరా
గ్రేసరుండై విద్యార్థులకుఁ బరమాచార్యుండై గాయకులకు వాగ్గేయకా
రశిరోరత్నంబై శరణాగతులకు వజ్రపంజరంబై విదగ్ధులకు (ర)సికావతంసం
బై మదవతులకు నభినవమదనుం డై సంఖ్యావంతులకు శాస్త్రవేత్త యై
నటులకు హల్లీసకతల్లజుం డై కర్మఠులకు ననుష్ఠాతృప్రకాండుండై తత్త్వవా
దులకుం బరమతత్త్వం బై యోగీంద్రులకు లక్ష్యం బై (రస)వాదులకు జగ
దేకరసంబై సుగుణవాదులకు నుపాస్యం బై భాసిల్లుచుండె నయ్యవ
సరంబున. ౨౮౭

సీ. *శాస్త్రంబు గతి ననుష్ఠాపకత్వవిలాసభాసురంబై చాల వాసిఁగాంచె
దా(హకరో)దారదనకేలి వంధ్యాకుమారునిలోఁ బొందు గోరుకొనియె

పంగిదిమివాక్యము సందర్భశుద్ధిగాలేదు *శాస్త్రంబుశీల-

దారిద్ర్యఖేదసుధానంబు గగనమండలపుండరీకంబు చెలువు మీఱ
శశమృగంబుశిరంబు చక్కఁదొక్కి మెలంగు కొమ్ము సద్ధర్మ మిమ్ముచేసె
నవనినాబాలగోపాల మఖిలజనుల, నలువుమిగులంగఁ బ్రోచెనవరసముల
నలప్రసాదంబుపొందెడునవ్వుగాఁగ, నతులసౌఖ్యంబు మాపసులనుదుగనఁగ.

సీ. మంగళ మంగజాతరిపుమంజులమానసమధ్యవర్తికిన్
మంగళ మబ్జజప్రముఖమానితదైవతచక్రవర్తికిన్
మంగళ మానతార్తిహృదమంగళభంగదసారకీర్తికిన్
మంగళ మాదిమూర్తికి ఘన ప్రభమూర్తికి రామమూర్తికిన్.     ౨౮౯

గద్యము.

ఇది శ్రీమదామచంద్ర చరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి మాధవ
యజ్వసముజ్జ్వలత్కృపోక్షితకటాక్షాసాదితపాండిత్యాభరణ ప్రభం
జనవంశాబ్ధిరాకాశశాంక నిరంతరారాధిత విచక్షణ శశాంక
అభినవనన్నయభట్టారకా హోబల పత్యాహ్వాయ
కవిమహోపాధ్యాయభట్టారక విరచితం
బైనకాళిందీకన్యాపరిణయం బను
మహాప్రబంధంబునందు
సర్వంబునుష్టాశ్వాసము.

---

ద్వితీయభాగము సంపూర్ణము.

# కాకినాడ-పరిషత్కార్యాలయమున వెలకు దొరకు గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయకవి | రు 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి ... ... | 0 | 10 | 0 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి ... | 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్లపాక పెదతిరుమలార్యుడు ... | 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము-శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు బి. ఏ., యల్. టి. ... ... | 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి ... | 0 | 2 | 0 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు ... | 0 | 3 | 0 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము-జ. రామయ్యపంతులు గారు, బి ఏ., బి. ఎల్. ... ... | 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి | 0 | 8 | 0 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి ... | 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రితగ్రంథసూచిక ... ... | 0 | 8 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపలి వేంకటరమణాచార్యులుగారు ... ... | 0 | 12 | 0 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు ... | 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్. ... ... | 0 | 8 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి ... ... | 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... ... | 0 | 8 | 0 |
| 17 | Dravidian Lexicography ... ... | 0 | 4 | 0 |
| 18 | ప్రహస్వరంగములు-క్రొత్తపల్లి సూర్యారావుగారు ... | 0 | 8 | 0 |
| 19 | నారసింహపురాణము ఉత్తరభాగము-హరిభట్టు ... | 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాసవిలాసనాటకము—రంగాజమ్మ ... | 0 | 8 | 0 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయకుడు ... | 0 | 12 | 0 |
| 22 | కాళిందీకన్యాపరిణయము. (మొదటిభాగము) అహోబలపతి | 1 | 0 | |
| 23 | రెడ్లనాటి రెండుశాసనములు-శ్రీనాథుడు ... | 0 | 4 | |

Printed by M. Rangiah at the Cocanada Printing works, Cocanada